# తొలిపలుకు



శ్రీ పిఠాపురము మహారాజులయిన శ్రీమద్రావు వేంకట మహీపతి గంగాధర రామరాయలవారి యాస్థాన కవిపండితు లలో నెన్నికగన్న బ్రహ్మ శ్రీ దేవులపల్లి సుబ్బయ శాస్త్రిగారును, వారి తమ్ములయిన వేంకటకృష్ణ శాస్త్రిగారును శతఘంటికాద్యవధాన ములు పెక్కు లొనర్చి, రాజసత్కారములు పొంది, కీర్తిశేషులయిన మహాకవులు.

వీరిలో రెండవవారు శ్రీగంగాధరరామరాయల కోరిక ననుసరించి, యీ రావువంశముక్తావళి యనుగ్రంథమును రచించి యా మహారాజు గారికే యంకితము చేసినారు.

ఈ గ్రంథము కేవలము చారిత్రకగ్రంథమే యైనను వివిధ వర్ణనములతోను, శబ్దాలంకారములతోను, నర్థాలంకారములతోను, సులువుగా బోధపడఁగల శ్లేషలతోను, మనోహరములైన ముచ్చట లతోను, ముద్దులొలుకు కమ్మని తేట తెలుఁగు మాటలతోను మృదు మధుర శైలిని రసవంతముగా రచితమయినది. ఆంధ్రసాహిత్యకావ్య శ్రేణిలో నీ ప్రబంధ ముత్తమశ్రేణికిఁ జెందఁదగిన కావ్యముగా నున్నది.

కథావస్తువు రావువంశానుక్రమమే యైనను, సందర్భోచితముగా నాయాకాలముల పరిస్థితులు, నాచారవ్యవహారములు మొదలయిన పెక్కువిషయములు సైతము రమ్యముగా రచితములయినవి; కనుక, ఈ గ్రంథము కేవలము రావువంశము వారికిని వారి యాప్తులకును మాత్రమే కాక తెలుఁగువారి కెల్లరకును రుచింపఁగల కావ్యము.

శ్రీ పిఠాపురము మహారాజుగారు, సాహిత్య చక్రవర్తి, డాక్టర్ శ్రీ రావు వేంకట కుమార మహీపతి శ్రీ సూర్యరావు బహద్దరువారు తమ యాస్థాన కవిపండితులై యుండిన వేంకటకృష్ణశాస్త్రి గారియెడలఁ దమకుఁ గల యాదరము కొలఁదిని దక్కిన గ్రంథములతోపాటు నీ గ్రంథమును సైతము ముద్రింపించి తెలుఁగువారి కృతజ్ఞతకుఁ బాత్రులైనారు.

మద్రాసు.<br>28-4-'50

గిడుగు వేంకట సీతాపతి.

శ్రీ గస్తు.



శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# రావువంశముక్తావళి



శ్రీలీలావనమాలికాలతఫలశ్రీఁ గాంచె నాఁ జొక్కమా
సాలగ్రామసరంబురంబునను మించం బీఠికాపట్టణో
ద్వేల ప్రాభవరక్షకుండయిన కుంతీమాధవుం డీవ్రత
న్వ్యాలాయంబుగ రామరాడ్విభునకున్నంతాన బాహుళ్యముల్ 1

చ. లలిత పరాక్రమక్రమవిలాస కలాసముదాయ [1]భోగభా
గలఘుతరాచ్ఛలక్షణము లారసి యారసికుండెయర్హుఁడం
చెలమిని రామరాడ్విభున కిందిర సుందరమందిరంబుల
న్నిలచి యనేకరాజ్యపద నిశ్చల యుక్తిఘటించుఁగావుతన్ 2

మ. [2]హిమరోచిర్మకుటంబువాఁడు సురవాహిన్యుత్తమాంగంబువాఁ
డమరౌఘప్రమద ప్రదాయి యగువాఁడానందరూపంబువాఁ

1. సుఖమునుపొందించు. 2. చంద్రుఁడు.

పెమరం గుక్కుటలింగమూర్తి, లసమానామోద విస్ఫూర్తిని
త్యము గంగాధరరామరాయమణి కీష్టావాప్తిఁ గావించుతన్ 3

సీ. సర్వమంగళగాన సర్వమంగళదాన
చాతురీకలనంబు [1]సంతరించి
దుర్గగావునమహా [2]దుర్గావనస్పృహా
నిరతతాత్పర్య విస్ఫురణఁగాంచి
యార్యగావున సమస్తార్యసేవాక్రమ
స్థిరతత్పరత్వవృత్తిని ఘటించి
యచలాత్మ భవగాన [3]యచలాత్మభవ మాన
నీయసంపదఁ గరుణించిమించి
రాజరాజేశ్వరీదేవి రావురామ
రాయరాణ్మౌళికి నిరంతరాయరీతి
రహిఁదగ నిత్యోధికాఖండ రాజ్యలాభ
ముల నొసఁగుఁ గాత జాతప్రమోదయగుచు. 4

సీ. [4]తలఁపు పేరిటి తేట [5]కొలఁకు సాహిణములోఁ
జెలఁగు[6]వార్వము నెక్కి మెలఁగు రాతు
[7]జిడ్డునీర్వామిఁ[8]గన్నెవిసెజ్జపైనత్తె
మిల్లెడు[9] తెలుగంటి మేటి కాన్పు

1. ధరించి. 2. గొప్పకోటనురక్షించునాశక్తి. 3. భూమి.
4. మానస. 5. చెఱువనుగుఱ్ఱాలసాలలో. 6. హంస.
7. పాలసముద్రము. 8. శేషశయ్యపై. 9. దేవతా.

విసువక మెయి తాల్పు[1] నొసటి యొంకులఁ బుట్టు
పంట చందము వ్రాయు వ్రాతకాఁడు
పల్కువాల్గమి నిరాబారి మొత్తము నూడి
గము సేయు పేరోలగంబు వాఁడు
మిక్కుటపు[2] నిక్కపు జగంపు టిక్కవాఁడు
నలువ[3] కబ్బంపుఁ జెలి నేలు చెలువుఁడైన
రామరాయని కొలపువారలకుఁ గూర్మి
యెసఁగ నూతేండ్లప్రాయంబు నొసఁగుఁగాత. 5

సీ. ఘనసీలముల చొప్పలను బోలఁగల కొప్పు
చిన్ని జాబిలిపువ్వుల చెన్ను మీఱఁ
గపురంపు మగమానికపుడంబు నగు మేని
తళతళ ల్జిలుఁగు వెన్నెలలు గాయ
నరవిందతతబృంద వరసుందరత నింద
పలుచుకన్గవ తెల్విఁ బాదుకొల్పఁ
బసమించు నలమంచు హసియించఁ దలపించు
తెలిపట్టు పుట్టంబు తేట గులుక
నలువ నలువైన నలువాలఁ జెలువు మెఱయ
నిలువఁగానున్న పలుకుల వెలఁదిమిన్న

1. నుదుర నెడు పత్రములందు. 2. సత్యలోకము. 3. కావ్యమనెడు ఇంతిని.

కృతివధూనాథుఁడగు రామనృపతివర్యు
రసన కసమానసరసవా[1]గ్వ్రసర మొసఁగు. 6

సీ. తన కర్ణయుగ్మచాలన విలాసంబులు
చామరాందోళన సరణిఁ బెనుపఁ
దన రధనాగ్ర[2]ముద్దామతరై కాత
పత్రమహావైభవంబుఁ జోనుపఁ
దన[3]పుష్కరాగ్రాంబుధారాప్రవాహంబు
లమిత రాజ్యాభిషేకములఁ దనుపఁ
దన గణనాయకత్వము [4]సంగరాభంగ
చతురంగసైన్యప్రశస్తి మనుపఁ
దన ప్రథమపూజ్యభావంబు ధరణి వలయ
నాథలోకవరాగ్రగణ్యత్వ మునుప
ననుపమప్రేమ [5]హేరంబుఁ డనిశ మొసఁగు
రామరాయేంద్రురాజకార్యముల ఫలము. 7

సీ. త్రిజగద్విభుత్వవర్ణితచరిత్రస్ఫూర్తిఁ
దగు నమరేంద్రుఁ డెద్దాని ననిపె
సర్వ జంతువ్రాతచైతన్య హేతువై
తగు జగత్ప్రాణుఁ డెద్దానిఁ దెచ్చె

---

1. సముదాయము. 2. గొప్పప్రభుత్వసంపదను. 3. తొండముకొన.
4. యుద్ధమందుఁబరాజయములేని. 5. విఘ్నేశ్వరుఁడు.

లోకభీకరదైత్య [1]లుంటాకపటిమచేఁ
దగురాఘవేంద్రుఁ డెద్దానిఁ గొనియెఁ
బ్రథిత సంపూర్ణసంపత్ప్రదానఖ్యాతిఁ
దగుమహీతనయ యెద్దానిఁబడసె
నట్టిహారంబు [2]నజుతఁ బట్టాభిషేక
సమయ సత్కారముగఁ దాల్చియమరునట్టి
యాంజనేయుండు రామరాయాధిపతికి
భోగ బలవిక్రమైశ్వర్యముల నొసంగు. 8

మ. గురులస్మజ్జనకుస్మదగ్రజుని [3]దిక్కోటిస్ఫురత్ ఖ్యాతి సుం
దరులన్ శ్రీరఘురామపాదయుగళధ్యానైకనిష్ఠావిభా
స్వరులన్ వెంకటకృష్ణశాస్త్రివరుసుబ్రహ్మణ్యసూర్యాగ్రణిం
జిరకీర్తిప్రతిభావిశేషములకై సేవింతునశ్రాంతమున్ 9

సీ. ఎవని జిహ్వాగ్రంబు కవితానటీమణి
కాద్యప్రవేశరంగాంతరంగ
మెవని వక్త్రంబు కౌరవవంశరాట్కథా
వల్లికాతతి కాలవాల భూమి
యెవని గ్రంథంబులు నవకావ్యవేదపా
ఠాదిస్మృతికిఁబ్రాణవాక్షరంబు
లెవని యాస్థానంబు కవిరాజహంసల
కసమానమానసాఖ్యహ్రదంబు

1 సంహరించు. 2. మెడయందు. 3. ఎల్లదేశములందు.

వారి వినుతింతు వాల్మీకి వ్యాసుఁ గాళి
దాసు భోజుని మత్ప్రబంధప్రభుత్వ
రమ్య కీర్తిప్రతిష్ఠాంక రామరాయ
నామమాకల్పవిఖ్యాతమై మెలంగ. 10

క. భారతపురాణభాస్వ
త్ప్రారంభాంతరసమగ్రతాతిశయశ్రీ
కారణులైన [1]త్రిమూర్తుల
శ్రీరమ్యుల మత్కృతి ప్రసిద్ధికిఁ దలఁతున్. 11

మ. ధ్వనినాఁ జప్పుడటంచు శయ్యయనఁ దల్పంబంచు దోషంబనాఁ
గను బాపంబను చర్మమన్న సమభాగంబంచుఁ బాకంబటం
చనిన న్వంటయటంచు వృత్తియనిన న్వ్యాపారమానంచు నే
ఘనబుద్ధుల్వివరింతు రక్కవుల వక్కాణింపఁగా నేటికిన్. 12

వ. అని యిష్టదేవతాభివందనంబును సుకవిజనాభినందనంబునుంగావించి యేనొక్క పురాతనాద్యతనపుణ్యశ్లోకరాజ చారిత్రంబురచియింపం గోరి యున్నసమయంబున 13

సీ. శ్రీపీఠికాపురస్థిరతరప్రాకట
ప్రాజ్యరాజ్యరమాధురంధరుండు
పద్మనాయకకులోజ్జ్వల రేచరలగోత్ర
వర రావువంశభూపాలమౌళి

1. కవిత్రయము.

వరపయోధరసుధాకరకల్పతరు[1]కల్ప
భూరిదానకళా విశారదుండు
శ్రీసతీ సదృశలక్ష్మీ వేంకయాంబికా
సూర్యరాడ్ఘనతపస్స్ఫూర్తిఫలము
నిర్మితానేక దేవతానిలయ నివహ
గోపురాంతిక విస్ఫురద్గోపురుండు
రమ్యగుణుఁడు గంగాధర రామరాయ
భూమినాయక జన శిరోభూషణుండు. 14

వ. వెండియు నుద్దండనిజభుజాదండకోదండనిర్యత్కాండమండలీఖండితాఖండరథకాండ వేదండదండనాథసనాథవిరోధివరూథినీకాండ నిర్భిన్నమార్తాండమండలప్రభాదానశౌండప్రచండప్రతాపప్రకర్షుండును బరిపాలితప్రజాహర్షుండును స్వకీయాఖండరాజ్యమండలపరిపాలనప్రవీణతాపరీతనీతికలాకౌశలీకలాపకోదారవ్యవహారపారంగతాభంగరంగద్బలపరాక్రమక్రమావక్రవితతవితరణాశ్రితభరణాద్యగణితగుణమణిగణాభరణసూర్యరాయభూరమణాగ్రేసరాత్మజాతుండును నాశ్రితపారిజాతుండును నిరంతరహరిహరచరణకమలకైంకర్యకార్యతాత్పర్యధైర్యస్థైర్యగాంభీర్యచాతుర్యమహౌదార్యాదివర్యగుణజాలుండును దీనదయాళుండును శ్రీమత్పీఠికాపురాదిసంవసథసంస్థాపిత సత్రాన్నసంతుష్టశిష్టభూసురవరనికరవిరచితాపరిమితపుత్త్రమిత్ర క్షేత్రధనకనకమణీభూషావిశే

1. కొంచెము తక్కువగా సమానమైన.

షాభినవప్రాజ్యరాజ్యాద్యభ్యుదయంకరవరాశీర్వచనపాత్రుండును గర్ణాంతవిశ్రాంతనేత్రుండును సేతుశీతాచలాంతరాళవిలసితగోకుల బృందావనకాశీగయాప్రయాగాద్యగణ్యపుణ్యక్షేత్రయాత్రాచరణ పవిత్రీకృతగాత్రుండును మహనీయచారిత్రుండును శ్రీమడ్యూకాఫ్ బక్కింగుహాం డి, యఫ్ కార్మికల్ ప్రముఖానేకహూణ ప్రభువరవిర చితశ్లాఘాసమాసాదితదిగంత విశ్రాంతసత్కీర్తి సమాజుండును సకలవిద్యాభోజుండును సంతత వేదాంతవిద్యానిగూఢజ్ఞానసంజనితని రుపమానందకందళితహృదయారవిందుండును విదళితాహిత బృందుండును సమధికసత్కారసంతోషితసత్కవిమండలుండును నగు శ్రీమద్వేంకటమహీపతిగంగాధరరామరాయభూమండలా ఖండలుండొకానొకవాసరంబున- 15

సీ. పటికంపు గమిఁ బెంపుఘటియించు రుచిసొంపు
నెగడు గోడల నిగన్నిగలతోడ
నలతారకలమీఱఁగల హీరములతోర
మగు కుట్టిమపు ధగద్ధగలతోడఁ
జెలువంపు జిగినింపుఁ దులకింపు బలుకెంపు
లలరు చూరుల తళత్తళలతోడ
[1]ఘనలీల మనలీలఁగను నీలమణిజాల
[2]జాలకంబుల చకచ్చకలతోడ

1. మేఘముల విలాసము వృద్ధిచెందునట్లు. 2. కిటికీల.

నలుగడలఁ గాంతిపూరము ల్వాలగొనంగ
వింత[1]సంతనఁ దగు[2]వైజయంతి మనఁగఁ
దనరు బలుసొరు గలుగు పదారువన్నె
మేలి బంగారు జిగిమీఱు మేడలోన. 16

సీ. ఒకక్రేవ వరభావయుతపావనకవిత్వ
నిపుణతఁ గలుగుపండితులు దనరఁ
నొకదండ నురుభండనోద్దండ విక్రమ
క్రమమొప్పు బంధువర్గంబు లలర
నొకయోర [3]నాంగీరసోదారసద్బుద్ధి
నెసఁగు మంత్రులుపురోహితులు జెలఁగ
నొకసీమ ఘనసామజోద్దామ బలముచే
సఱలెడు భటపరంపరలు గొలువ
ఘన వినూతనరత్నసంఘటిత మగుచు
నమరు సింహాసనంబునం దధివసించి
ప్రాకటాఖండలాఖండవైభవంబు
చెలువు మీఱంగ నెలమిచేఁ గొలువొనర్చి. 17

మ. ప్రతిభం గొందఱకు న్విలాసము దలిర్పన్ రాజకార్యక్రమ
స్థితులుం గొందఱక న్విరోధిహనన శ్రీధుర్యశౌర్యప్రసం
గతులుం గొందఱ కర్థిదీనజనరక్షాకృత్యనిర్ణీతప
ద్ధతులుం గొందఱకుజ్జ్వలప్రచుర విద్యాగోష్ఠులుం దెల్పుచున్. 18

---

1. సంపత్తో. 2. ఇంద్ర భవనము. 3. బృహస్పతి.

చ. ననుఁ బరిపూర్ణనైజకరుణాలసమానకటాక్షలబ్ధకాం
చనవసనాద్యనూనవిలసద్బహుమానవిభాసమానుఁ గా
వన రఘురామదివ్యపదభక్తుని వేంకటకృష్ణశాస్త్రి స
ద్వినుతవిధేయతాఖ్యుఁ బిలిపించి సమంచిత గౌరవంబునన్.

క. తనసన్నిధి నుచితస్థితిఁ
జనవునఁ గూర్చుండ సెలవొసంగుచు మిగులం
గనుదమ్ములఁ గనికరముం
దనరఁగఁ జిఱునగవుమొగమునం దళుకొత్తన్. 20

క. శ్రీచారువీక్షణంబులఁ
జూచిముదం బలర నిటులు సురుచిరలీలన్
[1]మోచారుచిరుచిరోజ్జ్వల
వాచారచనానుకూలఫణితి వచించెన్. 21

సీ. భవదగ్రజన్ముఁడై పరఁగుచుండెడు సుబ్బ
రాయసుధీంద్రుండు రమ్యరీతి
నస్మదాస్థానంబునం దనూనంబుగాఁ
బండితప్రకరంబు నిండియుండ
ఘనమైన శతఘంటికాసత్కవిత్వంబు
మొదలైన యవధానముల నొనర్చి

---

1. అఁటిపండ్లరుచి.

మమ్ముఁ గ్రాల మెప్పించి మదనుగ్రహంబుచే
నయ్యెడ నర్థసింహాసనాది
మహిత బహుమానములఁ జెందిమఱియుఁ గోర్కె
లలరనేఁ కోట సత్కారమందుచుండె
నతని తమ్ముఁడ వనఁగనీవన్నిగతుల
నెసఁగు చుంటివి వేంకటకృష్ణశాస్త్రి. 22

క. మాధుర్యధుర్యమగుచు న
సాధారణరీతి నలరి సద్వినుతంబై
యాధునికులలో మీకవి
తాధోరణి మా కెదన్ముదంబిడు మఱియున్. 23

మ. లలితార్థస్ఫురమాణశబ్దసరసాలంకారశయ్యావిశ్వం
ఖలరీతిధ్వనిపాకవృత్తిగుణముల్ గన్పట్టఁగా సంస్కృతో
జ్జ్వల భాషన్ భవదగ్రజుండయిన సుబ్రహ్మణ్యావిద్వద్వరుం
డలఘుస్ఫూర్తినొనర్చు చుండెను మదీయుంబైన వంశావళిన్. 24

క. గీర్వాణభాషఁదగుకృతి
సర్వజనంబులకు నర్థసందర్భర [1]సా
ఖర్వశ్రీ సులభముగా
నుర్విం గోచరము గాక యుండును గానన్. 25

---

1. అఖర్వశ్రీ=సంపూర్ణమైనశోభతో.

మ. ఒకచోఁ నుజ్జ్వల[1]గోస్తనీఫలనికాయోద్యద్రసంబొల్కఁ న
ట్లొకచోఁ నబ్జమరందబిందునికరం బుప్పొంగి జాల్గొన్న య
ట్లొకచోఁ దేనెలఁజిల్కునట్లు రస మింపొందంగ నాంధ్రంబునం
బ్రకటంబైన మదీయ సత్కులచరిత్రం బీవుగావింపుమీ. 26

వ. అని సగౌరవంబుగా [2]జాంబూనదభూషణాంబరమహోదారముక్తా
హారాగ్రహారకర్పూరవీటీపాటీరానులేపనాదికంబులంబహూకరించి
పుత్తెంచిన. 27

క. నిరుపమతదనుగ్రహవి
స్ఫురణాదరణాతిరేకపూర్వకవిలస
ద్వరసత్కారసముత్థిత
పరిపూర్ణతరప్రమోదభరితాత్ముఁడనై. 28

చ. అలపురుకుత్సశంతను యయాతిదిలీప భగీరథాదులౌ
తొలుతటి ధారుణీపతులతోఁ దులఁదూగెడు సద్యశంబునన్
మెలఁగెడురామరాయవిభునిం గృతికిం బతిగా నొనర్చినన్
సలలితసద్యశోవిభవసౌఖ్యములబ్బునటంచు నెంచుచున్. 29

షష్ఠ్యంతములు.

క. కరుణాకటాక్షవీక్షా
పరిరక్షిత సకలవిపుల పరివారునకున్
గిరిధీరున కతి శూరున
కరి సంహారునకు మన్నె హంపీరునకున్. 30

---

1. ద్రాక్షపండ్లు. 2. సరిగవస్త్రములు.

క. నిరుపమ వేదాంత నితాం
త రహస్యజ్ఞానపావనస్వాంతునకుఁ
వరకీర్తికాంతి పూరిత
[1]హరిదంతునకుం బ్రతాప హనుమంతునకుఁ 31

క. ధాత్రీ సురవరనికర
స్తోత్రార్హజగత్ప్రసిద్ధ సుక్షేత్రమహా
యాత్రా చరణ పవిత్రిత
గాత్రునకుఁ స్థైర్యవిజితఘనగోత్రునకుఁ 32

క. కాండాహత చండాహిత
కాండునకుం బీరనగర ఘనతరరాజ్యా
ఖండక్షితిమండలధృతి
శౌండతరోద్దండనిజభుజాదండునకుఁ 33

క. అంభోనిధి గంభీరున
కుంభవ్యమణీమనోజ్ఞ[2]కోటీరునకుఁ
జంభాహిత సంభావిత
శుంభద్బహుభాగ్యతతికి సుగుణోన్నతికిఁ. 34

క. మంగళతర రుచిరాకృతి
కంగజహరరంగనాయకాంఘ్రిసపర్యా

1. దిక్కులకొనలుగలవానికి. 2. కిరీటము గలవానికి.

రంగనన్మతికిఁ శ్రీమ
ద్గంగాధర రామరాయధరణీపతికిఁ, 35

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగానాయొనర్పం బూనిన రావువంశ
ముక్తావళికిం గథావిధానం బెట్టులనిన. 36

సీ. మహిత గోదావరీమండల ప్రాంతంబు
ప్రాకటాంభోరాశిపరిసరంబు
విశ్రుత[1]తాష్టాదశ పీఠాధిరాజంబు
పాదగయాక్షేత్ర పావనంబు
నిరుపమకుక్కుటేశ్వర దివ్య నిలయంబు
త్రిముఖలింగేశ్వరాధిష్ఠితంబు
శ్రీకుంతిమాధవస్థిరతరాగారంబు
భాస్వదేలానదీ పరివృతంబు
పృథులతర శాస్త్రవరపురాణేతిహాస
వేద వేదాంత విద్యావివేకసహిత
భూసురాగ్రేసరాత్యంత భాసురంబు
పుణ్యనికరంబు పీఠికాపురవరంబు. 37

సీ. ఒకచోట నధిక వైదిక వేదపఠనంబు
లొకచెంత వేదాంతసూక్తిరచన
లొకయోర భూరితార్కికలోకవాదంబు
లొకయెడ ధర్మశాస్త్రోదితంబు

1. దాక్షారామము, కంచి మొ. 18

లోకప్రకట శాబ్దికప్రకరప్రసంగంబు
లోకవంక నకలంకసుకవిగోష్ఠు
లోకసీమ పౌరాణికోపదేశంబులు
నొకక్రేవ వైద్యశాస్త్రోక్తఫణుతు
లొకట తావున జ్యోతిషానూనవచన
రీతు లొకదండసరససంగీతమధుర
కలరవంబులుఁ బొలుపొందఁ బలుకుఁజెలికి
గాపురంబనఁ దగుఁ బీఠికాపురంబు. 38

మ. పరమోత్కృష్టత నొక్కపుణ్యనది శుంభద్దానసంరంభబం
భరసంభావిత భూరిసౌరభలసత్పంకేజపాళీమనో
హరమై పీఠపురోపకంఠమున నేలాభిఖ్యచే నొప్పు న
ప్పురలక్ష్మీసతి దాల్చినట్టి సొబగౌ ముత్యాలహారంబునాఁ. 39

సీ. పరిపక్వఫలగుచ్ఛభరనమ్రకదళికా
వనికాయంబు లేవంక గనినఁ
బికకీరసంచారవిస్ఫారసహకార
తరువార మేయోర నరసి చూడ
[1]మధురసమధురసామధురసారత రేఁటు
వనికాగణంబు లేపజ్జఁ గనిన

1. తేనె, ద్రాక్షారసములవలె, అమధుర=పూర్తిగా మధురమైన.

సముద్రగ[1]లాంగలీక్రముక భూమీరుహాకా
త్కరము లేవైపున నరసి చూడఁ
జారుకేదార కోదారసస్యసహిత
సుమహితక్షేత్రచయము లెచ్చోటఁ గనినఁ
బ్రవిమలస్వాదుతరభూరివారిపూర
భాస్వదేలామహానదీప్రాంత సీమ. 40

మ. ఎలమి న్వేలుపుటేటిసాటియగు నయ్యేలేటినీటన్సతీ
తిలకంబు ల్జలకంబులాడు నెడఁదద్విస్ఫారవక్షోజమం
డలహారిద్ర రసంబొగిం గరఁగుచు న్వ్యాపింపఁ దత్సంప్లుతిం
గలమవ్రాతము పండియప్పరమునం గన్పట్టుహైమద్యుతిన్. 41

సీ. మహిత[2]శతఘ్నికాసహితసమున్నత
ప్రాకటాట్టాలకాలంకృతంబు
భూరిగాంభీర్యవిస్ఫారదుస్తరఘోర
తర[3]ఖేయవారాశిపరివృతంబు
మంథరోపమగంధసింధురేంద్రాభేద్య
బంధురద్వారకవాటయుతము
దుర్వారగర్వారి సర్వంసహాధిపో
ద్ధురసైనికాత్యంత దుర్గమంబు

1. కొబ్బరి; పోఁక 2. ఇనుపముండ్లుగల కఱ్ఱలతో (ఫిరంగులతో)
3. సముద్రమునుబోలిన కందకముతో.

సురపురసరిద్ఝరీభ్రమాచరణనిపుణ
చంచలాంచలసితపతాకాంచితంబు
కంజబాంధవజవనిరాఘాటఘోట
విశ్రమస్థానవాట మవ్వీటికోట. 42

క. పదునెనిమిది బురుజులచేఁ
బొదలెడు నవ్వీటికోటఁ బొలుపు దలిర్పన్
ద్రిదశాలయంబుతోడం
బదఁపడి వాదింపనేగు పగిది నెసంగున్. 43

సీ. క్రోధనారిచ్ఛిదా సాధనాయతభుజ
యోధనాధాతిసంబాధయుతము
పవనధాటీచర జ్జవనఘోటీస్ఫుర
న్మందురాళింద భూసుందరంబు
సాధోరణామితాసాధారణాయతా
కారవారణఘటాద్వారసీమ
సంగరప్రాంగణాభంగరత్నప్రభా
రంగద్రథాంగశతాంగగణము
సన్నుతాష్టాదశాట్టాల కోన్నతంబు
నతి గభీరపయఃపరిఘావృతంబు
నగుచు నప్పీఠికాపురి నహితరాజ
వర్గదుర్గమమార్గమై దుర్గ మమరు. 44

మ. [1]పరిఘాసిక్షురిభిండివాలశరచాప[2]ప్రాస శూలాగ్రము
ద్గరశూలాదిభయంకరాయుధసమగ్రం బైన యప్పీఠికా
పురదుర్గంబును ముట్టడించి సురలుం బోరాడ లేరన్న యో
దరమే యొక్కరుఁ డేరిచూడనయినం దర్పించి మర్త్యాళికిన్. 45

మ. [3]బరిసీలు[4]జ్జముదాళ్లముల్సురియలుం ఖాండాల్లటారీలు బ
ల్చెరుకాకీటియలు న్మకుందపురి బల్లెంబుల్ ఫిరంగీ[5]లవ
ల్తరహా రేకలలుం[6]జజాయిలును మేత్రిఫిల్తుపాకీలు న
ప్పురి కోటన్గనుపట్టు నైరిభయద స్ఫూర్తి న్విజృంభించుచున్. 46

సీ. ఆలోహనాళంబు లాశారుటీటియ
లావాలుకత్తులు నరసిరేసి
యూ రేకలాబాను లాజజాయీగుంపు
లాఫిరంగీమొత్త మరసి రేని
యూమదేభంబుల నాజిరాలగుఱ్ఱాల
నాపోటుబంటుల నరసిరేని
యూకందకపు బాగు నాకోటబందుబ
స్తా బురుజులపెంపు నరసిరేని
పీఠపురమను నామంబు వినినమాత్ర
మున నె గుండెలునీరయి పోవ నెట్టి

---

1. ఇనుపకట్లగద. 2. ఈఁటె. 3. చిన్నపిడిగలయీఁటెలు.
4. నిడుపైనపిడిగలకత్తులు. 5. పెద్దఫిరంగీలు. 6. చిన్నఫిరంగీలు.

సాహసికులై సెదిరింపఁ జనఁదలంప
రట్టి జిగియును బిగియు నెందైనఁగలదె. 47

సీ. శ్రీలాలితాభోగ కైలాసశోభావి
భాసురంబైన కైలాసమహాలు
మణిగణఖచిత నిర్మల దర్పణ కవాట
రాజిరాజితమైన పూజ మహాలు
నిస్తులాస్తోకసమస్తసద్వస్తుసం
పూర్ణమై తగు నన్నపూర్ణ మహాలు
లసదురు జాలజాలక గతాగత ఘనా
ఘనమైన కనకదుర్గామహాలును
మొదలుఁగాగల్గు ప్రాసాదములఁ జెలంగు
సురుచిరంబగు పీఠికాపురపుఁ గోట
నైజయంతాదిసౌధవిభ్రాజమాన
మగుచుఁ బెంపొందు స్వర్గంబు నతిశయించు. 48

సీ. మహనీయతర[1]సర్వమంగళాశ్రయమగుట
[2]దంతిముఖాశ్రితప్రాంతమగుట
నిరుపమ[3]రాజశేఖరనివాసం బౌట
[4]కలధౌతమయశృంగకలిత మగుట

1. ఎల్లశుభములకు; పార్వతికి. 2. ఏనుఁగులు మొదలైన; విఘ్నేశ్వరుని.
3. శివుని (2 వ అర్థము). 4. వెండిగుబ్బలు; వెండిశిఖరము.

[1]సద్గుణాగ్రేసరసంసేవితం బౌట
[2]భద్రలాంఛనసముస్నిద్ర మగుట
[3]వరబుధాధీశ్వర వర్ణనీయం బౌట
తతి [4]ఘనజాలకాధార మగుట
లలితకైలాసశైలవిలాసభాసి
యగుచుం దత్పురరాజ దుర్గాంతరమున
వెలయు బహుయోజనాంతరప్రేక్షణీయ
లాలితౌన్నత్యమైన కైలాసమహలు. 49

ఉ. ఆరవి పద్మనాయకసమాహ్వయుండౌటను గోటకొమ్మలం
గోటికిం జేరునిల్పినిజగోత్రసముద్వహభూపకోటిపైం
గూరిమివార్తలందెలియం గొంకొకసే పటు నిల్చియుంటనే
ధారుణినిల్చికాయును గదా నడిప్రొద్దున నెండ తీవ్రమై. 50

సీ. మన యేటినీటికంటెను నిర్మలంబంచు
నేలానదీవారిం గ్రోలిక్రోలి
మన నందనోద్యానమునకు జోడిదియంచుం
గోవెలతోంటపూల్గోసి కోసి
మన వైజయంతము నెనయూ నిది యటంచుం
గైలాసమహలొప్పం గాంచి కాంచి

---

1. నందీశ్వరాది (2-వ అ). 2. వృషభధ్వజము (2-వ అ).
3. ఇంద్రాదిదేవతలచే (2-వ అ). 4. కిటికీలు ; మేఘములు.

మనయేలికలపోలికనుఁ గాంచు నితఁడంచు
నరవరేంద్రునిఠీవి యరసి యరసి

యచటనిలుతురు తమవ్యోమయానములను
జదలపై నిల్పి మాధవస్వామివారి
దివ్యకల్యాణమునకు నేతెంచి సురలు
మాఘమాసంబు తిరునాళ్లు మసలుదనుక. 51

సీ. [1]తలయేఱు బలునంచునిలకుడించెనె యంచు
నేలానదీవారి నీఁదియీఁది
యిల్లు విల్లును పీట నిండ్లఁ జేసెనె యంచు
బురవీధిగేహంబు లరసియరసి
ప్రమథులపురభక్తపాళిఁ జేసెనె యంచు
లింగార్చకుల గతుల్ మెచ్చిమెచ్చి
సితమూర్తిఁ గుక్కుటాకృతి గొనర్చెనె యంచు
గౌరీశురూపంబుఁ గాంచికాంచి

గరుడగంధర్వకిన్నరఖచరయక్ష
సిద్ధసాధ్యాదిదేవతాశ్రేణియచట
నుండుఁ గైలాసమున కేగు టుడిగి భక్తి
వఱలుశివరాత్రి యుత్సవం బరుగుదనుక 52

1. శిరమునందలినగి; తలనొప్పి.

మ. సరవిన్మేఘునిగూఢిచేఁ బరగుట న్సారంగభావాప్తిం పు
ష్కరదానస్ఫురణంబుచే నలపుటం గర్ణాధికస్ఫూర్తి బం
ధురమౌ సాగరరూఢిఁగాంచుటను సింధుప్రాభవంబున్దగ
న్గరమాలానములందనర్చు నగరిన్ గంభీరవేదిచ్ఛటల్

సీ. అష్టమంగళ చాతురంతిక పంచక
ల్యాణితాద్యుత్కృష్ట లాంఛనములు
నారట్టసౌవీర పారసీకాదిక
ప్రథిత దేశోద్భూతి భాసురములు
[1]కల్యాణపల్యాణ [2]కనకఖలీనాది
నిరతసమాబద్ధ పరికరములు
ధౌరితవల్గన ధావన రేచిత
ప్లుతముఖ్యగతిభేద భూషితములు
వనజబాంధవసైంధవ ప్రతిభటములు
బలనిషూదనవాహన ప్రతినిభములు
పవనధాటీ నిరాఘాట జవనఘోట
[3]ఝాటములు వీరపురికోటఁ బాటిఁ జెందు. 53

క. హీరింగోబ్రాయనియెడు
చారుతరాశ్వంబురాజ చంద్రునిజవన

1. బంగారు మెత్త. 2. బంగారు కళ్లెము. 3. సమూహములు.

శ్రీరమ్య హయచయంబున
నారూఢివహించికీర్తి నలరుచునుండున్ 54

శా. హూణప్రాభవభాసమానగరిమం బొల్పారు విక్టోరియా
రాణీవారి హుజూరునుండి యిటకున్ రాఁబడ్డమేల్మిన్నగ
ల్యాణశ్రీజవలంఘనప్రదిమచే నశ్వంపుఁబందెంబులన్
క్షోణీపాలురు మెచ్చఁగాఁ గొనియె నశ్వోటంబు సామాన్యమే.

క. తేజీరతనంబది శ్రీ
రాజాజీరావు రామరాయేంద్రులకున్
దేజం బొసఁగుచు గెలుపులఁ
బూజింపఁగఁ జేసెను గుఱ్ఱపుఁ బందెములన్. 56

క. ధారుణిశరసారంగస
మీరగరుత్మన్మనస్సమిద్ధజవశ్రీ
ధౌరంధర్యముగలయా
హీరింగో బ్రాకుసాటియే పెఱహయముల్. 57

సీ. మనసుతోసరిగాఁగ మసవెద ననుమాడ్కి
దలఁచినచోట్లనంతటనె నిలిచి
[1]తౌరంగికుని యింగితంబెఱుంగు తెఱఁగు
నను[2]సాది యనుమతంబుననె మెలఁగి

1. 2. రాతు.

తనధాటి నిర్నిరోధమని తెల్పెడురీతి
నవధులౌ తడకల నవఘళించి
నేనేగుగతిఁజూచి నేర్చుకొమ్మనులీలఁ
దోడివార్వము వెన్కఁ ద్రొక్కినడచి
పందెములయందుఁదనుఁబెంచు ప్రభుఁడు మోద
మంద హీరిముగో త్రా యటన్న పేరి
యశ్వముజయంబుఁగొనుమానవాధినేత
[1]వాసవుఁడుగాన [2]నుచ్చైశ్శ్రవంబనంగ 58

సీ. అశ్వరత్నంబిది యవనిపైఁబూర్వంబు
రాజమహేంద్రపురంబులోన
సొబగొందుచాపరసుపటాలమందు గు
ఱ్ఱాలపందెములైన కాలమందు
డోబిరీ యను హయాణుఁడు సవారుచేసిన
యూస్ట్రేలియా యను నట్టిహయము
నటువలె నతఁడెక్కినట్టి యాంహాదరు
బేలనాఁజను నరబ్బీహయమాయి
గెలుచుకొను వేళఁ దనసముజ్జ్వలజవంబుఁ
గాంచిథామసుప్లెండరుఘూస్టుగారు

1. ఇంద్రుని యంశమున జన్మించినవాఁడు.
2. నిక్కిన చెవులుగలది ; ఇంద్రుని గుఱ్ఱము.

సంతసమునొందురీతిగా సంచరించె
వాహమాత్రంబె యుచ్చైశ్శ్రవంబుగాక. 59

చ. కలితకుతూహలాత్మపరికల్పితనిత్యమఘక్రియానిర
ర్గళహవిరన్న[1]తుందిలపురందరసంభరణప్రకామదు
ర్బలజలదప్రతానబలవర్ధనకారణహోమధూమము
వ్వెలయఁగఁ జేయుచుం బుడమివేలుపు లొప్పుదురప్పురంబునన్.

సీ. ఇన [2]కుమారులుగాని [3]యినకుమారులుగారు
పురుషు తేజశ్శౌర్య గరిమములను
[4]రాజచంద్రులుగాని [5]రాజచంద్రులుగారు
సాటి వైభవరూప సంపదలను
[6]వసుమతీశులుగాని వసుమతీశులుగారు
సరి [7]తితిక్షామహైశ్వర్యములను
[8]భూభృద్ఘనులుగాని [9]భూభృద్ఘనులుగారు
సమతసద్ధైర్య [10]విశ్రాణనముల

నఖిల జగదేకనుతసద్గుణాతిశయము
గలుగు నీరికటంచు సత్కవులు మెచ్చఁ

1. బలిసిన. 2. కుమారస్వామి. 3. రాజపుత్త్రులు. 4. ఇంద్రుఁడు.
5. రాజశ్రేష్ఠులు. 6. భూమి, ఈశ్వరుఁడు. 7. ఓర్పు.
8. పర్వతము, మేఘము. 9. గొప్పరాజులు. 10. ఈవి.

బద్మనాయక వంశభూపాలవరులు
వఱలుచుందురు తత్పురీ వరమునందు. 61

క. వరగుణరత్నపరీక్షా
నిరుపమ కౌశల్యనిధులు నిర్నిద్రకళా
భరణాభిరాములప్పురి
సరసతఁబొలుతురు మహార్ఘ్యజనమూర్ధన్యుల్. 62

క. అతులిత సుగుణసముద్రులు
తతబలబలభద్రు లర్థితతి[1]సురద్రుల్
ద్యుతి [2]కద్రులు ధృతి [3]నద్రులు
[4]నతిభద్రులు మతివినిద్రులప్పురి శూద్రుల్. 63

చ. ఎలమిఁజెలంగు నన్నగరి నెల్లెడ [5]సూనకదంబలీలలన్
[6]వలపులఁ గుమ్మరించుచును [7]బల్లవజాలకభూరిరాగకం
దళపరిపాటిఁగాటిలు [8]చనారతసన్నిహితాళిపాళి[9]మం
జులకలతానగానముల శోభిలుచుం[10]గణికానికాయముల్. 64

---

1. కల్పవృక్షము. 2. సూర్యుడు. 3. కొండలు.
4. మిగుల శుభములుగలవారు; ఎద్దులెక్కువగాగలవారు. 5. పూలగుత్తుల విలాసమువంటి విలాసముతోను, పూలగుత్తులవిలాసముతోను. 6. మోహములను; పరిమళములను. 7. విటులసముదాయమునందలి యొక్కువ ప్రేమయంకురించుట యొక్క క్రమముతో, చిగురుటాకులయు మొగ్గలయు మిక్కిలిఎఱుపుగల మొలకల క్రమముచేత. 8. ఎప్పుడును దగ్గఱనున్న చెలికత్తెల సముదాయములయొక్క—తుమ్మెదల. 9. ఒప్పును మాధుర్యముగల తానములగానముల—తానపుంరొదల
10. వేశ్యల సముదాయములు; అడవిమొల్లతీవెల...

చ. జలరుహకైరవప్రకరచంపకకుందశిరీషముఖ్యపే
శలరుచిహారిభూరితరసౌరభసారభరైకధూర్వహా
త్యలఘుసుమప్రకాండములనమ్మెదురీగతిమామకాంగముల్
పొలుపువహించి మించునను పోలికనప్పురిఁ బుష్పలావికల్

చ. లలితనితంబినీజనవిలాస విలోకనలాలసాప్తినో
బలరిపు సౌధసన్నిభవిభాసురహర్మ్య నిరోధమెల్లెడం
గలిగియు మెల్లమెల్లన వికస్వరవారిజహారిదీర్ఘికా
నిలయసమీరవారముల నింద్యగతిన్విహరించు నప్పురిన్

వ. మఱియు నప్పురం బురుతరసురుచిరపురందరనీలనీలజాలజాలోద్వేల
శోభాధరీకృతప్రతత[1]పాథోదయూథనిరోధకోత్సేధసౌధాగ్రజాగ్ర
త్పతాకికాపటాంచల సంజాతవాతపోతవ్రాతనిర్ధూతాపరిమితశ్రమ
జలకణవిమానవిహారపూర్ణచారణగణసంస్తూయమానానూనవైభ
వాభిశోభితామితవిరోధివరూథినీవర్గదుర్గమదుర్గంబును సంతతా
భంగురసంగరరంగసన్నిజ విజయలక్ష్మీమ్రలాసకీలాస్యవేగముక్తముక్తా
ఫలచ్ఛాయాదాయాదసత్కీర్తికారణవితరణగుణకలాకలాపభూపకు
మారసమారూఢనిరూఢకల్యాణవీక్షణీయోత్తుంగతురంగమాభంగ
భూరిధౌరితక రేచితవల్గితప్లుతప్రభృతిగతిభేదసంచలితచటులఖురపుట
పటలసంఘాతసంభూతధూళీపాళీనివారణచణవారణగణమహోదా
రదానధారాకర్దమితరాజమార్గంబును త్రిభువనభవననివసద్దివిషజ్జ

1. మేఘముల సముదాయము.

నభుజంగపుంగవసంతతతంతన్యమానకననరూపస్తవనధూపదీపనైవే
ద్యాదిషోడశోపచార సముదారసమర్చామచర్చికామహోత్సవ
సముత్సుకకుక్కుటేశ్వరకుంతిమాధవప్రముఖసుముఖపంచాశదు
త్తరత్రిశతదేవతాసభానిలయవలయసలయశ్రూయమాణగణికాం
గనాకరసమంచితవిపంచికాప్రపంచితపంచమారావకలావిలాసాను
కృతిప్రకృతివికస్వరపికస్వరకోలాహలలీలాకులా క్రీడావనీక్రోడావ
నీజాత[1]జాతశాఖాగ్రసమగ్రపల్లవదళగుళుచ్చాచ్ఛిద్రచ్ఛాయాభిస
రణశీతలవీథీతలంబును విలసదేలాతరంగిణ్యంతరపరికల్పితకుల్యాప్ర
వాహపయఃపూరసుసేకసంవర్ధితేక్షువణపరిపాలనప్రవీణతాశాలి
శాలిపాలికానికరముకురాయమాణానూనశోభాకరసుధాకరోపల
ఫలకవినిర్మితాచ్ఛసోపానోపశోభితసరోవరనిరంతరపరిస్ఫురత్స్ఫుర
హాటహాటకపీఠాంచితాళీపాళికామహేంద్రనీలమణిమాలికామయ
[2]శృంఖలాకులసముల్లసత్పల్లవిమలకమలకమలాబాలికాకేళికాడోలి
కాజాల[3]కాందోళనలాలసబాలసమీరప్రసారసముదారవాతాయన
సాంద్రలీలాచంద్రశాలావిశాలంబునునై యమరావతియుంబోలె
[4]సునాసీరభాసురంబై సంయమనింబోలె[5]సహస్రవసుజాతాన్వితంబై
[6]యుదన్వంతంబుంబోలె [7]ఘనసరసాధిసాధిష్ఠితంబై యలకాపురం
బునుంబోలె తురంగముఖసేనాసనాథంబై సాకేతపురంబునుం

1. లేఁతకొమ్మలు. 2. ఉయ్యాలగొలుసు. 3. ఊపుట. 4. సేనల; ఇంద్రుని. 5. వేలకొలఁదిసొమ్ములగాసులు; సూర్యుని కొడుకు, యముఁడు. 6. సముద్రము. 7. గొప్పరాజులచేతను; వరుణుని.

ళోలె పద్మనాయకకులరాజన్యపరిపాలితంబై పద్మాకరంబు గావున సరసాళిలాలితంబై రసనిధి గావునరత్నాకరంబై [1]పున్నాగభూషితంబయ్యు [2]వరాళిసేవితంబై నిగమప్రసిద్ధంబయ్యు పురాణ విదితంబై శ్రీరంగనిలయంబయ్యు హరిహరస్థానంబై వారణశోభాకరంబయ్యు నవారణశోభాకరంబై వసీమనోహరంబయ్యు నవసీమనోహరంబై బలాభిరామంబయ్యు నబలాభిరామంబై వెలయుచుండు. 67

ఉ. శ్రీలలనాకరంబును బ్రసిద్ధతరంబుఁ బవిత్రదేవతా
జాలక మందిరంబు నఘుజాతహరంబగునట్టి పట్టనం
బేలు నృపాలవంశము సమృద్ధసమిద్ధయశోవిశాలమై
చాలఁ బురాతనంబగుచు జానగుచుండె నఖండవైఖరిన్. 68

గీ. ఆమహావంశచారిత్ర మతిపవిత్ర
మతులనుతిపాత్రమగుచుఁ బ్రస్తుతపుఁదరము
వఱకుఁ బరికించి చూడఁగాఁ బదియునైదు
తరములందాఁకఁ దెలిసె, గ్రంథములవలన. 69

సీ. ఖ్యాతిగా నెగడొందు నేతదీయకుటుంబ
సంభవులైన రాజన్యవరులు
కోసలదేశంబులో సుప్రసిద్ధమై
ప్రబలు నయోధ్యాపురంబుదరినిఁ

1. రాగవిశేషము; ఏనుఁగుల, 2. రాగవిశేషము; మంచివారిసముదాయము.

బరఁగెడికల్యాణ గిరినుండి వెల్వడి
ముందుగా నీ దేశమునకు వచ్చి
పిదప నిచ్చటనుండి కదలి కొంచెపుఁ గాల
మునకు దక్షిణదేశమునకు నేగి

సహజగాంభీర్య చాతుర్య శౌర్య ధైర్య
సాహసౌదార్యముఖ్యభాస్వద్గుణంబు
లలరన చ్చోటస్వాతంత్ర్య మతిశయిల్లఁ
బ్రబలులై యుండి రాయుధవర్తనమున. 70

క. అలఘుతర [1]మండలాగ్రో
జ్జ్వలబాహామండలాగ్ర బలదర్పితులై
మెలఁగుచు వారు క్రమంబుగఁ
ద్రిలింగ దేశంబునందుఁ దేజ మెలర్పన్. 71

మ. కలితాటోపమొసంగుచుండ మొతుకుం గైలాసకోటల్ మొద
ల్గలవానిన్ స్వవశంబొనర్చికొని సౌఖ్యంబొప్ప నచ్చోటనిం
పలరం గాఁపురముండి రప్పటితురుష్కాధీశ్వరశ్రేణిక
త్యలఘుప్రక్రియలందుఁ గోరునెడ సాహాయ్యంబునాటించుచున్.

క. ఎంతయు బహుకాలము ప
ర్యంతము నల గోలకొండయాదియగు పుర

1. కత్తిచేతను.

ప్రాంతములయందు మూత్రిమె
సంతిసమునసుండి రధికశౌర్యోద్ధతులై. 73

చ. పొలువుగనీకుటుంబమునఁ బుట్టినవారలకెల్ల హూణ్యగా
నలరెడుదుర్గముఖ్యముల యందొకకొన్నితురుష్కలోకరా
ట్కులభులచే బహూకృతులుగా మఱికొన్నిస్వయత్నరీతిచే
[1]వలనుగనార్జనంబు సలుపంబడిపాటిలుచుండెమెండుగన్. 74

సీ. మఱలనీపీఠికాపుర సమాస్థానంబు
పదియునేడవ శతాబ్దంబుమొదల
వీరికుటుంబము వారిలోనొకరిచే
నప్పటి గోలకొండాధికారు
లగు నవాబులదయ నార్జింపఁబడుచు న
ప్పటినుండి హూణాధిపతులవలనఁ
బదునెన్మిదవ శతాబ్దమున రెండవయేట
గడుశాశ్వతపుఁగవు ల్పడయువఱకుఁ
ప్రబలరణరంగములఁ గొంతిబలముతోడ
వీరలరిభీకరావక్రవిక్రమక్ర
మంబెలర్ప సహాయ భావంబొనర్ప
నేగుదెంచెసుపద్ధతి నెసఁగుచుండె 75

1. ఉపాయము.

క. ధరవీరిలోఁ బ్రభుత్వముఁ
బరపినవారుండుచోట్లు బహువిధములుగాఁ
బరఁగుటనీసంస్థానపుఁ
జరితముసరిగావచింప శ్రమమగుమిగులన్ 76

గీ. కానసీపీఠికాపురి లోనవీరు
స్థాయు లగుటకు మ్మునుపటి సమయమందుఁ
బరఁగు ప్రభువులొనర్చిన పనులలోఁ బ్ర
ధానమైనవిమాత్రమే దగవచించి 77

చ. అటుపయినీకుటుంబమున [1]నార్జవమొప్పఁ గ్రమంబుగాను బ్రా
కటముగ రాజ్యమండలముఁ గాచినవారితిరాలచర్యల
న్నిటిని ననేక[2]కోశముల నెమ్మనలోఁ బరికించుచుం బరి
స్ఫుటముగఁ జెప్పఁబూనుటయె ముఖ్యముగాఁ గనుపట్టెనెంతయున్

శా. ఈరీతిం జరితంబుఁ జెప్పినయెడ న్వీక్షింపఁగా దానికిన్
బ్రారంభంబున నీకుటుంబములకుం బాటిల్లుమర్యాద లా
చారంబుల్ మహనీయగౌరవములుం జాతిస్వరూపంబుల
త్యారూఢిన్వివరించి జెప్పుటయెము ఖ్యంబై కడుందోఁచెడిన్. 79

క. కావున నవియెల్లను నా
నావిధసద్గ్రంథగణమునం గలరీతిం
గోవిదులెన్నఁగ ముఖ్యము
గా వివరించుచు రచింపఁగడఁగితి నిటులే. 80

1. తలఁపును మాటయుఁగార్యము నొక్కతీరుగ నుండుట. 2. గ్రంథముల

సీ. ఏతత్కుటుంబసంభూతభూతలనాథు
లిలయందు నందఱు వెలమ లనఁగఁ
దగు వారిలో నొక తరగతి వారలై
తనరుచుండిరి వీరి జననరీతి
దలఁచిచూడంగ గ్రంథంబులం దెందు వి
స్పష్టమై వివరింపఁ బడమిఁ జేసి
వెలమ లనేకులై వెలయుచుండిరి దీని
యాథార్థ్యమేరీతి నలరుఁగాన
ఖ్యాతి నెసఁగంగను శ్రుతిస్మృతీతిహాస
మహితవితతపురాణసమ్మతముగాఁగ
మూఁడు విధముల మొదటినౌ ముఖ్యశాఖఁ
బరఁగు దాని వచింతు నేర్పాటుగాఁగ. 81

మ. అరయన్నాభ్యుదవరాముధాటికనిలో [1]నత్యాహితం బొంది యి
ద్ధరరాజన్యులు కొంద ఱంబుధిసరిద్ధాత్రీధరారణ్యభూ
చరులై శూద్రతఁబూని కొందఱు నజస్రప్రాణసంత్రాణముం
బరఁగంబాటిలఁజేసి వర్ధిలిరి తద్వంశంబు లింపొందఁగన్. 82

సీ. నృపులపాలింటికి మృత్యువై విహరించు
పరశురాముఁడు వసుంధరను విడిచి

---

1. ఎక్కువ భయము.

వననిధిలో నొకద్వీపమున వసించుటకేగ
నాబాహుజాన్వయు లార్తి వదలి
మును దాఁగి యుండిన ఘనతరదుర్గమై
కాంతదేశంబుల నప్పుడు విడిచి
వెలపటి కరుదెంచి వెలయు సంతతినుండి
వెలమవారనుపేర నెలసి రోగాలు

క్షత్రకులజన్ములైన రాజన్యవరులు
శూద్రభావంబుఁ గాంచి రీక్షోణి ననుచు
నుత్తమఖ్యాతిఁ దగు భవిష్యోత్తరాది
బహువిధపురాణములలోనఁ బలుకఁబడియె. 83

సీ. పౌరవాన్వయులౌ విదూరసంతతివారు
కొందఱు [1]హైహయు ల్గొంద ఱవని
సౌదాసవంశసంభవు ల్గొందఱు
పరశురాముని శౌర్యపటిమ కడలి
శూద్రవర్తనమందుఁ జొచ్చిరి వారిలో
వరలెడు సౌదాసవంశజునకు
వరపరాశరమునీశ్వరుఁడు తద్వృత్తిలో
సర్వకర్మంబుల జరుగఁజేసి

1. కార్తవీర్యుని వంశమునఁ బుట్టినవారు.

దయను బ్రోచుటవలన సౌదాసజునకు
సర్వకర్ముండనెడు పేరు జగతిలోనఁ
గలిగి చెలువొందె ననుచుఁ బ్రాకటముగాఁగఁ
బలుకఁబడియుండె శాంతిపర్వంబునందు 84

క. పుడమిపయి మఱియు శిబిపౌ
త్త్రుఁడు గోపతి కాననంబులో గోవులచే
నెడరెడలఁగఁ బ్రోవంబడి
వడి శూద్రతఁబడసె ననుచుఁ బలుకంబడియెన్ 85

క. జననుతుఁడైన ప్రదర్శన
తినయుండనువత్సరాజు తాలేఁగలచే
మనుపంబడి శూద్రత్వం
బునుఁ గైకొనెనని పురాణములఁ దేటపడున్ 86

క. ఘనుఁడు విదూరజదధివా
హనతినయుండంగరాజు నలగౌతమనా
మునిమునిఁగని తదవనముం
దనరంగను శూద్రవర్తనముఁ గైకొనియెన్ 87

చ. భువినిబృహద్రథాస్వయభవుండగు భూతిసమాఖ్యుఁడైనపా
ర్థివుఁడుమరుత్సుజాతులు మఱిం బహుమందిధరాతలేంద్రులున్

1. ఆ గౌతముని గక్షణము.

బ్రవితతశౌర్యుఁడౌ పరశురామునికిన్ భయమందుచున్నని
ప్రవరులచేతఁ బ్రోవఁబడి క్రమ్మఱఁబూనిరి శూద్రభావమున్. 88

గీ. వీరలేవెల్మవారను పేరువడసి
రనుచు నైతిహ్య సత్ప్రమాణాళివలన
నిల ననేకపురాణ సంహితలవలన
వలనుమీఱఁ బ్రసిద్ధిగాఁ దెలియఁబడియె 89

క. ధాత్రిపై శూద్రవృత్తికిఁ
బాత్రములై నట్టియట్టి బాహుజసద్గో
త్రజులై [1]యనుపనీత
క్షత్రియులనుపే రువడసి కడువెలసి రిలన్ 90

క. మఱియును వీరుగ్రులనం
బరఁగుదు రుగ్రులన నస్త్రపాండిత్యపరి
స్ఫురణంబున జీవన మి
ద్ధరణీస్థలి సలుపువారు దర్పమెలర్పన్. 91

ఉ. ఆరయ నశ్వమేధముఖయాగము లెల్ల నొనర్చు వేళలన్
వీరి సహాయశక్తినవి వేమరుసాంగము లయ్యెనంచు నౌ
రౌర! రణాంగణంబుల మహాబల ధైర్యపరాక్రమంబులన్
వీరలు చూపుచుందురని వేదములొప్పుగఁ జెప్పునెప్పుడున్, 92

1. ఉపనయన సంస్కారము లేని.

సీ. తనర భాగవతంబునను ద్వాదశస్కంధ
మున నాదిభాగంబునను ననూన
బలశాలియని చెప్పఁబడిన మహానంది
యను కడపటి విభుం డనుపనీత
శాహుజాన్వయకన్యఁ బరిణయమై దాని
యందు మహాపద్ముఁ డను కుమారుఁ
నసమాస్త్రసుకుమారు నసమశక్తి కుమారుఁ
బడసె నొక్కనిఁ బ్రేమ పరిఢవిల్ల
రహీనతేజు తండ్రి [1]ప్రాజ్యసామ్రాజ్యమందె
నామహాపద్మకుల మందు నవతరించి
వరగుణంబుల నెగడొందు ప్రభువులెల్లఁ
బద్మనాయకులని పేరుఁ బడసి రవని. 93

క. స్తోత్రార్హులందుఁ గొందఱు
మైత్రేయునివలన విమలమతి దుర్గాగా
యత్రి నుపదేశ మగుచున్
ధాత్రిం దదుపాసనం బొనర్చిరి మిగులన్. 94

సీ. చంద్రవంశజులై యశంబుఁ జెందిన వీర
రుద్రేంద్రువంశజుల్ రూఢిమీఱఁ

1. గొప్ప భూమండలాధిపత్యము.

గాకతియను దేవిఁ గసుభక్తి సేవించి
బలిమి నంతటినుండి కలిమిఁ గాంచి
కాకతీయులటంచు ఖ్యాతి నొందినరీతి
వీరి పూర్వికులైన పృథివిపతులు
వెల్లమాంబాభిఖ్య వెలయు దుర్గాదేవి
ఘననిష్ఠతో నుపాసన మొనర్చి
యెలమి నీాఁగఁ దత్కృపాదృష్టి వలన
ఘనతరైశ్వర్యబలపరాక్రమసమగ్ర
పాటవంబులచే మించి నాఁటనుండి
వెలమవారను పేరిచే వెలసి రవని. 95

క. తలఁప [1]ననాది క్షత్రియ
కులసంభవులయ్యు వీరు గురుకర్మములన్
దొలఁగి చరించుట శూద్రుల
వలెనెల్లెడ వ్యవహరింపఁ బడుచుండి రిలన్. 96

క. ఈపగిది నుండి రనుటకుఁ
బ్రాపుగ మహనీయమధ్వరామానుజభా
ష్యోపన్యాసంబులు ను
ద్దీపితగతి సంతతంబుఁ దెలుపుచు నుండెన్. 97

---

1. చిరకాలమునాఁటి.

మ. కో. వేదచోదితమై జగంబున విశ్రుతంబగు బ్రహ్మవి
ద్యాది కర్మచయంబుఁ బాసి నిరంతరంబును బాటిలం
గాఁదనర్చిన శూద్రభావము గాని వీరికిఁ బ్రాకటా
నాది పార్థివధర్మమే శ్రుతులందుఁ గన్పడు నెల్లెడన్. 98

సీ. క్రమమొప్ప రావువంశమునందు రెండవ
తరములో రెండవపురుషుఁ డగుచు
నసమానకీర్తిచే నెసఁగిన తిరుమల
మాధవరాయ క్ష్మాధవుండు
సుమహిత రామానుజమతానుబంధంబు
గలిగి ప్రపన్నాగ్రగణ్యుఁ డగుచు
శ్రీరంగపురిని భాసిలు రంగనాయక
స్వామిసన్నిధిని వాసం బొనర్చి
యలద్విజన్మోపదేశార్హ్యమగుచు నవని
భాగమందున నెగడొందు ప్రణవసహిత
ఘనత [1]రాష్ట్రాక్షరీనామక ప్రసిద్ధ
మంత్రపఠనాధికారసంపద సహించె. 99

సీ. ఇలను దద్వంశభవులకు నెల్ల నేటి
వఱకుఁ దన్మూలకంబైన ప్రణవసహిత

1. నారాయణాష్టాక్షరి.

భాసురాష్టాక్షరీనామపరమమంత్ర
నిరత పఠనాధికారంబు నిర్ఘుతమయ్యె. 100

క. ఏవం విధ బహుగాథా
భావంగమరీతి వెలమవారల కెల్లన్
తీవినసాదిక్షత్రియ
భావమె గనుపట్టుచుండెఁ బ్రఖ్యాతిమెయిన్. 101

శా. భోగీంద్ర [1]ప్రతిభావిభాసితసితప్రోద్యద్యశోహేతుక
త్యాగశ్రీల సమాన మానధన జంభారాతిశుంభన్మహా
భోగాభోగ సుధీవరస్తుత పరిస్ఫూర్జద్వచోధోరణీ
శ్రీగంగాధర రామరాయ ధరణీభృల్లోకచూడామణీ. 102

పృథ్వీవృత్తము

స్ఫురద్విభవ పీఠికాపురలలామ రాజ్యేందిరా
ధురందర సమస్తసద్గుణ సమూహరత్నాకరా
నిరంతర బుధాదరానిహతవైరి విశ్వంభరా
వరప్రకర రామరాడ్వ సుమతీశ్వరాగ్రేసరా

మాలినీవృత్తము

మకుటముఖవిభూషా మంజులోదార వేషా
సకలరిపువిశాలా స్ఫారకారుణ్యశీలా
సుకవినుతచరిత్రా సూర్యరాయేంద్రపుత్రా
ప్రకటసుగుణసాంద్రా రామరాయేంద్రచంద్రా

1. సమానమైన కాంతిచేతను.

## గద్యము.

ఇది శ్రీజానకీరమణచరణారవింద నిష్యందమానమరందపానా
మందానంద మిళిందాయమాన మానస కౌండిన్యగోత్ర
పవిత్ర దేవులపల్లివంశసంభూత సీతరామవిద్వన్మణి
పౌత్ర వేంకటకృష్ణశాస్త్రీంద్రపుత్త్ర సుబ్బరాయ
సుధీవర సోదరవిబుధజనవిధేయ వేంకట
కృష్ణశాస్త్రినామధేయప్రణీతంబైన
రాఘవంశముక్తావళీ ప్రబంధంబునందుఁ
ప్రథమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ
శ్రీ శ్రీ
శ్రీ



శ్రీరస్తు.



శుభమస్తు.

అవిఘ్నమస్తు.



# రావువంశముక్తావళి

## ద్వితీయాశ్వాసము.



శ్రీకర రావుకులాంబుధి
రాకాలసమానచంద్ర రాధేయసమా
స్తోకతరవితరణాది
ప్రాకటగుణసాంద్ర రామరాయ నరేంద్రా. 1

వ. అవధరింపుము, 2

పంచచామరము.

త్రిలింగమండలంబు నెల్లఁ దేజ మొప్ప నేలు స
త్కళాఢ్యుఁ డౌ ప్రతాపరుద్రుకాలమందు వీర[1]లు
జ్జ్వలప్రతాపరుద్రులై ప్రశస్తశూద్రవృత్తిచే
మెలంగుచుండి రర్యిలో ననేకు సద్గుణంబులన్. 3

---

1. వెలుఁగుచున్న ప్రతాపముచే శివునిబోలినవారు.

గీ. ప్రకట హాలవృత్తిచే మీఱు వారిలోన
ఘనుఁడు బేతాళరావను జనవరుండు
ధైర్యగాంభీర్యచాతుర్యశౌర్యముఖ్య
వర్య గుణములమేటియై వఱలుచుండె. 4

క. హాలవృత్తిఁ జెలఁగు నతనికిఁ
బొలమున నొక మఱ్ఱిక్రింద భూరితరంబై
మెలఁగెడు ధననిక్షేపము
నలగొను తన పూర్వపుణ్యవశమునఁ దొరకెన్. 5

గీ. వసుమతీభాగమందుఁ దత్ప్రభువరేణ్యుఁ
డది మొదలుగాఁగ ఘనవైభవాతిశయము
దనర పిల్లలమఱ్ఱి బేతాళరా న
నంగ విఖ్యాతిఁ గాంచి చెలంగుచుండె. 6

క. నిక్షేపద్రవ్యముచే
నక్షీణచమూసమూహ మార్జించుచు [1]హ
ర్యక్షబలుఁ డతఁడు శూరా
ధ్యక్షుండై మెలఁగుచుండె ననుపమలీలన్. 7

మ. ప్రకట ప్రక్రియ నవ్విభుండు యశముం బాటిల్ల నిట్లుండఁగా
నొకనాఁ డాయతశౌర్యధైర్యగుణధుర్యుండై నరుద్రేంద్రమా

1. సింహముయొక్క బలమువంటి బలము గలవాఁడు.

ళికి నాకస్మికరీతిఖ్యాతిగల ఢిల్లీపాదుషా వారితో
నకలంకంబగు బల్మిఁ జూపు సమయంబై పోరు వాటిల్లఁగన్. 8

క. ఆనాఁటిరేయిఁ గాకతి
మానవపతిరిపులనెటులు [1]మడఁచెద ననుచున్
ధ్యానించుచు నిజదైవము
మానసమున నిల్పి నిద్రమరగిన వేళన్. 9

మ. జలజాతాహితమూర్తి [2]వజ్రపుఁదురాసర్పోషుగా నొదలం
బొలుపొందం గిరికన్యతో నల స్వయంభూదేవసర్వేశ్వరుం
డలఘుస్వీయపదాబ్జసేవకనికాయాభీష్టదుం డౌటచేఁ
గలలో రుద్రనృపాలనామాళికిని సాక్షాత్కారమయ్యెం గృపన్. 10

క. అటువలెనసలనెలతాలుపు
పటుతరమగు కనికరంబు వాటిలఁ దన ముం
గిట నిలువ రుద్రవిభుఁడు
త్కటభక్తినుతించె నివ్విధంబున వేడ్కన్. 11

సీ. దండముద్దండకోదండనిర్భరఖండ
కాండఖండితదైత్యకాండ నీకు
వందన మిందుసద్బృందచందనకుంద
కమనీయమంజులగాత్ర నీకు

---

1. లోఁగునట్లు చేసెదను. 2. వజ్రముల నిచ్చలుగల శిరోభూషణము.

భోగాంక నీహారగేహాత్మజామృదు
వ్యాహారకలనసమ్మోహ నీకు
ఘోరపాతకతూలజాతవాతాయిత
ఖ్యాతచారిత్రసమేత నీకు

వినతి వివిధవిరించాదివిబుధవితతి
విపుల విపదపనయన ప్రవీణ నీకు
ప్రముఖ సంసారసాగరపూరతార
కైక నౌకాయితాంఘ్రినాళీక నీకు. 12

మ. రమణీయాబ్జకలాకలాపకలిత త్రైలోక్యనాథప్రభో
ప్రమథాధీశ్వర భక్తవత్సలకృపాపాథోనిధే పాహిమాం
శమనోద్యద్ఘనగర్వపర్వత[1]పవే శర్వాయతుభ్యం నమో
నమ యంచుం దగఁ దత్పదాబ్జములకుం దండంబు లర్పించుచున్. 13

మ. జయలోకాతిభయంకర త్రిపురరక్షస్సైన్య[2]వన్యాధనం
జయ! నిర్ధూతపదాంబుజాతవినమత్సద్భక్తసంసత్పరా
జయ! దివ్యాస్త్రవరప్రదానతోషితస్వాంతాబ్జరాజద్ధనం
జయ! భవ్యైకశిలాభిధాననగరీసంవాస! మృత్యుంజయా. 14

గీ. తతకృపాలోప సకలవేదస్వరూప
హరినిశితరోపరక్షితామరకలాప

---

1. వజ్రాయుధమా! 2. వనసమూహమునకు అగ్నిహోత్రుఁడా!

మథితభవతాపపాపతమఃప్రదీప
లలిత గిరిచాప చంద్రకలాకలాప. 15

గీ. అనుచు నీరీతిగా నిశ్చలాత్ముఁ డగుచుఁ
బ్రకట విలసిత వినయపూర్వకము గాఁగ
వినుతి యొనరించి వెండియు విపులభక్తి
పరఁగ నవ్వీర రుద్రనృపాలమౌళి. 16

క. [1]శతరుద్రీయవిధంబున
నతిఘనమగు కుతుకమలర నపుడానిజద్రై
నతి మగు మహీభృత్కన్యా
పతినిన్ మతి నతులగతులఁ బ్రస్తుతిచేసెన్. 17

ఉ. రుద్రనరేంద్రుఁ డిప్పగిది గాఢతరంబగు భక్తి మీఱ న
క్షుద్రగతి న్నుతింప మదిఁ గూరిమిఁ జెంది మహేశ్వరుండు ని
ర్నిద్రలసత్కృపారసపరీతకటాక్షనిరీక్షణంబులన్
భద్రగుణంబుల న్నెలఁగువానిఁ గనుంగొని పల్కె నిట్టులన్. 18

గీ. వత్స! వత్సలభావంబువలన నాదు
చిత్త మార్తజనావనాయత్త మగుచుఁ
జెలఁగుఁ గావున వైరులఁ గెలువ నీకు
ఘనముగ వచింతు నొక్క సాధనము వినుము. 19

1. నమకమునఁ జెప్పఁబడినరీతిని.

క. భువిలోన మదీయాంశో
ద్భవుఁ డవు మఱియు [1]నస్మదీయశుభవ్యసమాఖ్యా
ప్రవిదితుఁడవు విదితాగమ
నివహుండవు నైతివీవు నిక్కం బరయన్. 20

మ. కలఁ డుద్దండ విరోధికాండభయదాఖండప్రచండాసిమం
డలకోదండకలాకలాపకలనానైపుణ్యాగణ్యుం డన
ర్గళతేజోనుపనీతసూర్యకులజక్ష్మాపాలకుం డార్త్తవ
త్సలుఁ డస్మత్ప్రియధాంశసంభవుఁడు బేతాళాహ్వయుం డిచ్చటన్.

గీ. ఇనసుధాకరవంశజు లనుపనీత
బాహుజన్ములు పెక్కండ్రు బరఁగుచుండి
రనుపమపరాక్రమక్రమంబులరవారె
పద్మనాయకులను పేరు వడసి రవని. 22

ఉ. వైరిచమూసమూహమదవారణవారవిలుంఠనోగ్రకం
ఠీరవులాశ్రితావనపటిష్ఠగరిష్ఠచరిత్రపాత్రు లా
ర్యారమణీమనోహరమురాంతకసంతతసేవనాపటుల్
ధీరజనాగ్రగణ్యులు సుకవివర్గగేయులు పద్మనాయకుల్. 23

చ. బలరిపులోకభీకరుల పారకృపారసమానసాంబుజుల్
మలయజమల్లికావలయమంజులకీర్త్తిధనార్జనాదరుల్

1. నాశుభనామముచేఁ బ్రసిద్ధిగలవాఁడవు; నాపేరు పెట్టుకొన్నవాఁడవు (అనియును.)

జలధిగభీరులాహవవిశారదు లాశ్రితకాంక్షితార్థిసం
కలితఫలప్రదాయకులు గారె దలంపఁగఁ బద్మనాయకుల్. 24

గీ. పద్మనాయకరాజన్యవరులె వెలమ
కులజులన డెబ్బదెన్మిది గోత్రములను
నెసఁగుచుండిరి వారికధీశుఁ డగుచుఁ
దపరు వాసిష్ఠగోత్ర బేతాళరావు. 25

క. స్వసమాన భూరి గౌరవ
మసమానత రాదరంబు నలరఁగ రేపా
వసుధేంద్రుని బిలిపింపుము
నెస నతఁ డరివరులఁ దునుము విక్రమలీలన్, 26

క. అనుచు స్వయంభూ దేవుం
డనుపమకారుణ్యసహితుఁడై సమ్మోదం
బున నానతిచ్చి చయ్యనఁ
[1]గనుమొఱఁగిన రుద్రవిభుఁడు కను వేగమునన్. 27

చ. కనుగవవిప్పినల్లడలఁ గన్గొని యాహరునెందుఁ గానక
న్మనమున సంశయంబును ఘనంబగు విస్మయము న్విషాదముం
జేనఁగొనఁ గొంతసేపటికి వేచ్చజనింపఁగ నంతయు న్నిజం
బని కృతనిశ్చయుండగుచు నట్టులొనర్చెద నంచు నెంచుచున్. 28

1. అంతర్థానముకాఁగా.

గీ. కాల్యవిధులను గడపి [1]కాకతివిభుండు
ఘనులయినవారిఁ బిలిపించి గౌరవంబు
దనర పిల్లలమఱ్ఱి బేతాళరాయ
విభువరునిఁ దోడితెండని వేడ్కనంపె. 29

మ. హరుఁడారాతిరియందె భక్తజనరక్షాఖండదీక్షావిధా
భిరతాత్మండగుటన్ దయాహృదయుఁడై బేతాళరాయేంద్రుతో
నరయం గాకతివీరరుద్రునకు సాహాయ్యంబు గావించినం
బరమైశ్వర్యయశంబు లబ్బుననుచున్ స్వప్నంబుసాగించినన్. 30

సీ. ఆరీతిగా స్వప్నమైన పిల్లలమఱ్ఱి
బేతాళరావు విఖ్యాతిమీఱ
నెగడు రుద్రేంద్రుసన్నిధికిఁ బిల్వక యుండ
నెట్టులేగుదు నంచు నెంచుచుండ
నంతలో వీరరుద్రాధీశుఁ డంపిన
జనులేగి వినయంబు దనర నతని
ఘనగజారూఢునిఁ గావించితోడ్కొని
చనుదెంచిన విభుండు చనువు మీఱ

తే. గీ. నధికతరమైన గౌరవం బాచరించి
రంగదుత్తుంగమాతంగరథతురంగ

1. కాకతివంశరాజు-ప్రతాపరుద్రుఁడు.

కలితచతురంగబలసముజ్జ్వలతఁ గాంచి
ప్రబలు నిజసైన్యమున కాధిపత్య మొసఁగి. 31

సీ. మఱియు నాతని యనుమతిని దదీయులౌ
వెల్మ వారల నెల్ల వేడ్కమీఱఁ
బిలిపించి మర్యాద జెలఁగంగ డెబ్బదె
న్మిది గోత్రములతోడ మెలఁగువారి
ఘనమైన తనదుర్గమునకు మెండుగ డెబ్బ
దెనిమిది బురుజులు దనరియుంట
నొక్కొక్క బురుజున కొక్కొక్క తెగవారి
నేర్పుగా భాగంబు లేర్పరించి

తే. గీ. యధిపతులఁ జేసివారిలో నధికులైన
భవ్యవాసిష్ఠగోత్రవిప్రర్షిగోత్ర
భవులయిన రాజులకు నగ్రభాగమందు
నలరు బురుజుల కాధిపత్యం బొసంగె. 32

స్రగ్ధర. అంతం దుర్దాంతశౌర్యాయతబలకలితోదగ్రబాహాగ్రజాగ్ర
[1]త్కుంతోద్యన్ముద్గరాళీగురుతరపరిఘాత్యుగ్రకోదండకాండా
త్యంతాభీలాసిజాలాద్యనుపమసముదారాయుధారాతియోధా
క్రాంతంబై వీరరుద్రప్రభుమణిఘనదుర్గంబు గన్పట్టుచుండెన్.

1. బల్లెములు ... ఇనుపదుడ్లు ... గదలు, పెద్దధనుస్సుల ...

క. అయ్యెడఁ దద్విధమంతయు
నొయ్యనఁగని వెలమకులజయోధవరేణ్యుల్
సయ్యన రిపుబలములతోఁ
గయ్యంబుం బగనొసర్పఁ గడఁగిరి కడిమిన్. 34

లయవిభాతి. ఇలపఁబసి గూలిపడి మెలఁగెడు పతాకగణ
ములను జలజంతువులు సలుగడిల విుంచం
గలభహయవీరభటకుల ఘనతనుప్రకర
ములఁ దోరఁగురక్తమను సలిలము దలిర్పం
[1]బోలికలను నారెకును జలధిగతి మీఱఁగను
జలుపుచు నపారమగు చలము చెలువొందం
బలుమరు సమానమగు బలిమిని సురాసురులు
వలె నుభయసైనికులు దలపడి కడంకన్. 35

మ. కరముల్పాదములున్ శిరంబులు దురంగంబు [2]ల్సతాంగంబులున్
గరులుం గూలిపడం బరస్పరజయాకాంక్షం జనానీకము
ల్వోఱఁ గందవ్వడిఁ బోరుచుండ నపుడా బేతాళరాడ్భూవరుం
డిరు సైన్యంబులలోఁ బరాక్రమముచే నెంతేవిజృంభించుచున్.

దండకము. శ్రీమన్మహీమండలీ మండనాఖండదాటీ నిరాఘాటఘోటీ
సమారూఢుఁడై ప్రౌఢిఁ వాటించు నాత్మీయసైన్యంబుతోఁ గూడి

1. యుద్ధభూమిని. 2. రథములు.

వజ్రాయుధోదగ్రగజాగ్రసన్మహామండలాగ్రంబు చేఁబూనిదుర్వార
గర్వాతిరేకాతివిస్ఫారవైరిచ్ఛటాభీలబాహాబలోద్భాసియై వాసి
మీఱంగఁ దద్యుద్ధరంగంబునం దెచ్చటం గాంచినం దాసయై
రంగదుత్తుంగమాతంగసంఘంబులన్ జండయోధప్రకాండంబులన్
ఖండఖండంబులై ధారుణీమండలం బెల్ల నిండంగఁ జెండాడుచున్
వెండియున్మెండుగా నందులోఁ గొందఱన్ ఢాకినీ శాకినీ భూత
భేతాళసంఘాతచేతఃప్రమోదంబుగాఁ బాదజానూరుజంఘోరు
బాహూత్కరంబుల్ గరంబుల్ శిరంబుల్ నరంబుల్ గరం
బద్భుతంబొప్ప వేర్వేరుగా ద్రుంచియొక్కుమ్మడిన్ మాపుచున్
ధైర్యశౌర్యంబులున్ సాహసోత్సాహముల్ నిగ్రహానుగ్రహం
బుల్ వడింజూపుచుం బ్రాకటోద్దండ[1] వేదండపాళీరథాళీమహాధర
శ్రేణిరాణింపఁగా విస్ఫురత్కేతనచ్ఛత్ర[2]రింఛోళికాకైతవానేక
యాదోనికాయంబు పెంపొందఁగా దేహసందోహనిర్యన్మహారక్త
ధారామహోదారవాఃపూరమొప్పంగ వేమారు మున్నీరు
నుంగేరుచున్మీరునవ్వాహినీవారమధ్యంబునం జేరి మంథాన
శైలంబుచందాన నొక్కుమ్మడిన్నల్గడల్గ్రమ్ముచుం గల్క
వాటించుచున్ శౌర్యనిస్తంద్రుఁడౌ రామచంద్రుండు సాంద్ర
ప్రతాపాఢ్యుఁడౌ భార్గవుండానదీసూనుఁడున్ గార్తవీర్యార్జునుం
డర్జునుం డాదిగాఁగల్గువీరాగ్రణుల్ బోలె నిర్వక్రమా

1. ఏనుఁగులగుంపు. 2. సమూహము.

విక్రమాటోపమేపారఁగా మీఱుచుం ధీరులంగేరుచున్ శూరులం
జేరుచున్ భీరులౌ వైరులం భోరునం బోరునం దూరముం
బాఱఁగాఁదోలుచున్ మాటికిన్మాటికిన్మేటితేజంబుచేఁ గ్రాలుచు
న్మందహాసంబుభాసిల్లఁగా మీసమున్ జిద్విలాసంబుగా దువ్వి
యవ్వేళను ద్వేలధారాళ[1]కీలాలసంతాళనాభీలధారాలతాలోలహా
వాలుఁ జూపించి కోపించి దీపించుచుం గాలుద్రోలంటగా శత్రు
జాలంబు నిర్మూలమౌనట్లు నాత్మీయసైన్యంబునుం దానుగావించి
భేతాళరావద్భుతంబౌ ప్రతాపంబుదిఙ్మండలంబెల్ల నిండించి శుంభ
జ్జయస్ఫూర్తిచే మించి సత్కీర్తిఁగాంచెం గడున్. 37

సీ. బేతాళరాయపృథ్వీనాథుఁ డవ్వేళ
నర్ధరాత్రంబున నధికధైర్య
మలర దిగంబరుండై యుద్ధభూమికి
నొంటిగా నేగి దానొక కపాల
మున శత్రుజనరక్తమున నన్నమునువండి
తత్తన్మహామంత్ర తతుల చేత
నఖిల భూతంబుల నావాహనమొనర్చి
ఘనసాహసోత్సాహకలితుఁ డగుచు
భూరికారుణ్యబుద్ధి వేర్వేఱుగాను
నేర్పు వాటిల్ల వానికన్నిటికి నెలమి

1. రక్తము.

కరములను జూఁప నొక్కొక్కకబళి మొసఁగె
[1]రణము గుడిపెనులోకముల్ బ్రస్తుతిసేయ. 38

గీ. రణము గుడిపిన బేతాళిరావు ధృతికి
గిరులు సరిరావు బలిమికిఁ బురుషురావు
హరులటంచును జనులెల్ల ననుట వలన
రావువారను గృహసంజ్ఞఁ బ్రబలె నతఁడు. 39

గీ. రావు బేతాళిరావు దుర్వారవైరి
గణము నిటువలెఁ బరిమార్చి రణము గుడిపి
విమలయశుఁడైన కాకతివీరరుద్ర
విభుని డెందంబునకుఁ జాలవేడ్కనొసఁగె. 40

శా. ఆరీతి న్ముదమొందఁ జేయఁగను రుద్రాధీశ్వరుం డప్పుడా
శూరాగ్రేసరునిన్ సహస్రగతులన్ స్తోత్రంబుఁ గావించుచున్
శ్రీరంజిల్ల నిజార్ధరాజ్యపదవీసింహాసనాధ్యక్షతన్
గారుణ్యాత్ముఁడై యొసంగె నఖిలక్ష్మానాయకుల్ మెచ్చఁగన్.

చ. మరియు దదీయులై యనుపమానబలంబున నొప్పువారి కం
దఱకును వేలువేలుగ నుదారగుణాకరుఁడైన యమ్మహీ
వరజనశేఖరుం డపుడు [2]ప్రాజ్యములై చెలువొందు రాజ్యముల్
బిరుదులు నెన్నియేనొసఁగె వేడ్క మనంబున నుల్లసిల్లఁగన్. 42

---

1. యుద్ధబలినిసమర్పించెను. 2. గొప్పవి.

మ. విలసద్వైభవుఁడైన రుద్రవిభుఁడా బేతాళరాయేంద్రునిం
బలుకీవిం దనతో బరాబరిగఁ బ్రేమం జూచి మన్నించుచున్
వెలయందక్కిన పద్మనాయకుల నెంతేఁ జాల మర్యాద శా
టిలఁ జేపట్టె స్వకీయబంధువులకంటె న్నిర్విశేషంబుగన్. 43

గీ. వారిలో నొక్కగోత్రంబు వారలెల్ల
నంతరించుటచే నిప్పు డరసిచూడ
ధాత్రిపై సప్తసప్తతిగోత్రభవులు
మాత్రమె చెలంగు చుండిరి మహితరీతి. 44

గీ. పైన వివరింపఁబడిన విప్రర్లగోత్ర
భవులలోపలఁ గొందఱు బలము [1]చలముఁ
బ్రబల నవని నప్పారావు వార లనెడు
బిరుదును వహించి మేలైన సిరులఁ గాంచి. 45

శా. శ్రీనాథామలపాదపద్మయుగళీసేవాసమాసక్తియున్
నానాదీనజనావనవ్రతమనూనస్థైర్యశౌర్యంబులున్
దానస్ఫూర్తియు సంతతంబుఁ జెలువొందన్బ్రాజిపీటీపురా
స్థానాధీశ్వరులై రిభూరితరభాస్వత్కీర్తి వాటిల్లఁగన్ 46

సీ. అకలంక పద్మనాయకవంశరుచిర ము
క్తావళీ[2]తరళంబు రావుకులము

---

1. మత్సరము; పట్టుదల. 2. మేరువు, నాయకమణి.

బాహాగ్రజాగ్రత్కృపాణధారాహత
ప్రబలవైరి బలంబు రావు కులము
[1]భానుసూనుసమానదానసంతోషిత
ప్రకటార్థిపటలంబు రావు కులము
విమలకీర్తి ప్రభావిజితసితాంభోజ
రాజహంస కులంబు రావు కులము.

పరమభక్తిప్రపూజితహరిగిరీశ
రమ్యచరణాబ్జయుగళంబు రావు కులము
సకల సంశ్రితపండితసత్కవీంద్ర
రచిత సుకృతాయతఫలంబు రావు కులము. 47

క. ఘనమగు నీ వంశమునకు
ననువుగ [2]కూటస్థుఁడైన యనువోతమనీఁ
డనియెడు విభుని చరిత్రము
మునుకొని మున్ముందు చెప్పఁబూనితి నిచటన్. 48

సీ. తొలుత నిచ్చటికిఁ గోసలదేశముననుండి
యెలమి నేతెంచిన వెలమవారు
క్రమముగా విక్రమక్రమము గాన్పింపఁగా
దక్షిణదేశంబుఁ దఱియఁజొచ్చి

1. కర్ణుని. 2. మొదటివాఁడు.

యచ్చోటఁ దిరముగా నమరికొన్నాళ్లకుఁ
దెలుఁగుదేశంబున మెలఁగు మెతుకు
కైలాస కోటలలో లీల నివసించి
యాయుధవ్యాపార మతిశయిల్ల
ధైర్యగాంభీర్యసాహసోత్సాహగతులఁ
బ్రబలులై యొప్పుచుండి రప్పటు తురుష్క
మండలాధీశ్వరులతో నఖండమైన
నిరుపమస్నేహగరిమంబు నివ్వటిల్ల. 49

క. అవనిం దదీయసుస్నే
హావశంబున మెలఁగువార [1]లాత్మాచార
వ్యవహారములఁ దొలంగుచు
యవనులువలె మెలఁగుచుండి రక్కాలమునన్. 50

సీ. అప్పుడు హిందూదేశమందు నొక్క స్వతంత్ర
విభుఁడు సూర్యాన్వయ ప్రభవుఁ డుదయ
పురపురాణావారి వరకుటుంబంబులో
ముఖ్యుఁడై పొలుపొందుఁ బూసపాటి
[2]వంశోపధిక్షీరవారాశితారకా
వరుఁడైన మాధవవర్మ యనెడు

1. తమ కేర్పడిన ... విడుచుచు. 2. వంశమను మిసుగల.

వసుమతీనాథుండు పటువిక్రమం బొప్ప
నిరుపమఖ్యాతిచే నెగడుచుండు

వారి కలగోలకొండాధిపతులతోడఁ
జెలఁగు చుండెను మైత్రీవిశేషమునకుఁ
[1]బొదలుకొదలేని వైభవాభ్యుదయమునకు
మహితమత్సరభావంబు మదివహించి. 51

ఉ. అంతటనొక్కనాఁడు చతురంగబలంబులతోడ నమ్మహీ
కాంతవరుండు వెల్వడి యఖండగతిం బెజవాడపట్టన
ప్రాంతమునందు సంగరమభంగబలంబు చెలంగఁజేసి తాఁ
బంత మెలర్పఁగాఁ దునిమె వారలలోన ననేక వీరులన్. 52

క. పదునాలుగవ శతాబ్దము
మొదలం బహుఘోరరీతి భువిలోనేత
త్కదనంబు జరిగినట్టులు
విదితంబగు గ్రంథవితతి వీక్షింపంగన్. 53

క. అమరపురీవరమునఁ గా
సమరంబునఁ జనిన శూరసంఘములో సిం
గమనీఁ డనియెడు నొక భూ
రమణాగ్రేసరుఁడు గూడ రాజిలుచుండెన్. 54

---

1. వృద్ధిచెందు, తక్కువకాని.

క. [1]అవనిధరధైర్యుఁ డార్య
స్తవనీయచరిత్రుఁ డగుచుఁ దగు నానృపతి
ప్రవరుఁడు ప్రసిద్ధిఁ గాంచెను
భువి పెదసర్వజ్ఞసింగభూపాలుఁ డనన్. 55

గీ. దైవగతినట్టియెడఁ జూలుఁ దాల్చియున్న
యతని వనితాజనవతంస మాత్మవంశ
భవులనెల్లను మాధవవర్మనృపతి
ప్రతిన మీఱంగఁ దున్మపద్ధతినిఁ గాంచి. 56

మ. పతితోడం జగతిం బతివ్రతలకుం బ్రాణంబులం బాయు టే
హితమానంచుఁ దలంచియుం దనకు నెంతే సత్యమౌనట్టి పం
డితవాక్యంబులఁ బట్టి వంశకరుఁడు న్వీరుండు ధీరుండు నౌ
క్షితిపాలుం డుదయించునంచు మదిలో జీవింప నూహించుచున్.

క. కటకట యీదుర్జనుఁ డి
చ్చట నుండినఁ జంపు ననుచుఁ జయ్యనఁ దా నె
చ్చటికైనఁ జనుదు నని య
స్ఫుటితాలక బయలు వెడలి ఘోరాటవులన్. 58

చ. చనిచని కాంచె నొక్కయెడ సద్ద్విజపావనయజ్ఞవాటికా
ఘనతరహోమధూమచయగాఢతమాభ్రగణభ్రమైక సం

---

1. పర్వతము.

జనితమహాకుతూహల[1]భుజంగమభుక్పటలీ విహారము
న్వినుత [2]ధరాంగనామణివినిర్మలహారము నగ్రహారమున్. 59

సీ. సకలశాస్త్రజ్ఞులౌ విప్రజనులతోడ
నమరి యా యగ్రహారంబు విమల మగుచు
భువనగిరి యను పురిచెంత యవనరాజ్య
మండలమునందుఁ బొలుపొందు చుండె నవని. 60

చ. అలఘుతపోధనుండు నిఖిలాగమ ధర్మచర్యానువర్తి ని
ర్మలతరకీర్తిసద్గుణసమగ్రుఁ గుదగ్రకుటుంబవైభవా
కలితుఁడు వింజమూరికుల[3]కంధిసుధాంశుఁడు సత్కృపాకరుం
డల నరసన్నభట్టను ధరామరశేఖరుఁ డొప్పు నచ్చటన్. 61

క. ఆనరసన్న మహాని
ష్ఠానియతిన్నదికి శిష్యసంఘముతోడన్
స్నానమొనరింపఁ జనియ
మ్మౌనిని నచ్చోటఁ గాంచి మదినూహించెన్. 62

ఉ. ఈరమణీశిరోమణియహీనశుభాకృతిలక్షణంబులం
దేరి కనుంగొన న్వసుమతీపతి పట్టపుదేవివోలె నిం
పారుచునుండె నీమె తెఱఁగారయ దీనతదోఁచుచుండెడిం
గారణమేమియో తెలియఁగావలె నీయెడనంచు నెంచుచున్. 63

---

1. నెమిళ్లగుంపు. 2. భూమియనుస్త్రీయొక్క ముత్యాలహారము. 3. సముద్రము.

క. చెంతకుఁ జనియతఁ డావృ
త్తాంతం బంతయునుఁ దెలిసి యత్యంతకృపా
క్రాంతస్వాంతుండై యా
కాంతామణితోడ ననియె గారవ మెసఁగన్. 64

క. ఇమ్మెయి మానిలయమ్మున
సమ్మదమున నుండుమమ్మ సాధ్వీమణి నే
నిమ్ముగ నినుఁ గాపాడెద
రమ్మని తోడ్కొనుచు మందిరంబున కేగెన్. 65

క. చని తన తనయలకం టెను
ఘనమగు ప్రేమాతిశయము గడలుకొనంగా
మనుచుచునుండెను దత్సతి
మనమును మునుపున్న చింత మఱచి చరింపన్. 66

ఉ. మాధవవర్మయున్ రిపుసమాజము నెల్ల పధించిసింగగో
త్రాధిపుభార్య గర్భవతిగూట యెఱింగి తదీయగర్భమం
దీ ధరణీతలంబుననహీనబలుం డుదయించు నేమొ యం
చా ధవళాక్షినప్డు తెగటార్పఁ దలంచుచు నెందుఁగానమిన్. 67

గీ. కొంతవడి యవ్వసుంధరాకాంతవరుఁడు
చింతవడి డెందమునఁ దన చెంతనున్న

భటవరేణ్యుల దేశమంతటకు వెదకఁ
బని యనుప నబ్బటాగ్రణు లరిగి యరిగి. 68

క. కర్ణాకర్ణిక గా[1]వర
వర్ణిని భువనగిరి దరిని వసియించుట నా
కర్ణించి కౌతుకంబునఁ
దూర్ణముగా నచటి కేగి దుర్బుద్ధమెయిన్. 69

క. పరమపవిత్రశ్రోత్రియ
ధరణీసురసదనవాటిఁ దరియం జని య
వ్వారమందిరంబు లన్నియు
వరయుచు నొక చోట ననుపమామోదమునన్. 70

ఉ. పూతచరిత్రుఁడై వినుతిఁ బొందు నృసింహసుధీంద్రునింటఁ [2]ప్రా
చేతసునాశ్రయంబునను సీతయుఁ బోలె వసించియున్న వి
ఖ్యాతచరిత్ర గర్భభరణాలసగాత్రి నృపాలగోత్రజ
స్త్రీతతలక్షణం గనిరి సింగవిభూత్తముపత్ని నబ్బటుల్. 71

చ. కనుఁగొని యాక్షణంబె మహీకాంతుని చెంతకు నేగి యబ్బటు
ల్వినయము నివ్వటిల్లఁగను వేడ్క మెయిం దదుదంతమంతయున్
ఘనగతిఁ బూసగ్రుచ్చిన ప్రకారమునం బలుకంగ నప్పుడా
జనపతి వారితో నరిగె సత్వరలీలఁ దదగ్రహారమున్. 72

---

1. ఉత్తమ స్త్రీ. 2. వాల్మీకి.

సీ. ఆరీతి నేగి యా ధారణీరమణుండు
 సరసన్నభట్టుమందిరముఁ జొచ్చి
[1]జనవరస్త్రైణలక్షణయైన యల సాధ్విఁ
 గని సింగభూపాలు కలికిమిన్న
తప్పక యానంచుఁ దలఁచి యవ్విప్రేంద్రు
 నీక్షించి యిక్కాంత యెవర టంచు
నడగిన నతఁడు నాయగ్రపుత్రిక యీప్ర
 శస్తచారిత్రయా జలజనేత్రి

యనుచు బహువిధములఁ జెప్పి యాపధూటి
యొసఁగి నట్టి పదార్థంబు లొగిభుజింప
నేమియును జేయనోపక యామహీంద్ర
తిలకవరాత్మీయరాజ్యమండలముఁ జొచ్చె. 73

క. ఇవ్విధమున విప్రవరుం
డవ్వనితం బ్రోచి సముచితాచారముల
న్నివ్వటిలి శాశ్వతంబుగ
నివ్వసుధను బారకీర్తి నెసఁగుచు నుండెన్. 74

ఉ. అంతటఁ గొంతకాలమున కామహిళాజనవహాళి గాంచెన
త్యంతశుభోత్కరాయతనమై పొలుపొందు ముహూర్తమందుఁ గ

1. రాజస్త్రీల లక్షణము కలది.

ర్ణాంతవిశాలనేత్రుని జయంతవసంతమనోజ్ఞగాత్రు [1]దు
ర్దాంతవిరోధిజైత్రుని బుధప్రకరస్తుతిపాత్రుఁ బుత్రునిన్ 75

క. ఘనజనతాశీర్వచనము
లనుపమగతి నలరుచుండ సనవోతమనీఁ
డనియెడు నామం బానృప
తనయునకున్ విప్రవరుఁడు దగనుంపించెన్ 76

క. అక్షయకృప విప్రజనా
ధ్యక్షుఁడు గారాబమొప్ప ననుదినమును సం
రక్షింపఁగ నతఁడాసిత
పక్షసుధాకరునికరణి వర్ధిలుచుండెన్. 77

క. ఉద్యద్గుణగణముల[2]నస
వద్యగతిం బరఁగు నృపతివరతనయునకున్
సద్యశము దిశల నెసఁగఁగ
విద్యాబుద్ధులనుఁ గఱపె విప్రేంద్రుఁ డొగిన్. 78

సీ. వయసురా ననువోత వసుమతీజానికి
నరసన్న ధారణీసుర వరుండు
భువనగిరిసమీపముననున్న తనదైన
ఘనమైన వ్యవసాయమునఁ దనర్చు

---

1. వారింపరాని శత్రువులను జయించు స్వభావముగలవాని. 2. ఉత్తమమయిన.

పనులఁ జేయింప నేర్పఱిచి యవ్విభు నాజ్ఞ
శిరసావహించుచుఁ జేయుకొలుసు
సాహసధైర్యాదిసకలసద్గుణధుర్యు
మహితసత్కీర్తి సంగ్రహణపరుని
సత్కవిస్తోత్రపాత్రుని జాతిమాత్ర
పంచముని స్వామికార్యలంపటమనస్కు
వరచరితు జేచుఁడనియెడు వాని నొక్క
పొలముకాపరి నియమించె నెలమితోడ 79

మ. ఒకనాఁ డాయనువోతభూతలవిభుం డుద్యత్ప్రతిష్ఠానము
త్సుకుఁడై జేచునిచేత నొక్కపొలముం దున్నించుచుండన్మహా
ధికవిత్తాన్వితమైన గోలెమున కెంతేగట్టిగా సూటి ద
ప్పక [1]సేరాగ్రముసోఁక ఘల్లుమని శబ్దం బయ్యె నొక్కుమ్మడిన్. 80

క. అప్పుడు కడువిస్మయమొద
నొప్పఁగ ననువోతభూవరోత్తంసం బా
చప్పుడుఁ జెవులారఁగ విని
యప్పుని మాన్పింపఁ జేసె నాప్రొద్దునకున్ 81

క. ఈరీతినొనర్చుచు నా
భూరమణుం డింటికేఁగి భూరిధనముచే

1. నాగలి యగ్ర భాగము.

మీఁజెడు నానిక్షేపం
బాగూఢిగ నెటులు లభ్యమగునో యనుచున్. 82

క. డోలాయమానమానసుఁ
డై లాలసవృత్తిమీఱ నతులగతిఁలచే
నాలోచనఁ గావించుచు
నాలోన న్నిదురగనుల నలమికొనంగన్. 83

క. పరవశుఁడై నిదురింపగ
నరబలినొసఁగంగ నతిఘన[1]ద్రవిణసము
త్కరముంగల యలగోలెము
పరిలబ్ధంబగు నటంచు స్వప్నంబైనన్. 84

క. వెస మేలుకాంచి నరబలి
యొసఁగుట తనకెటులుసాఁగునో యని యపుడా
వసుధాధిపచంద్రుఁడు మా
నసమున జింతించుచుండె నానాగతులన్ 85

ఉ. దాని నెఱింగి నత్కవి సుధాకరభూవరలోకముఖ్యస
న్మానముఁ గాంచుజేచుఁ డనుమాన మొకింతయు లేక ప్రాకటా
నూనవిధానసాహసము నొప్పగుధైర్యగుణంబు నాత్మలోఁ
బూనికతోడఁ బూని యనువోతమహీంద్రునితోడ నిట్లనెన్. 86

1, ధనరాశి,

క. ఘనతరమగు విశ్వాసము
పనుబడునట్టులవని గొన్ని పద్ధతులను మీ
మనమునను సమ్మతంబై
నను నను బలి యొసఁగఁదగును నరనాథమణీ. 87

సీ. అవి యెవ్వియనిన-నో నాదినుండియు మీకుఁ
దనరు వసిష్ఠగోత్రమున కిపుడు
మాఱుగా నెలమి నా పేరె గోత్రంబుగా
ధరణి ఖ్యాతిఁ జెలంగఁ బాల్పుకొనుట
భవదీయవంశసంభవులైన భార్యేశ్వ
రులెల్లఁ బరిణయసమయమందు
ముందుగా మావంశమున జనించిన వాని
కాచరించుచుఁ దదీయానుమతిని

వేడ్కచే నట్టిశుభముఁ గావించుకొనుట
యనిన నట్లాచరించుట కవ్విభుండు
సమ్మతించుచు వాని డెందమ్మునకును
మిగుల దృఢమగురీతి నమ్మిక యొనర్చె. 88

క. తేచుని యనుమతిచే నా
రాచందురుఁ డటు లొనర్చి రభసమున [1]ధన

1. ధనబాహుళ్యమును వహించునది (ఎక్కువధనము గలది).

ప్రాచుర్యధుర్యమగుమను
నాచేనం గల నిధాన మయ్యెడఁ బడసెన్. 89

క. అదిమొదలుగ మునువారికిఁ
బొదవెడు వాసిష్ఠగోత్రముసకున్ భువిపై
బదులుగ నుతిపాత్రంబై
యొదవెను వేచర్లగోత్ర ముచ్చవిఖ్యాతిన్. 90

గీ. ఇటులు నిక్షేపలాభ మాంనృపుఁడు వడసి
తన్నుఁ బ్రోచిన నరసన్నధరణిసురుని
కర్పణముసేయ సంతోషమంది యతఁడు
విమలయశుఁడైన యనువోతవిభునిఁ గాంచి. 91

చ. నరవరయీఘనంబగు ధనంబున సైనికలోక [1]సంగ్రహం
బురువడి నాచరించుచు మహోజ్జ్వలవైరిబలంబుఁ గూల్చి సు
స్థిరముగ రాజ్యపాలనము సేయుము నాకది కోర్కెయంచుఁ బ
ల్మరువచియించుచున్ నృపకుమారునకాధనమిచ్చె వెండియున్.

సీ. పిదపననోప్వతభూవిభుఁడు మాధవవర్మ
పైఁ బగసాధింపఁ బ్రతినఁ బూని
చతురంగబలములఁ జతురతతోఁ గూర్చు
కొని బెజవాడపత్తనముదరికి

1. కూర్చుకొనుట.

సంగరంబున కేగి రంగత్పరాక్రమ
క్రమ మొప్ప వైరివర్గంబు గెలిచి
బేతాళరాయపృథ్వీజానిపగిది నా
రాత్రియం దచ్చోట రణము గుడిపి
తనదు పూర్వులక్రిందటఁ దనరుచున్న
మెతుకుకైలాసకోటలుద్ధతిఁ దలిర్ప
మరల నప్పుడు స్వాధీనపఱుచుకొనుచు
స్వేచ్ఛ మీఱంగ నేలె నా నృపవరుండు. 93

సీ. తనదు తేజస్స్ఫూర్తి తనదు తేజస్స్ఫూర్తి
తెఱఁగున [1]ద్విజరాజదీప్తి మీఱఁ
దనధర్మసంగతి తన ధర్మసంగతి
గతి [2]మహాగుణకాండకలనఁ దనరఁ
దన సత్త్వసంపత్తి దన సత్త్వసంపత్తి
పగిది [3]హరిఖ్యాతి నెగడుచుండఁ
దన దానవిస్ఫూర్తి తన దానవిస్ఫూర్తి
కరణిఁ [4]బ్రత్యర్థిసంగతి నెసంగ
మెతుకు కైలాసకోటలాయత యశంబు
దిశలనలరొందఁ బూర్వపార్థివులఁ బోలి

---

1. చంద్రుని...; గరుత్మంతుని. 2. నారి, విల్లు; సద్గుణము.
3. విష్ణువు; సింహము. 4. శత్రువులు; యాచకులు.

పాలనముచేసెఁ బ్రజలెల్లఁ బ్రస్తుతింప
భూరిగుణపాళి యనుపోతభూపమౌళి. 94

గీ. ధరణి ననుపోతవిభుఁడు బేతాళుఁ డెపుడుఁ
దనకు వశుఁ డౌటచేత బేతాళరాయఁ
డనెడు నామంబువలనఁ బ్రఖ్యాతిఁ గాంచి
మఱియు చెవిరెడ్డి యనెడు నామంబునొందె. 95

సీ. అనుపోతజనపాలుఁ డవనీతలంబేలు
నెడఁ దురుష్క ప్రజాధీశుఁ డగుచు
జానొందునహమదుషాఖాన్మహోదారుఁ
డైన యారాజమార్తాండు పేర
మాధవనీఁడను మఱియొక్కవిభు పేర
నెలమిమీఱఁగ మీకుఁ దెలుఁగురాయ
లనియెడు [1]మేల్కితాబును రాజధానుల
కైదింటికాధిపత్యంబు నిపుడు
పుడమిజను లెన్నఁగ నొసంగఁ బడియెఁ గాన
భువనగిరిదుర్గముననుండి భూరివిభవ
మమర రావలెనని వ్రాసినట్టి హుకుము
లిప్పటికిఁ బీఠికాపురి నెసఁగుచుండె. 96

1. గొప్పబిరుదమును.

సీ. మఱియు నాయనువోతమహీనాథుఁ డవనీత
        లంబుఁ బాలించు కాలంబునందు
  నమరుహసు మేర్జాషామహమ్మదుషాదుషా
        వారిచే నమ్మహీవరుని పేరు
  మహనీయుఁడైనధర్మానీయుఁ డనురాజు
        పేరునుఁ గల్పి సంప్రీతిమీఱ
  మును మీఁ కొసంగిన ఘనరాజ్యములకాధి
        పత్య మిప్పుడు గూఢిపఱుపఁ బడియె
  ననుచు నీరీతి [1]రసమార్గణాంబురాశి
  చంద్రసంఖ్యాకమగు హయాణశకమునందు
  వ్రాయఁబడి తొమ్మిదిమొహర్లవఱలు హుకుము
  లిప్పటికిఁ బీఠికాపురి నెసఁగుచుండె. 97

క. ఇనవంశమునకు రఘుఁడను
  జనపాలుని కరణి రావు సత్కులమునకున్
  ఘనగతి [2]కూటస్థుండై
  యనువోతమహీతలాధిపాగ్రణి చెలఁగెన్. 98

మ. అరిరాడ్గర్వఘనాంధకారచయసూర్యా సూర్యరాయావనీ
  శ్వరమూర్ధన్యకుమారమారజనకస్వారాంఘ్రిసేవాపరా

1. క్రీ. శ. 1456.      2. మొదటివాఁడు.

పరమోత్కృష్టగుణాదరాదరసుధాపాటీరహీరోత్కరా
మరధేనూపమకీర్తిసంపదభిరామా రామరాయాధిపా. 99

పంచచామరము

అరాతిలోకభీకరోదయప్రతాపదీపితా
నిరంతరస్ఫురద్యశస్తృణీకృతాబ్జసిద్ధసిణీ
స్వరాజ్యమండలప్రకాండభాసమానపీఠికా
పురీనివాసరామరాయభూమినాయకాగ్రణీ॥

మాలిని. అచలతులితధైర్యా ప్రాంచితౌదార్యధుర్యా
సుచిరరుచిరకీర్తి సుందరోదారమూర్తీ
ప్రచురగుణకలాపా రావువంశప్రదీపా
రచితసుకృతపాళీ రాయరామేంద్రమౌళీ॥

## గద్యము.

ఇది శ్రీజానకీరమణ చరణారవింద నిష్యందమాన మకరందపానానందానంద మిళిందాయమాన మానస కౌండిన్యగోత్ర పవిత్ర దేవులపల్లివంశ సంభూత సీతారామ విద్వన్మణి పౌత్ర వేంకటకృష్ణశాస్త్రీంద్ర పుత్ర సుబ్బరాయ సుధీవరసోదర విబుధజన విధేయ వేంకట కృష్ణశాస్త్రినామధేయ ప్రణీతంబైన రావువంశ ముక్తావళీ ప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ

క. [1]బలవైరిమకుటమణి సం
కులపదయుగళుం [2]డహీనగుణకల్యాణా
చలధర్మకరుండై పెం
పలరుట [3]సర్వజ్ఞుఁ డొప్పె సన్వార్థకతన్ 4

క. సంగరమున సింగమువలె
రంగద్రిపుకరటివిహతిఁ గ్రాలుటవలనన్
సింగమనీఁ డని మహి నెం
చంగలిగెను పౌరుషాఖ్యసర్వజ్ఞునకున్. 5

గీ. చండకోదండపాండిత్యసహితుఁ డగుచుఁ
దనదు బాల్యంబునను వైరిజనులు గొనిన
మెతుకు కైలాసకోట లుద్ధతిని మఱల
స్వవశ మొనరించుకొనియె సర్వజ్ఞవిభుఁడు. 6

శా. ఆరీతిన్ స్వవశం బొనర్చుకొని రాజ్యంబెల్లఁ బాలించె దు
ర్వారద్వేషణభీషణుండయిన సర్వజ్ఞుండు సత్కీర్తి పెం
పార న్వారణ వార భూధరభుజంగాధీశకూర్మేంద్రభూ
దారాగ్రేసర భూమిభారసహనోదారాత్మదోస్సారుఁడై 7

సీ. తనకీర్తి విమల వితానంబునకును దా
రకలు ముత్యాలజాలరులు గాఁగ

---

1. బలముగల శత్రువుల చేతను; ఇంద్రుని చేతను నమస్కరింప బడిన వాఁడు.
2. గొప్పగుణములు...: సర్వమనునారి; 3. సింగమనీఁడు; శివుఁడు.

దనసముద్దీప్త ప్రతాపాగ్ని కాదిత్య
బింబముగ్రస్ఫులింగంబు గాఁగఁ
దనదాతృతావధూజనరత్నమునకు [1]సం
తానభూజములు సంతానములుగఁ
దన చమూగణసముద్ధతధూళి ఘనపాళి
కలసౌరనదిగర్భజలము గాఁగఁ

దన కనద్గుణమణి గణోదార తార
హారవారంబులకుఁ బూర్వధారుణీంద్ర
రమ్యతరచరిత్రములు సూత్రములు గాఁగ
నిలను జెలువొందె సర్వజ్ఞనృపవరుండు. 8

సీ. కనకాభిషేకాదికంబులచే మహా
స్థానంబులందు సత్కారమంది
సరస శృంగారనైషధకృతి మొదలుగఁ
దెలుఁగున ఘనకావ్యముల నొనర్చి
పటుపివాదప్రౌఢిఁ జటులశాస్త్రవసుధీ
వరుల మేల్చిరుదుల నుజ్జును చేసి
శర్వక్రియాశక్తి సాధించికీర్తి చే
మించిరాయలసభ మెప్పుఁ గాంచి

1. సంతానము, కల్పము, మందారము, పారిజాతము, హరి చందనము.

పరఁగు శ్రీనాథకవిసార్వభౌముఁడే దను
[1]నళుకు వహించి వాగ్దేవి నభినుతించి
యెనని దర్శన మొనరించె నవని నతఁడు
రాజమాత్రుఁడై రావు సర్వజ్ఞవిభుఁడు 9

శా. స్ఫారోదారయశుండు సింగధరణీపాలాగ్రగణ్యుండు నా
గూరన్ శంకరనామసంస్మరణచే నుప్పొంగు నేప్రొద్దు వే
య్యాలుల్ తద్రమణీయమందిరము లుద్యద్భక్తి వాటిల్ల నూ
రూరన్ నిల్పును శర్వభక్తజనవర్యుం డీతఁడౌనే సనన్. 10

శా. ఆలంకారికలోకవర్యపఠనాత్యంతార్హమౌ సింగభూ
పాలీయంబను భవ్యకావ్యమును భాస్వత్కీర్తిరింఛోళిది
క్పాళింబెంపు వహింప విశ్వపతి విద్వన్మౌళిచేఁ గాంచె నా
భీలార్కప్రతిమానతేజుఁడగు సర్వజ్ఞప్రభుం డర్మిలిన్. 11

గీ. అఖిలనాటకములఁ జేయునట్టి సుకవి
జనులకెల్లను ముఖ్యసాధనము గాఁగఁ
దనర రూపకపరిభాష యనెడు కృతిని
రమ్యరీతినొనర్చె సర్వజ్ఞవిభుఁడు 12

చ. అతని సహోదరుండు చతురబ్ధిపరీతమహీతలాంతర
స్థితనృపలోకశేఖరుఁ డశేషసుధీజనతాగ్రగణ్యస

1. భయము.

మ్మతసుగుణవ్రజాకరుఁడు మాధవనీఁడు చెలంగె నిందిరా
హితచరణారవిందయుగళైక నిరంతరసేవనారతిన్. 13

క. [1]అరిదరకరుఁడై [2]సుమనో
వరవర్ణిత సకలసుగుణభాసితుఁ డగుచుం
బరఁగెడు మాధవనృపశే
ఖరు నామం బవని సార్థకంబై తనరెన్. 14

క. తిరుమల మొదలగు మురహర
పరమక్షేత్రముల నెపుడుభజయించుటచేఁ
దిరుమల మాధవరాడ్భా
వరుఁ డని ధరలోన నతఁడు ప్రఖ్యాతిఁ గనెన్. 15

సీ. ధీరుఁడై వార్ధిగంభీరుఁడై సుందరా
కారుఁడై సత్కృపాధారుఁ డగుచు
గేయుఁడై సత్యకౌంతేయుఁడై దానరా
ధేయుఁడై విబుధవిధేయుఁ డగుచు
ధన్యుఁడై సుజనసన్మాన్యుఁడై జితవైరి
సైన్యుఁడై రాజమూర్ధన్యుఁ డగుచు
దక్షుఁడై దీనసంరక్షుఁడై శౌర్యహ
ర్యక్షుఁడై వైష్ణవాధ్యక్షుఁ డగుచు

---

1. శత్రువులకు భయంకరుఁడు; చక్రశంఖరేఖలు చేతులఁ గలవాఁడు.
2. విద్వాంసులు; దేవతయు.

నవని నలరొందె నతఁడు వైభవబలారి
భూరితరరావువంశాబ్ధి వారి భూరి
సత్యవాక్యానుసారి దుర్జనవిదారి
రమ్యగుణహారి మాధవరాయశౌరి. 16

ఉ. రంగద నేకసైనికతురంగశతాంగమతంగజవ్రజా
భంగసము చ్ఛ్రయంబుగల ప్రాజ్యతరం బగు రాజ్యవైభవం
బుం గణనంబుసేయక సముజ్జ్వలవిష్ణుపదాబ్జభక్తిమీ
అంగ వసించెనవ్విభుఁడు రంగపురిం గుతుకం బెసంగఁగన్. 17

సీ. అరుణోదయమునందు విరజాసమానయై
చెలఁగు కావేరిలో జలకమాడి
పరిశుభ్రవస్త్రముల్ ధరియించి సొరుమీఱ
అఁగ ద్వాదశోర్ధ్వపుండ్రములు వెట్టి
జగదేకనాథుఁడై నెగడొందు శ్రీరంగ
నాయకుసన్నిధానంబు నందు
నిష్ఠాగరిష్ఠుఁడై నిరుపమాష్టాక్షరీ
మంత్రరాజంబు ప్రేమంబు మీఱ

జప మొనర్చుచు నిర్మలస్వాంతుఁ డగుచు
రావు తిరుమలమాధవరాయనృపతి

1. వైకుంఠమునఁ బవహించునదింబోలినది.

విష్ణుభక్తాగ్రగణ్యుఁ డివ్విభుఁ డనంగ
గడు ముదంబునఁ గాలంబుఁ గడపుచుండె. 18

సీ. తిరుమలమాధవాధీశ్వరుం డారీతి
శ్రీరంగపురి నివర్తించు నపుడు
శివభక్తులకు విష్ణుసేవకోత్తములకుఁ
దమ తమ దైవతోత్సవములందు
[1]సీమావివాదముద్దామమై ప్రాపింప
నుభయ పక్షంబుల నొప్పు వారు
మనలోన ఘనశౌర్యమహిమము ల్గల భక్తు
లిరువురు ధైర్యవిస్ఫురణ దనరఁ

గలహ మొనరించి విజయంబుఁ గాంచి మించి
బలిమి నెవ్వారలమ్మెరవఁజకుఁ జనుదు
రట్టి భక్తులదే జయం బౌనటంచుఁ
బద్ధతిసి నేర్పుమీఱ నేర్పఱచుకొనిరి. 19

మ. వలుమొప్పన్ హరిభక్తశేఖరులలోన న్మాధవస్మాధవుం
డల పందెంబున కప్పు డియ్యకొని శైవాగ్రేసరశ్రేణితో
జ్వాల దుత్కృష్టనిరంతరక్షతపరిచ్ఛన్నాంగుఁ డయ్యు న్నిర
గ్గళశౌర్యాతిశయంబెలర్పఁగను హోరాహోరిఁ బోరాడుచున్.

---

1. హద్దునుగూర్చినకలహము.

క. పలువిధముల రిపుబలములఁ
గలహమునం దనిమి తొనిమి కడిమి నసృగ్ధా
రలు దొరఁగ నరిశరాహతిఁ
తల దెగి పడి నపుడు ధరణితలమునఁ బడియెన్. 21

గీ. శిరము దెగిన కబంధంబు పరమభక్తి
రసము శౌర్యంబుగూడఁ బ్రేరణ మొనర్ప
జంబుకేశ్వరుగుడిదాఁకఁ జని ధరిత్రి
పయిని నశ్శిసంత వైకుంఠ పదము నందె. 22

మ. అళికాక్షుండగు జంబుకేశ్వరుని దివ్యాగారపర్యంత ము
జ్జ్వలశైవాళిఁగోలివైష్ణవమహాపక్షంబు సాధించి కే
వలవైకుంఠపదంబుఁ జెంది ధరణిం బన్నిద్దరాళ్వారులుం
బలెఁ గీర్తింగనె రావు మాధవమహీపాలుండు సామాన్యుఁడే. 23

క. అతని పవిత్రచరిత్రం
బతుల శిలాశాసనాంకమై యా [1]దివ్యా
యతనమునం దనరుఁ దదా
కృతియుం బరిలిఖిత మగుచు నెసఁగుచు నుండెన్. 24

క. చరితం బిది రంగపురీ
వరమున జరిగె నని తోఁచు వాసవదత్తా

---

1. దేవాలయమునందు.

ధ్యానకృతులవలనఁ గాంచి .
పురి నెసఁగినరీతిఁ దోఁచుఁ బుధవచనములన్ . 25

క. ఆ రాజశిఖామణికిఁ [1]కు
మారులు వర[2]శక్తిధరులు మహాసేనయు[3]తుద్ధా
హారిబలాధారులు పెం
పారఁగఁ బెక్కండ్రు వొడమి రమ్మహిపాలున్ 26

సీ. సఖులతోఁ జతురప్రహాసులతో మహనీయ
కవులతో విబుధశేఖరుల తోడ
హితులతో వరపురోహితులతో సచివస
తతులతో బంధుభూపతుల తోడ
గురులతో సత్కవీశ్వరులతో మాగధ
వరులతో [4]నిరవద్యచరుల తోడ
సతులతో లసదలంకృతులతో సుసౌధ
తతులతో వైభవోన్నతుల తోడ
నందములోఁ గొండ్ల అనుపమౌదార్యశౌర్య
ధైర్యగాంభీర్యచాతుర్యధుర్యుఁ డగుచుఁ
[5]భ్రాజ్యతరమైన పశ్చిమరాజ్యమందుఁ
జెలఁగు వెలుగోటిపురిలోన వెలసి కెలమి. 27

---

1. పుత్రులు; కుమారస్వాములు. 2. బలముగలవారు; శక్తియనునాయుధము గలవారు. 3. విద్వాంసుల గొప్పబలమున కాధారులు; దేవతలసేనలకు ఆధారులు 4. ఉత్తములగు వేగులవారితో. 5. మిగులగొప్ప.

గీ. ఏరె వెలుగోటివారు నాఁ బేరు వడసి
ధరణి వేంకటగిరి పురాస్థానమునకు
నఖిల జనులెన్న నధికారులై చెలంగి
రసమతరమైన యశమెల్ల దిశల నెసఁగ. 28

ఉ. వేఱొకకొందఱందు రిపువీరనివారణకారణోగ్రదు
ర్వారభుజాబలాఢ్యు లనవద్యగుణాకరు లార్యసన్నుతో
దారలసద్యశోఘనులునై చెలువొంది రఖండవైభవ
శ్రీరమణీయ బొబ్బిలిపురీవరరాజ్యపదాధికారులై. 29

క. పఱుబలమున మఱికొందఱు
జటప్రోలుపురాధిరాజ్యసంపద గని [1]పు
త్కటధాటీపటుఘోటీ
భటచేటీరత్నకోటి పాటిల్లంగన్ 30

చ. మునుకొని సీత నెత్తుకొనిపోవు దశాస్యుని కడ్డమౌచుఁ ద
ద్ఘనిశితచంద్రహాసనిహతిన్ స్మృతినొంది జటాయువాశ్రితా
వనపరుఁడైన రాఘవు [2]నివాపజలంబుల నిత్యవైభవం
బును గనినట్టిచోటు జటప్రోలు పురంబన నొప్పు నిమ్మహిన్. 31

క. రాజులు వైభవమున మృగ
రాజులు శౌర్యమునఁ గమలరాజులు రుచి నీ

---

1. గొప్పయుద్ధప్రయాణమందు చొరవగలగుఱ్ఱములయు కాలిబంట్లయు, సేవక స్త్రీలయు, మణులయుసముదాయము. 2. తర్పణోదకముల.

గీ. తురకసరదారు ఫౌఁజుల దురమునందుఁ
బటుపరాక్రమమింపారఁ బాఱఁదోలి
మెతుకుకైలాస కోటలుద్ధతిదలిర్ప
నెలమిఁ బాలించె రంగరాయేంద్రమౌళి. 37

సీ. సురమౌను లనఁగ ఒగ్గఱి వారి మోముల
గుడుగుడీధూమము ల్విడిచి విడిచి
[1]స్థాలికల్ ద్రోమి యజ్వాలు గంగదరి నిడి
మున్గ నందుల మద్య ముమిసి యుమిసి
బృందారకస్త్రీల నెచటఁ జూచిన నద్దు
కొని మోవితేనియ ల్గ్రోలి క్రోలి
నరముఖాశ్వములు బాపురె యంచు గంధర్వ
తతిఁ గాంచి బట్టఁగాఁ దఱిమి తఱిమి

గిరివిరోధిపురవీధి దిరుగు రంగ
నరవరేణ్యుఁడు గురుతరఖరకరాసిఁ
గరుకు కరుకున నఱక రూపఱిన మొఱకు
తురక సరదారు ఫౌఁజు [2]లుద్ధురత మీఱె. 38

క. ఆరంగవిభుఁడు మదిముద
మారంగ భుజాగ్రజాగ్ర[3]దసితాసిలతా

1. చెంబులను. 2. స్థైర్యము. 3. నల్లని.

ధారాహతధీరాహిత
వారాయతబలుని నొక్క పార్థివుఁ గనియెన్. 39

గీ. విజయకరభీమభుజబలవిలసితుండు
[1]పాండురాజితకీర్తి సంపాదకుండు
మహిత[2]గుణకాండసద్ధర్మసహితుఁ డతఁడు
ధర్మరాయేంద్రుఁ డనుపేర ధర నెసంగె. 40

సీ. శ్రీరామ వంశవారిధిపూర్ణచంద్రుఁడై
చెలఁగె నే [3]సర్వజ్ఞశేఖరుండు
భూరివైరిజనాంధకారసంహారుఁడై
భాసిల్లె నే[4]జగద్బాంధవుండు
సకలయాచకచాతకతృప్తికరుఁడౌచు
నిలయందు నలరొందె నే [5]ఘనుండు
ప్రబలదుర్జనగర్వపర్వతభేదియై
ప్రఖ్యాతిఁ గాంచె నే [6]వజ్రపాణి
యతఁడు సత్కీర్తి విస్ఫూర్తి నతిశయిల్లి
ధరణిఁ బాలించె నిర్విఘ్నసరణిమీఱ
సుజనహృదయాబ్జహేళిభాసురగుణాళి
పృథువిభవశాలి ధర్మరాయేంద్రమౌళి. 41

1. తెల్లనిదియును.(ఇతరులకీర్తిచే) ఓడింపఁబడనికీర్తి. 2. గొప్పగుణములగుంపు; నడవడి గలఁవాడు, గొప్పనారి, బాణములు, ధనువుగలవాఁడు. 3. చంద్రుఁడు. 4. సూర్యుఁడు. 5. మేఘుఁడు. 6. ఇంద్రుఁడు.

బటుతరకృపాణసాధనప్రౌఢి నలరి
తలఁపు లీడేఱ వయసు చెన్నలరు నపుడు. 46

క. మనఁ బెసగ గోలకొండకుఁ
జని యవనజనాధిపతులసాన్నిధ్యమునం
దనుపమ మగు విక్రమమున
ఘనసేనానాయకాగ్రగణ్యతఁ గాంచెన్. 47

చ. యవనచమూసమూహముల నాయతవిక్రమలీలఁ నేలు నా
యవనితలేంద్రచంద్రుఁడు సమగ్రతరోగ్రకృపాణపాణియై
పవనజవంబునం బరఁగు వాహము నెక్కి రణాంగణంబునం
గవిసినమాత్రఁ దుత్తుమురుగారె [1]విరోధివరూధినీవరుల్. 48

క. అరిశిక్షాగురుదీక్షా
పరుఁ డగు నా లచ్చిరాయవసుధాపతికిన్
వరమతులగు మువ్వురు సుతు
లురుయశులు త్రిమూర్తులట్టు లుదయించి రిలన్. 49

క. ఆ రాజకుమారులు ధ
ర్మారాయనృపాలుఁ డనఁగ మాధవరాయ
క్ష్మారమణుం డనఁగను వే
మారాయనరేంద్రుఁ డనఁగ మహి నెసఁగి రొగిన్. 50

---

1, పగవారిసేనానాయకులు.

చ. ప్రధనధనంజయుండు ప్రతిభావరభావగురుండు విస్ఫుర
త్ప్రథితవిభావిభాసురుఁ డపారకృపారసవిష్ణుమూర్తి స
త్పృథుజనకల్పకంబు పరిపూర్ణవిహాయితముఖ్యసద్గుణాం
బుధి యన ధర్మరాయనృపపుంగవుఁ డొప్పు నుపేంద్రలీలలన్. 51

చ. ప్రకటపరాక్రమక్రమము సాహసయోగ్యధిగభీరభావముల్
సుకవిజనావనవ్రతము సుస్థిరకీర్తినిదానదానముల్
సకలకలానురక్తి [1]మురసంహారశంకరపాదభక్తియుం
బ్రకృతిగుణంబులై చెలఁగె మాధవరాయనృపాలమౌళికిన్. 52

క. శ్రీమీఱుసోమగంబున
నామాఱుని గేయ బలిమి ననిలమున నిలున్
వేమాఱు మాఱు ననుచున్
వేమారాయేంద్రచంద్రు వినుతింతు గిలన్. 53

ఉ. వారలుమువ్వురున్ రిపునృపాలకమస్తకసంగతాంఘ్రులై
శేషహా గోలకొండనగరీవర రావణరాజలోకకు
శ్రీవసన్నిధానమున శ్రీవిలసిల్లగ నభంగసంగరా
దారబలంబుమీఱ నరిదాంగులుగా నెగడొంగి రిమ్మహిన్. 54

క. ఆరీతి వలయు నా ల
చ్చారాయనృపాలమౌళి సత్పుత్రులలో

1. విష్ణుశంకర. ల.

భూరియశంబున మాధవ
భూరమణాగ్రేసరుండు పొలుపొందెఁ గడున్. 55

క. నలుగురు గని తేజమున
[1]నల్లురుగురు రూపాతిశయమున స్వారబుద్ధిన్
[2]నలుగురుఁ బోలుదు రనఁదగు
నలుగురు సుతులా నృపాలునకుఁ గల్గి రిలన్. 56

ఉ. వారలు సర్వరాయనరపాలవరేణ్య పెనుగొండరాయకం
ఠీరవనారసింహధరణీవరశేఖరరంగశాయి ధా
త్రీరమణాగ్రగణ్యులనఁ దేజమొలర్ప మహీతలంబులన్
జేసి వహించి మించిరి సమృద్ధసమిద్ధసుశోభిరాములై. 57

శా. సాహంకారవికారసాహసికతావ్యాపారపారంగత[3]
త్సాహక్రమోదితశౌర్యధుర్యరిపురాజవ్రాతరాహూద్భవ
ద్వ్యూహోద్దండశలభమండలములఁ గడచున్ భాసిల్లె సత్కీర్తిసం
దోహంబొప్పఁ బెనుగొండ రాయధరణీంద్రుండు నిస్తంద్రుఁడై.

సీ. తన కీర్తి సుచిసముత్కరకల్పితసువృష
కుసుమతారకావళి ల్వివిధము గాఁగఁ
తన ప్రతాపాగ్రహోదగ్రవహ్నిజ్వాల
కరిపరంపర పతంగాళి గాఁగఁ

---

1. నలునివంటి క్రియాస చంద్రుని. 2. నలుని, బృహస్పతిని. 3. మిడుతలదండు.

దన యనుగ్రహమహాఘనసుధావృష్టికా
  శ్రితకోటి చాతకశ్రేణి గాఁగఁ
దన మానసాంభోజమున కిందిరాసతీ
  కాంక్షింప మత్తభృంగంబు గాఁగ

వెలసె నౌదార్యధైర్యగాంభీర్యముఖ్య
నిర్మలాఖిల సుగుణగణోర్మిమాలి
ప్రథన జయశాలి సుజనహృద్వనజ [1]హేళి
కృతసుకృతపాళి తెనుఁగు రాజేంద్రమౌళి. 59

సీ. చెలరేఁగుచున్న బెబ్బులినైన గమకించి
  గట్టిగా డాకేలఁ బట్టవచ్చు
గొలుసులు ద్రెంచి చిందులు ద్రొక్కుచున్నట్టి
  మదకరినైన బిట్టదనువచ్చుఁ
గోపించియున్నట్టి కొదమ సింగమునైన
  వడి [2]సటల్వట్టి నిల్పఁగనువచ్చు
సరభసంబుగవచ్చు శరభంబునైన సా
  హసమున నిశ్శంక నాఁపవచ్చుఁ

గాని రణరంగమందు ఖడ్గంబుఁ బూని
చెలఁగు నీమ్రోల నెవరైన నిలువఁ గలరె

1. సూర్యుఁడు. 2. జూలు.

యనుచు జనులెల్ల వినుతింప నవని నలరెఁ
గృతసుకృతపాళి తెనుఁగు రాయేంద్రమౌళి. 60

సీ. శరపరంపరలచే సమితిఁ జెండాడుచోఁ
పరశురామాదుల పటిమ నెరపు
గదఁ బూని మదవైరిగణముల నదుముచోఁ
బలరామముఖ్యుల బలిమిఁ దెలుపు
విపుల సాహసించె రిపుల వధించుచోఁ
గలికిమూర్తి ప్రతాపకలనఁ జూపు
[1]మొగ్గరంబుల నెల్ల నుగ్గాడి వైరులఁ
జంపుచో నభిమన్యు పెంపు నింపు
నెఱ లోకైకధీరవీరావతార
మూర్తి గాఁబోలు నిమ్మహాపురుషుఁ డనఁగ
వసుధ నలరొందె సుజనహృద్వనజహేళి
కృతసుకృతపాళి తెనుఁగు రాయేంద్రమౌళి. 61

క. అతులాటోపయుతప్రతాపమహిముండౌ తెన్గురాయాహ్వయ
క్షితిపాలాగ్రణి గోలకొండనగరిం జెన్నొందు నబ్దుల్ హుసే
న్ముల్కుల్మల్కునవాబుగారి సరసద్దుర్వారగర్వారిరా
ట్పృతనాశీలబలంబు గ్రాల [2]సరదారిం జేయుచుండన్ రహిన్. 62

1. వ్యూహములు. 2. సేనానాయకత్వము.

సీ. ఘన గుణాకరసుధాకరవంశసంభవుఁ
డల చోళరాజ్యమండల విభుండు
నగు కులోత్తుంగనామమహావనీనాథుండు
సరవిదిగ్విజయయావసగమునఁగదా
వేఁగినాఁ డను పేర వెలయు వేఁగిదేశ
మాత్మీయభుజశక్తి నాక్రమించి
తనకుఁ బితృవ్యుఁడై దగు విజయాదిత్య
భూపాలమౌళికి ముందుగాను

వెసను తద్రాజ్యసామ్రాజ్య మొసఁగ నతఁడు
విశద మగు నట్టి యశమెల్ల దిశల నెసఁగఁ
బదియు నైదేండ్లు తద్రాజ్య పాలనంబు
సలిపి [1]బలవైరినగరికిఁ జనిన పిదప. 63

క. మునుకొని ప్రజల సుకీర్తిఁ
దనరు కులోత్తుంగవిభుఁడు తద్రాజ్యంబున్
దన రెండవతనయుం డగు
ననయుండౌ వీరచోడజనపతి కొసఁగెన్. 64

చ. అతులితధర్మమార్గమతియై నుతిఁ జెందెడు వీరచోడభూ
పతి గుణసత్యులార్యులును బండితులాశ్రితులుం బురోహితుల్

1. స్వర్గమునకు.

హితులగు భూసురాగ్రణుల కెల్లసమగ్రతమాగ్రహారముల్
వితతముగా నొసంగి పృథివీతల మేలె నుదారకీర్తియై. 65

గీ. క్షోణిలోనవీరచోళచతుర్వేది
మంగళాగ్రహారముం గరంబు
ముదము మదినిఁ బొదలఁ బ్రోల్నాటిసీమ న
వ్వీరవాదిమనుజవిభుఁ డొనర్చె. 66

గీ. అతని కులమున జన్మించినట్టి ధరణి
తలన రేఖ్యలు వరుసగాఁ దప్పకుండ
నెలమి నలవేఁగిదేశంబు నేలుచుండి
రంత మహిలోన బహుకాల మరుగ నరుగ. 67

చ. అరిజన భీకరాగ్రహగుణాకరులైన తురుష్కలోక శే
ఖరులు క్రమక్రమంబుగ జగంబున నెల్లెడ నిండి మెండుగాఁ
బరఁగుట నవ్విభూత్తముని వంశసముద్భవులంత కంతకున్
ధరణి స్వధర్మముల్విడిచి తాల్చిరి [1]యావనవేషభాషలన్. 68

క. అటువలెను మెలఁగు నవ్విభు
కుటుంబసంభవులలోనఁ గొందఱు నృపతుల్
చిటిసీడి వారలన [2]నా
దటఁ బేరువహించి రంచిత ప్రఖ్యాతిన్. 69

---

1. తురకలవేషభాషలను. 2. ప్రీతితో.

సీ. వారలాత్మీయపూర్వభూపాలసింహులు
సరవి నేలిన వేఁగి దేశంబులోనఁ
గలుగు శలపాకప్రోల్నాఁడు కాకనాఁడు
పరగణాలను బ్రాభవోన్నతిఁ గాంచి రంత. 70

సీ. చిరకీర్తిసత్కృపాలక్ష్మీసమృద్ధిచంద్రముండగు
ఘనుఁడైన ధర్మరాయనిప్రపౌత్రుఁ
డగుమానసత్కీర్తి లసమానుఁడైన వెం
గళరాయభూపశేఖరుని పౌత్రుఁ
డౌదార్యశౌర్యగాంభీర్యధుర్యుఁడైన
తమ్మయతమ్మవరోత్తముని సుతుఁడగు
[1]విబుధాధినాథసద్విభవాభిరాముఁడౌ
రామరాయ వసుంధరావరుండు

మహితపండితమండలీసహితుఁ డగుచుఁ
బ్రబలు చామర్లకోటాఖ్యపట్టణంబు
రాజధానిగ నాత్మీయరాజ్యభూమి
నేలుచుండెను బ్రజలెల్ల మేలనంగ. 71

గీ. ఆ మహేంద్రుఁడు తమ మేనమామ యగుట
వలనఁ దెనుఁగు వసుంధరావరుఁ డొకండు

1. ఇంద్రుని సంపదం బోలిన సంపదచే మనోహరుఁడు.

గాక తక్కిన మాధవత్పూర్మతిలేంద్ర
చంద్రుని కుమారులెల్ల నచ్చటికిఁ జనిరి. 72

సీ. శ్రీగోలకొండపురీరాజ్యమండలా
ఖండమై భవముచేఁ గ్రాలుచున్న
పాదుషాతరిఘ్రన బహుసంపదలతోడ
నింపొందు రాజమహేంద్రపురిని
బ్రబలు సర్కారుస[1]ర్లష్కరుపైనాతి
లోన నాలుగువేల రాణువకును
మొనగాఁడుగానుండి ఘనవిక్రమక్రమం
బమరఁ దత్పట్టణప్రాంతసీమ
మెలఁగు తెనుఁగురాయేంద్రుని [2]మొహాసతేలకుఁ
గాను యవనాధినాధుండు కాకినాడ
పురముదటినున్న యనపర్తి మొదలుగాఁగఁ
జెలఁగు నొక కొన్నిగ్రామంబు లెలమి నొసఁగె. 73

సీ. వృత్తాంత మదియెల్ల విస్పష్టమగు నది
వరలోన ననపర్తి పురమునందుఁ
గైకొనఁ బడు పెండ్లికట్ల మాగ్రామంబు
ఘనతరంబగు ననుగ్రహము వలనఁ

1. దండు. 2. (పడిన) కష్టములకు.

దెనుఁగు వసుంధరాధీశ్వరోత్తముఁడవు
బహుమానముగ నీయఁ బనుటచేత
నీపైన యావన్న మాపుగావించితి
మని [1]గగనాక్షిశాణాబ్జసంఖ్యఁ
బ్రకటముగు శాలివాహన శకము సంద
నపుడు విశ్వావసుప్రసిద్ధాబ్దమందు
శ్రావణికశుద్ధపూర్ణిమఁ బ్రాయఁ బనుచు
ఘనశిలాశాసనంబును గనుఁ గొనంగ. 74

చ. తెనుఁగు ధరాధినాథమణి తీక్ష్ణకరోగ్రకరాసిధారచేఁ
బనవిభురక్షణార్థమయివాహముతోఁ నొక మ్లేచ్ఛసాదినా
స్తనియలుగా వడిం దునిమితోఁడనె పీఠపురాధిరాజ్యము
జనులు నుతింపఁ దెచ్చె నిజసంతతి కిందిరవైచెలంగఁగన్. 75

చ. కరముగరంబు నెప్పుడును గైకొను మంచు ఖరాసిఁ జేసి యా
దరణ మొసంగునట్టులు కృతజ్ఞత నా యవనాధినాథశే
ఖరుఁడు తెనుంగురాట్ప్రభుశిఖామణి కా మహనీయపీఠికా
పురవరరాజ్యమండలవిభుత్వమొసంగె నభంగవైఖరిన్. 76

మ. కో. సంగరార్జునుఁడైన యావనసార్వభౌమమునీంద్రు తె
న్నంగఁ బ్రోచిన తెన్గుభూతలనాథు ఖడ్గమువైభవో

1. 1520.

త్తుంగమై దగుఁ బీఠికాపురదుర్గమందున నేఁటికిన్
రంగు మీఱుచునుండెఁ బెద్దఘిరం గనంగ నెసంగుచున్. 77

గీ. [1]సప్తసంతానభాగ్యసంప్రాప్తి నొంది
[1]సప్తసంతానభాగ్యసంప్రాప్తిఁ జెలఁగు
తెలుఁగురాణ్మౌళి [2]నీలాద్రి నెలమిఁ చుదకుఁ
దనువు విడనాడి విష్ణుపదంబుఁ జెందె. 78

సీ. కుందారవిందారిమందారసత్కీర్తి
నాంద్రుఁడౌ మాధవత్మాధవుండు
వైరిభూవరవారవారణాధ్యక్షహ
ర్యక్షుఁ డౌ వెంకటరాయవిభుఁడు
సత్కవిసంతానసంతానభూజమై
బరఁగు చిన్నారాయధరణి వరుఁడు
సర్వసర్వంసహాఖర్వధూర్వహుఁ డైన
రామచంద్రకుమారమణివరాళి

ఘన వితరణుండు జగ్గరాడ్జనవరుండు
జిష్ణువిభవుండు వేంకటకృష్ణవిభుఁడు
పృథుల బలశాలి రంగరాయేంద్రమౌళి
యనఁగ నేడ్వురు తనయు లాతనికిఁ గలరు. 79

---

1. ఏడుగురుకొడుకులు—; చెఱువుధననిక్షేపము మొ॥—. 2. జగన్నాథ క్షేత్రమందు.

శా. ఆ రాజన్యకుమారులెల్ల సుకుమారాకారు లంభోధిగం
భీరుల్భీరహితప్రచారు లవనీభృద్ధీరులభ్రద్రుమో
దారు ల్దారుణ విక్రమక్రమసముద్యద్వైరి భూమీంద్రసం
హారు లవ్వారి మనోజ్ఞకీర్తి నికురుంబాధారు లూహింపఁగన్. 80

చ. సురుచిరవైభవాఢ్యులయి శోభిలు వారలలోనఁ బెద్దయై
బరగెడు మాధవాధిపునిపత్నుల కిన్వురకుం గ్రమంబుగా
నిరువురుసత్కుమారు లుదయించిరి తెన్గువసుంధరాతలే
శ్వరుఁ డనఁగ జ్జనార్దననృపాలకవరాళి యనంగ నిమ్మహిన్. 81

సీ. తన మహాటోపప్రతాపాతపమరాతి
సైన్యాగర్వతమంబు సంహరింపఁ
దన చేతి [1]ఘనహేతి ఫణిరాజుశాత్రవ
ప్రాణప్రభంజన శ్రేణి మ్రింగఁ
దన భయంకరకోపదావాగ్నిహోత్రంబు
పరబలవనపరంపర దహింపఁ
దన యానభేరికాధ్వానగర్జారవం
బరిహంసతతికి భయం బొసంగ

నవనిఁ జెలఁగెను వెనుఁగురాయాభిధాన
జనవరవరేణ్యాతనయుఁడు సల్లలితనయుఁ

---

1. గొప్ప ఆయుధము.

డఖిల సద్గుణసముదయుఁ డసమదయుఁడు
పృథుల బలశాలి రంగబాయీంద్రమౌళి. 82

చ. నల నలకూబరానలఘనాధర భూమిధరాధిరాణ్మహా
బల[1]బలసూదనాత్మజులభంగిఁ జెలంగు తురంగయానముం
జెలువముఁ దేజమున్మతి విశేషము ధైర్యము బల్మి శౌర్యము
న్వెలనొస రంగశాయి నరపాలుఁ డెసంగెలసద్యశంబునన్. 83

గీ. బలిమిననిఁబోనఁ జతురంగబలముచేత
శత్రురాజుల బంధించు సరణి నతఁడు
తెలివి నాటల చతురంగబలముచేత
నితర రాజుల బంధించు నతుల గతుల. 84

గీ. కృష్ణరాణ్మౌళి రంగశాయీంద్రమౌళి
గోలకొండకుఁ జని రెండువేలదళము
కల నవాబు హుజూరులో నధిపులైరి
తమదుపూర్వులట్ల తత్కారుణ వడసి 85

గీ: ఇవ్విధంబున సైనికాధీశులైన
వారిలో భూరిసాహస భాసమానుఁ
డనఘుఁ డసమానఘనమానధనుఁడు నగుచు
నిలఁ జెలఁగె రంగశాయిరాజేంద్రమౌళి 86

---

1. ఇంద్రుని కొడుకైన అర్జునుఁడు.

క. చతురంగకేళినత్యా
యత శస్త్రాభ్యాసపటిమ నాపాదుశహా
మతికిం గుతుకంబొసఁగుచు
సతతంబును మసలు నతఁడు దనువు దలిర్పన్. 87

మ. చతురత్వంబున యవనాధిప మహాస్థానంబునం బ్రాభవో
న్నతలీలం జతురంగమాడు నెడఁ [1]బంద్రా యెత్తు లూహించుచున్
బ్రతిభావంతుల నెట్టివారి నయినం బల్మాఱు నోడించు శ్రీ
యుత తేజుం డతఁ డాజి నిట్లరులనే నోడింతు నన్నట్టులే. 88

సీ. లీలచే నరువదినాలుగు గళ్లలో
నశ్వంబు నడిపించునట్టి శక్తి
తొలుదొల్త నిన్ని యెత్తులకుఁ గట్టెద నంచుఁ
దెలిపి యారీతిగాఁ జలుపు నేర్పు
పలువురు గూడిన వారి నొక్కఁడె గెల్చు
పేశలం బగు బుద్ధికౌశలంబు
మంత్రి లేకుండ సామంతుఁడై యెట్టి ధీ
మంతునైన జయించు మతి నిరూఢి
బహువిధంబులఁ జూపుచు నహరహంబు
పాదుషావారి మతికి నామోద మొసఁగు

1. పదియునైదెత్తులు.

నసమతరకీర్తి న్యాయమార్గానువర్తి
పృథుల బలశాలి రంగశాయీంద్రమౌళి. 89

సీ. ఈలీలగాఁ గొంతకాలంబు జనుసంత
కృష్ణరాయేంద్రు శరీరమందు
సౌఖ్యంబులే కున్కిఁ జయ్యనయవనాధి
పాగ్రేసరుని చెంత నాజ్ఞ వడసి
వార లిర్వురు తమవార లెల్ల వసించు
చామర్లకోటకుఁ జనిరి మరలఁ
జని కొన్నిరోజు లచ్చట నున్న పిమ్మట
సెలవు దినంబులు దొలఁగకుండఁ

గృష్ణరాయేంద్రమౌళి తా నేగ లేక
తనదు సంగతి ప్రభువుతో మనవిసేయ
గోలకొండకు వినయాది గుణము లలరు
తమ్ముఁడగు రంగశాయిభూధవునిఁ బనిచె. 90

ఉ. అగ్రజునాజ్ఞఁ జొప్పున సమగ్రబలుండగు రంగశాయిరా
జాగ్రణి గోలకొండపురి కయ్యెడ నేగి విరోధినిగ్రహ
[1]వ్యగ్రమనస్కుఁడైన యవనాధిపచంద్రుని కామితప్రదా
నుగ్రహ మొందఁ గోరుచును నూతనదర్శన మాచరించినన్. 91

1. వేగిరిపడు మనసు గలవాఁడు.

మ. బలభిద్వైభవ శోభమానుఁ డగుచుం బాటిల్లు [1]పాశ్చాత్యరా
ట్కులచూడామణి రంగశాయివిభుతోఁ గూర్మిం దగం గృష్ణభూ
వలయాధీశ్వరమౌళిఁ గూర్చి కుశల ప్రశ్నంబుఁ గావించి ని
ర్మల బుద్ధిం జతురంగమాడుటకు నారంభించె నా పిమ్మటన్. 92

సీ. వాటమై తగు బుద్ధి పాటవాతిశయంబుఁ
బాటిల్ల నాడు నా యాటలోన
శూరులై వఱలెడు వార లిర్వురకును
జరుగు కొంత వచఃప్రసంగరీతి
మత్సరభావంబు మది నంత కంతకు
వర్ధిల్ల ఫాదుషావార లపుడు
పరుషోక్తు లాకకొన్ని బలుక సహింపక
రంగశాయి కుమారరమణమౌళి

యవని బహు జన పోషకుఁడై తనర్చు
యవనవిభుఁ జంప బహుపాప మావహిల్లు
ననుచు వజ్రాయుధోదగ్రమై చెలంగు
తనదు [2]ఖేష్కబ్జుపోటుచేఁ దనువు విడిచె. 93

క. ఆరీతిఁ వజ్రాయుధ
దారుణకరవాలవినిహతప్రాణుండై

---

1. తురకరాజున—. 2. కత్తిపోటుచేతను.

యా రంగశాయినృపమణి
వీరస్వర్గంబునొందె విఖ్యాతి మెయిన్. 94

మ. పటుఁగం దానికిసాటి వాసవునిచే వజ్రంబుగా కుర్విపైఁ
బెఱఖడ్గంబులుబోలఁ జాల వనుచుం బృథ్వీవరాగ్రేసరు
ల్వేఱఁ గొప్పన్ వినుతింప నిప్పటికి నాఖేమజ్జు శ్రీపీఠికా
పురదుర్గంబున నొప్పుచుండెను [1]ద్విషద్భూపాలకాభీలమై. 95

క. ఆరీతి రంగశాయి
ధూర్మారమణుఁడు తనువు విడువఁగా ఫాదుశహా
వారందుకు డెందమున న
పారంబగు చింతఁ గొంత నడి బెగ్గడిలెన్. 96

సీ. పిదపఁ గృష్ణరాయేంద్రునిఁ బిలువనంప
రామచంద్రేంద్రజగ్గరాడ్భూమి వరులఁ
గూడి యా రాజమణి గోలకొండపురికిఁ
జని యవనసార్వభౌముదర్శన మొనర్ప. 97

క. అతఁ డపుడు రంగశాయి
క్షితిపతిమృతిఁగూర్చి కొంత చింత దొలంగన్
హితవచనరచనసముచిత
గతి వారల నూఱడించె గౌరవలీలన్ 98

1. శత్రురాజులకు భయము కలిగించునదియై:

క. అటువలె నోదార్చి సము
త్కటబలుఁడగు కృష్ణరాయధరణీంద్రుని కా
దట యవనప్రభుమణి మును
పటి రీతిని సైనికాధిపత్యం బొసఁగెన్. 99

గీ. రామచంద్రేంద్రజగ్గరాడ్భూమివరులు
కొంత కాలంబు జనుదాఁక గోలకొండ
పురిని వసియించి మఱల చామరలకోట
కెలమి నేతెంచి రవ్విభు సెలవు వడసి. 100

సీ. పిదప కృష్ణారాయపృథివీంద్రచంద్రుండు
సదమ లానుగ్రహ మెదను బొదల
నొకనాఁడు యవన నాయకమౌళి భవదీయ
[1]గురుమాతులుం డౌచు గొమరుమిగులు
చిటినీడి సత్కుల క్షీరాబ్ధిరాకాసు
ధాకరుఁడౌ రామధరణిపతికిఁ
దనయులు లేకున్కిఁ దద్దయుఁ బెద్దయై
దనపుటవలనఁ దద్రాజ్య మెల్ల
నిపుడు నీకు నొసంగితి మేలు మనుచు
సెల వొసఁగ నగ్రజన్ముఁడై చెలఁగుచున్న

1. తండ్రిమేనమామ.

రామచంద్రమహీంద్రసుత్రాము పేరఁ
బట్టిక నొసంగు మనియె సౌభ్రాత్రగరిమ.. 101

క. ఆ రీతినడుగ నాతఁడు
వారల భ్రాత్రైకమత్యపద్ధతికి మదిం
గూరిమిఁ జెందుచు నటువలె
నాయూషిగఁ జేతు ననుచు నాదర మెసఁగన్. 102

మ. [1]పరమానాధ పరంపరాశ్రితజన వ్రాతావనప్రక్రియా
[2]పరమానాయక రామచంద్రధరణీపాలేంద్రు పేరం గృపన్
బరమానాపహృతి ప్రవీణుఁడగు నా పాశ్చాత్యవర్యుం డొగిన్.
ఫరమానా నొసఁగెన్ సమస్తనృపతు ల్వర్ణింప నీ రీతిగన్. 103

ఫరమానా సీసమాలిక :—

గోలకొండపురంబు లీలతో నేలు న 6379
బ్దుల్ హుసేన్ కుతుబులుముల్కుగారి
దరినుండి రామచంద్రప్రభూత్తమునికి
మానితైశ్వర్య నిదాన మగుచుఁ
జెన్నొందు ఫర్మాయిషీ యేమి యనఁ గను
ఘనసంపదల నొప్పు కాకినాడ
సెలపాక ప్రోలునాఁడు లనంగ విఖ్యాతి
వఱలెడు నా మూఁడు పరగణాలు

1. పరమ + అనాధ.  2. పర + మానాయక = విష్ణు—.

తేజంబుఁ బెంపొంద మీ జమీందారిలో
　　నుంచి దానికి నేర్పరించఁ బడిన
కరము నేకోట మాసరస హుజూరులో
　　నర్పించుచును స్వీయమై తనర్చు
ఖర్చుల క్రింద వేడ్కను మొఖాసాగాను
　　వరచామరలకోట పట్టణంబు
రహిమీరు గోవిందరాజుపాలెం బను
　　గ్రామంబు వెంకటరాయనగగ
కాపవరాఖ్యలు గలిగిన గొల్లమం
　　దలపాడు మొదలుగాఁ గలుగు వాసి
ననుభవించుచు మహోఘనము కారణములు
　　గ్రాపించు నప్పుడు బలము చలముఁ
దనరు నాలుగువేల జనముతోఁడుత హాజ
　　రై సరదారికి నతుల గతులఁ
జేయుచుండుటకు [1]పర్మాయించితిమి గాస
　　బహువిధంబుల నలపరగణాలు
పాడుగా నుండుటఁ బట్టి వేలుపు కోటి
　　సాటి వాటిల్లు నేలేటి వజిద
నీరు తీరుగను నిమ్మారసీమకు నాయు
　　రోజు లాచొప్పునఁ బ్రోలు నాఁడు

1. ఏర్పాటుచేసితిమి.

పరగణాలకు నెల్లఁ బది వాసరంబులు
వాసిగాఁ బ్రవహింపఁ జేసికొనుట
కింపు మీఱఁగ నిర్ణయించి నామనియును
సురుచిరంబగు పీఠపురమునందుఁ
బరదురాలోకమై పరఁగు పూర్వపుఁగోట
వాటంబుగాఁ బొందుపఱుచు కొనుచు
వైభవంబొప్ప నివాసంబుగానుండ
వలసినదనుచు నిప్పగిది నెలమిఁ
బొలుపొంద వ్రాయించి మొహరుదస్కతు లొన
ర్పుచు రవానాముద్ర పొసగఁ జేసి
యాఘరమానా మహానుగ్రహస్ఫూర్తి
డెందంబునందుఁ బెంపొంద నొసఁగి

సొగసుగలుగు ఛంకాగడియారములును
జోపుదార్లను మొదలుగా సొంపు మీఱు
బలు [1]కితాబులుఁ దగిన దుస్తులు నొసంగ
వానిఁ గైకొని కృష్ణరాట్పృథివరుండు. 104

క. తన కగ్రజన్ముఁ డగుచున్
దనరారెడు రామచంద్రధరణీంద్రునకున్
వినయమునఁ దెచ్చియిచ్చెను
ఘనమానవనాయకాగ్రగణ్యులు మెచ్చన్. 105

---

1. బిరుదములు.

చ. అలఘుతరావనీమణిమయాభరణోత్కరభూరి[1]భూరిసి
స్తుల వసనప్రదాన పరితోషితసూరిజనాజనార్దనా
కలిత పదాబ్జసేవన నికామహితామహితప్రచండదో
ర్బల బలరామరామ నరపాలకలోక సురాధినాయకా. 106

క. ఆతత సకలశ్రేయో
జాతాతి నిదానదాన జలజలధి సము
ద్భూతపరిపూర్ణసరసీ
జాతాహిత బింబదతుల సత్కీర్తినిధీ. 107

మ. కో. నైకతీర్థనిషేవణాదరణారణాంగణఫల్గునా
నాకలోకమణీమహీజ ఘనాఘనప్రతిపాదనా
పాకశాసన భోగభాసుర పాలితాశ్రితభూసురా
ప్రాకటాహితరాడ్విఘాలక రామరాయనృపాలకా. 108

## గద్యము

ఇది శ్రీజానకీరమణ చరణారవింద నిష్యందమాన మరందపానానందా
నంద మిళిందాయమాన మానస కౌండిన్యగోత్ర పవిత్రదేవులపల్లివంశ
సంభూత సీతారామ విద్వన్మణి పౌత్ర వేంకట కృష్ణశాస్త్రీంద్ర
పుత్ర సుబ్బరాయ సుధీమణిసోదర విబుధజన విధేయ వేంకట
కృష్ణశాస్త్రినామధేయ ప్రణీతంబైన రావువంశ ముక్తావళీ
ప్రబంధంబునందుఁ తృతీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

---

1. బం గారుజరీగల.

శ్రీరస్తు.

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# రాఘవంశముక్తావళి.

## చతుర్థాశ్వాసము.

శ్రీరమణీ రమణీ యా
గారాయిత దృక్ప్రసార[1]కల్పితవిబుధో
దారమనోరథ పూరణ
చారుగుణా రాఘురాయ జగతీరమణా. 1

వ. అవధరింపుము. 2

చ. సురుచిరరాజ్యమండలము సుస్థిరభక్తిఁ దలిర్ప నీగతిన్
వరయశుఁడైన కృష్ణనరపాలవరుం డల రామమూర్తికిన్
భరతునికైవడిన్ సకల పండితమండలరక్షణైక త
త్పరుఁ డగు రామచంద్రవసుధావరమౌళికిఁ దెచ్చి యిచ్చినన్. 3

---

1. కావింపబడిన...కోర్కులనింపు.

సీ. తన యశం బీరీతిధరణిపై వ్యాపించి
విలసిల్లు నను మాడ్కి వెల్లగొడుగు
దాన ధర్మంబులు తనుఁ జాయ కిబ్బంగి
జానొందు నను మాడ్కిఁ జామరములు
జయలక్ష్మి తనముందు సతతంబు నీలీలఁ
జెలువొందు ననుమాడ్కిఁ [1]దెల్లనిశాని
తనువూని తను నీట్లు ధైర్యశౌర్యంబులు
విడనాడ వనుమాడ్కి వేత్రధరులు
మఱియు నొక కొన్ని బిరుదులు నురుతురంగ
రథగజభటాదు లలరంగ రామచంద్ర
నరవరేంద్రుండు పీఠికానగరరాజ్య
మండలాఖండ విభవసామ్రాజ్య మొందె. 4

గీ. కలిత శివధర్మగుణసమాకర్షణుండు
[2]పద్మనాయకవంశశోభాకరుండు
నగుచు నలరొందు రామచంద్రావనీంద్ర
చంద్రునకు రామచంద్రుండె సాటి యగును. 5

గీ. [3]అజడహృదయుఁడు చక్రరతాభిరతుఁడు
గురుహితుండును నిష్కళంకుండు బహుళ

---

1. తెల్లనిజెండా. 2. వెలమవారివంశమునకు, సూర్యవంశమునకు.
3. జడము కాని; జలమయము కాని.

వృద్ధి యుక్తుండు నగుచును వెలయు రామ
చంద్రనృపతికిఁ జంద్రుండు సాటి యగునె. 6

సీ. అతిలఘుత్వంబు హ్రస్వాతిరాక్షరములందఁ
బహువిరోధములు కావ్యములయందఁ
విషమపాదంబులు వృత్తిభేదము లందఁ
విశ్రమంబులు పద్యవితతు లందఁ
బంధముల్సరసప్రబంధజాలము లందఁ
ఘన విచారంబులు కవితలందఁ
విపుల ప్రసంగము ల్వివిధ శాస్త్రము లందఁ
పలు మూర్ఛనలు గానకళల యందఁ
కాని యెందును లేకుండఁగా నఖండ
వైభవాఖండలుం డౌచు వసుధ నేలె
సుకవి జనవర్ణితాఖిలసుగుణశాలి
రామచంద్రవసుంధరారమణమౌళి. 7

శా. జన్యావన్యభిమన్యుఁ డంచితకళాచంద్రుండు ప్రత్యర్థి రా
జ[1]న్యాదిత్యభవుండు భూరితరతేజఃపంకజాతప్రియుం
డన్యస్త్రీజనతాసహోదరుఁడు విద్యాభోజభూజానిస
న్మాన్యుండై తగు రామచంద్రవిభుఁడే తన్మాత్రుఁడే చూడఁగన్.

1. యముఁడు.

సీ. గురుదేవతావనీసురభక్తికాకర
మఖిల ధర్మంబుల కాటపట్టు
మహనీయతరశౌర్యమహిమ కాస్థానంబు
కవిజనంబుల కింటికల్పకంబు
నిరుపమకారుణ్యగరిమంబునకుఁ జోటు
భూరిసత్కీర్తికిఁ బుట్టినిల్లు
సకలసద్గుణమణిప్రకరంబుల కొటారు
బంధువర్గములకుఁ బట్టుఁగొమ్మ

యనుచు జను లెల్ల వినుతింప నల దిలీప
నలనహుషరంతిదేవశంతనుకకుత్స్థ
ముఖ్యనృపతుల మఱపించి పుడమినేలెఁ
[1]గృతయుగస్ఫూర్తి రామచంద్రేంద్రమౌళి. 9

సీ. శ్రీరావు సత్కులక్ష్మీరాబ్ధిచంద్రుఁ డౌ
రామచంద్రకుమారమణమౌళి
శ్రీసర్వవరమహాక్షేత్రరాజమునందుఁ
గొంత భూమిని రమాకాంతుఁ డనఁగఁ
దనరు భట్టరజగన్నాధదేశికునకు
భక్తి మీఱఁగ సమర్పణము సేయ

1. కృతియుగ మని తోఁచునట్లు.

నెలమిచే నతఁ డది యిరువదియొక [1]వృత్తు
లగునట్లు లేర్పాటు తగ నొనర్చి
భావనారాయణస్వామివారి దివ్య
మందిరంబున కెదుటను సుందరముగ
నగ్రహారంబుఁ గట్టించె నాఖ్యలెన్న
నదియుఁ గ్రమముగ నభివృద్ధినందుచుండె. 10

క. మఱియు ననేకము లగుచున్
వఱలెడు సుకృతములొనర్చి పఱఁగిన యాభూ
వరమణిఁ గొనియాడుటకున్
ధర మాదృశమానవులకుఁ దరమా తలఁపన్. 11

గీ. రామచంద్రమహేంద్రసుత్రామునకు పి
తృవ్యుఁడై నృసింహపార్థివుఁడు గాంచె
నాత్మజులఁ జిన్నరాయనీలాద్రిరాయ
రామరాయేంద్రు లనఁగ నా రాజులందు. 12

గీ. వరయశుండైన నీలాద్రిధరణిపతికి
నలువు రుదయించి రాత్మజుల్నరసవిభుఁడు
బుచ్చయేంద్రుండు వెంకటభూవిభుండు
చిన్నరాయేంద్రుఁ డనఁగ నక్షీణబలులు. 13

---

1. జీవనసాధనములు.

గీ. హాయనశక[1]మద్రినిగమరసాబ్జసంఖ్యఁ
బ్రబలు నప్పుడు మొదలు నారామచంద్ర
విభుఁడు [2]శశిమునిరసశశులఁ బృథివిఁ జెలఁగు
వఱకు నిరువదినాల్గేండ్లు వసుధ నేలె. 14

గీ. రావు వంశాబ్ధిచంద్రుఁడౌ రామచంద్ర
జనవరేంద్రున కారామచంద్రునకును
గుశలవులరీతి ఘననీతికుశలమతులు
సుతులుజనియించి రిరువురు సుజనహితులు. 15

క. వారలు పెదమాధవరా
మ్యారమణుఁడు నారసింహభూపాలుఁడు నాఁ
బేరువహించి జగంబున
నారూఢిగ మించికాంచి రంచితకీర్తిన్. 16

గీ. [3]పెద్ద మాధవరాయపృథ్వీవరుండు
బాలుఁడై గ్రాలుచుండుట వలన నతని
జనకునకుఁ దమ్ము డైన యొప్పు జగ్గరాయ
కృష్ణరాయేంద్రు లారాజ్య మెలమిఁ దాల్చి. 17

గీ. తుర్మద్రిరసచంద్రసంఖ్యాక హాయనశకము
మొదలుకొని [4]ధాతృగిరిరసభూమిసంఖ్యఁ

1. 1647. 2. 1671. 3. 1671. 4. 1679.

బుడమి నాంగ్లేయఁవర్షంబు నడచువఱకు
నిలను వారలు పాలించి రనిమిదేండ్లు. 18

ఉ. హయాణశకాబ్దముల్ [1]జలరుహోద్భవశైలరసేందుసంఖ్య నీ
క్షోణితలంబునం దమరి చొప్పడు నప్పు డనూనభోగగీ
ర్వాణ విభుండు మాధవనృపాలవరుండు సమస్తసజ్జన
త్రాణపరాయణుం డగుచుఁదాల్చె నిజాఖిల రాజ్యభారముల్. 19

ఉ. ఆదిని రాజ్యలక్ష్మినరయన్ స్వగురుం డగు రామ చంద్రరా
డ్భూధయితామనోహరుఁడు పూని ప్రసిద్ధినిఁ గాంచినట్లు యా
మోద మెసంగ రాజ్యమునుఁ బొందుగ నేలుచు సర్వరాజ్యసం
పాదన మాచరించి పెదమాధవరాట్ప్రభుఁ డొప్పె మిప్పుగన్. 20

సీ. కొమరొందు చామర్లకోట కోటకుఁ [2]గొమ్మ
లిమ్ముగాఁ గట్టించె నేప్రభుండు
ఘనపీఠపురదుర్గమునకుఁ జుట్టును గొప్ప
కుడ్యంబు నిల్పె నే కుజనహరుఁడు
ప్రభుసార్వభౌములౌ ఫాదుషావారిచే
బిరుదులు వడసె నేవరచరిత్రుఁ
డల వక్కలంక వీరనకవిచేత వం
శావళీకృతిఁ గాంచె నే విభుండు

---

1. 1679. 2. బురుజులు.

పృధివి నారాజమూర్ధన్యు నెన్నఁ దరమె
యనుపమాఖండలక్ష్మీకటాక్షపాత్రుఁ
డహిత జనలోక భీకరమహితబలుఁడు
రమ్యగుణహారి మాధవరాయశౌరి. 21

సీ. అయ్యెడవత్సవాయాన్వయుండౌ చతు
ర్భుజ తిమ్మరాజాఖ్యభూవరుండు
కరిమెళ్ల కులజుఁడై వలలు భూవరునితోఁ
గొమరొందు నోడపైఁ గూరుచుండి
కూలంకషంబైన గోదావరీనది
నెలమిచే వాహ్యాళికేగు నపుడు
పరిహాసమిషమునఁ బడఁద్రోసి యాతఁడు
వొలియుకున్న[1] నరిత్రమున వధించి
సమధిక తదీయదుళ్ల రాజ్యంబుఁ గడిమి
నాక్రమించిన నవ్వార్త నంతఁ గొంత
కాల మరుగంగ నిజభటాగ్రణుల వలన
సాంతముగ నాలకించుచు నలుకవొడమి. 22

క. కరితురగరథభటోత్కర
పరివృతుఁడై బలము చలము భాసిలఁ బెద్దా

1. తెడ్డుతో.

పురముపయిం బెదమాధవ
ధరణీవరశేఖరుండు దండెత్తి చనన్. 23

ఉ. తిమ్మజగత్పతీంద్రుఁడు సుధీజనతావినుతాయతప్రతా
పమ్మున నొప్పు మాధవనృపాలునిధాటికి భీతి నొందుచుం
గ్రమ్మఱ దుర్గ రాజ్యము సగంబు ముదంబున నిచ్చి ముఖ్యస
ఖ్య మ్మొనరించి మించె నపు డా ధరణీతలనాథమౌళితోన్. 24

సీ. అప్పు డవ్వత్సవాయాన్వయుం డౌ చతు
ర్భుజ తిమ్మరాజభూభుజునితోడ
ననుపమం బగు సఖ్యమున కియ్యకొని పెద్ద
మాధవరాయక్ష్మామాధవుండు
భీమేశనామక శ్రీమన్మహాదేవ
సేవాసమాసక్తచిత్తుఁ డగుచు
నాత్మీయమానట్టి యనపర్తి యనెడు గ్రా
మంబు నారాజన్యమణికి నొసఁగి
నైజమహనీయరాజ్య మండలములోనఁ
గలసి మెలసి తదీయమై యలరుచున్న
భీమవర మను పేరిచే వెలయు పురము
[1]వినిమయంబుఁ దలిర్పఁ జేకొనియె నెలమి. 25

---

1. మార్చుకొనుట.

ఉ. ఆయెడ బెండపూడి నగరాయతదుర్గమదుర్గమండలిన్
బాయక యేలు కాకతినృపాలుఁడు కౌతుకలక్షణాన్వితం
బాయక రాడ్వ్యధూటినిఁ గృపారహితాత్మకుఁడై హరింప న
త్యాయతరీతి నానృపుల కయ్యెను గయ్య మనేక వర్షముల్. 26

క. పెద మాధవరాయేంద్రుం
డది విని మదిఁ గోప మంత కంతకుఁ బెరుఁగన్
మదమత్తుఁ గాకతి ప్రభు
నదిమెద నని బయలు వెడలి యచ్చటి కరిగెన్. 27

గీ. అవ్విధంబునజయ్యన నచటి కరిగి
తక్షణంబె సమస్తవైరిక్షితీంద్ర
వర్గదుర్గమదుర్గాంబుమార్గ మతఁడు
కడిమి బంధించి శత్రుసంఘంబు నొంచి. 28

క. పాయక రాయనృపాలుని
కాయత ముదమొసఁగి మాధవాభిఖ్యోర్వీ
నాయకుండు బెండపూడి
శ్రీయుత దుర్గాధిపత్య సిద్ధి నెసంగెన్. 29

చ. అరయ నవీనరాజ్యముల యార్జన మీగతి నాచరించుచున్
గురుతరరాజ్యపద్ధతులు గూర్చి మహీతల మేలె వాణావ

త్సరములు [1]సాగరాభ్రగిరిధారిణి సంఖ్య నెసంగుదాఁక ని
ద్ధర పెదమాధవప్రభుసుధాకరుఁ డిర్వదిమైదు వర్షముల్. 30

చ. అతని యనుంగుతమ్ముఁ [2]డమరావనిజాతశతారతారకా
హితసితవారిజప్రకరహీరపటీరమరాళమల్లికా
శతధృతినందనాబ్జవిలసద్యశుఁడై నరసింహరాయభూ
పతి నుతిఁ జెందె శత్రుజనభంజనసజ్జనరంజనస్థితిన్. 31

క. [3]బాణాంబరగిరిచంద్రుల
వాణాశతాబ్దంబు నడుచు నప్పుడు విబుధ
శ్రేణి నుతింప నృసింహ
క్షోణీంద్రుఁడు రాజ్యలక్ష్మి సొంపుగ నొందెన్. 32

సీ. శ్రీలుఁడై కారుణ్యశీలుఁడై దుర్జనా
భీలుఁడై సదవనలోలుఁ డగుచు
జైత్రుఁడై కవికృతస్తోత్రుఁడై సత్ప్రభా
మిత్రుఁడై విదళితామిత్రుఁ డగుచు
మానియై బంధుసన్మానియై సుమహిత
జ్ఞానియై హృతహితగ్లాని యగుచు
వర్యుఁడై ప్రాకటౌదార్యుఁడై సంపూజి
తార్యుఁడై విఖ్యాతచర్యుఁ డగుచు

1, 1704. 2. దేవవృక్షము, వజ్రాయుధము, చంద్రుఁడు, తెల్ల తామరల సముదాయము, వజ్రములు, మంచిగంధము, హంస, మల్లెపూలు, నారదుఁడు, శంఖము. 3. 1705.

[1]సుకలుఁడై సంతతాభ్యస్త[2]సుకలుఁ డగుచు
నిల నలరె రామచంద్రరాయేంద్రసుతుఁడు
పెద్దమాధవరాయపృథ్వీవరాను
జన్ముఁడగు నారసింహరాజన్యవరుఁడు.

శా. ఆరీతింబదియేఁడువర్షములు రాజ్యంబేలి యానారసిం
హారాయప్రభుమౌళిశాలివాహనశకము[3]య్యబ్ధారినేత్రోర్వీభృ
త్తారానాయకసంఖ్యఁ బాటిలు నెడం[4]దంభోళిభృత్పట్టన
స్ఫారోదారనివాససౌఖ్యకలనాసంసక్తి నొందెన్ రహిన్. 34

క. అల రామచంద్ర నృపతికి
నిలపై నను జన్ముఁడైన కృష్ణేంద్రున్ సహా
గల రిరువురు సుతులతులా
త్ములు వెంకటరాయ తెలుఁగు భూలసఁగన్ వగు 35

క. కలఁడా నృసింహ రాడ్భా
తల నాయకమౌళి కొక్క తనయుం డలఘూ
జ్వాలబలవిజితమహాబలుఁ
డిల వేంకటరాయ ధారుణీంద్రుం డసఁగన్. 36

చ. విలసితకీర్తిసాంద్రుడగు వెంకటరాయ నరేంద్ర చంద్రుఁడ
త్యలఘుభుజాగ్ర భాగమున నాయతరాజ్యభరంబుఁ దాల్చె ను

1. ఉన్నదిలెస్సగానిచ్చుచుననుభవించువాఁడు. 2. మంచికళలు గలవాఁడు.
3. 1721. 4. అమరావతి.

జ్వాలవిపుల ప్రతాపరుచి సర్వదిగంతములందు నిండ ని
య్యాలనలవాణవర్ష[1]ముఖదృఙ్మనిచంద్రులు నొప్పుచుండఁగన్.

సీ. తనఘనాభ్యుదయ నూతన ఘనాభ్యుదయంబు
కవి చాతకాహ్లాద కరముగాఁగఁ
దనసాంద్రకీర్తి సుందరచంద్రికా స్ఫూర్తి
సన్మనః కుముద రంజకముగాఁగఁ
దనసముద్ధత కోపదావానలాటోప
మఖిలదుర్జనవనోద్ధతినణంపఁ
దనప్రతాపసమగ్రతపనప్రతాపంబు
వైరినీహార సంహారిగాఁగ
నెలమి నెనిమిదివర్షంబు లిలనుబ్రోచి
రావు వేంకటరాయ పృథ్వీ వరుండు
[2]గజనయనశైల చంద్రసంఖ్యాకహాయన
వత్సరమునందు వైకుంఠపదము నొందె. 38

చ. అతని పితామహాగ్రజుని కాత్మజుఁడై నజనార్దనాహ్వయ
క్షితిపతికిన్ సుతుండగుచుఁ జెన్నగు వెంకటకృష్ణరాయభూ
పతి[3]వసు నేత్రగోత్ర హిమభానుల హాయనశకాబ్దమొప్పుచో
నతులితరాజ్యవైభవము నందె నమంద కుతూహలంబునన్. 39

1. 1721. 2. 1728. 3. 1728.

సీ. [1]కమలాధిపునిమీఱుఁ [2]గమలాధిపుని గేరుఁ
గరుణచేతఁ బ్రతాప కలనవలన
[3]హరికుమారునిమీఱు [4]హరికుమారుని గేరు
విలువిద్య ననవద్య వితరణమున
[5]వాచస్పతినిమీఱు [6]వాచస్పతిని గేరు
మహిమాతిశయముచే మతినిరూఢి
[7]శంబరారినిమీఱు [8]శంబరారినిఁ గేరు
చక్కఁదనంబున సద్విభూతి
నితఁడటంచును జనులెల్ల నుతియొనర్ప
జగతిలోనఁ బ్రసిద్ధిచే నెగడె మిగుల
మహిత జేచర్లగోత్రాబ్ధిహిమకరుఁడు
రావు వెంకటరాయ పృథ్వీవరుండు. 40

క. ఆయన తన పేర జను
ల్వేయు విధంబుల నుతింప వెంకటకృష్ణా
రాయపురంబను గ్రామం
బాయత సత్కీర్తి వెలుఁగ నవని సృజించెన్. 41

గీ. తెనుఁగు రాజేంద్రముఖ్యులై దేజరిలిన
స్వకులభవులగు పూర్వభూపతుల కరణిఁ

1. విష్ణుని. 2 సూర్యుని. 3. అర్జునుని. 4. కర్ణుని. 5. బ్రహ్మను.
6. బృహస్పతిని. 7. మన్మథుని. 8. శివుని.

బీరపురరాజ్యలక్ష్మి నవ్విభువరేణ్యుఁ
డనుభవించుచునుండె స్వేచ్ఛానువృత్తిఁ. 42

సీ. వరపరాక్రమముచే వఱలు వెంకటకృష్ణ
రాయవసుంధరా రమణుఁడట్లు
తనదురాజ్యంబుపైఁ దనరు ఫేష్కుషు పైక
మించుకేనియును జెల్లించకుండ
నుంచుటచే మహోద్దండ ప్రతాపంబు
వెలయ వసూలుఁ గావించు కొఱకుఁ
గొంతసైన్యమునిచ్చి గోలకొండ నెసంగుఁ
పాదుషావారిచేఁ బంపఁబడిన

మానధనుఁడగు నాదిహులుసేననంగఁ
దనరు సరదారుతోడఁ బెద్దాపురంబు
సరస నొకమారుచేఁ బ్రోలు దరిని మరల
నరు లరుదుఁ జెందునటులుఁ బల్గుర మొనర్చె. 43

గీ. అటులనేక సహస్రసంఖ్యాకవీర
భటులతోఁ గూడి విక్రమార్భటిఁ గడంగి
[1]చటులరిపు బలపటల హృత్స్ఫుటములదర
ఘనుఁడు వెంకటకృష్ణేంద్రుఁడని యొనర్చె. 44

1. వడిగల శత్రు సేనల సముదయము యొక్క గుండెలు.

మ. పటుబాహాబలసాహసాతిశయము ల్పాటిల్లఁ జేఁబ్రోలుచెం
గటఁ గావించిన సంగరంబున నభంగ ప్రౌఢిమం జూపి [1]భూ
విటులెన్నం బెనుమర్తి వెల్మదొరలున్ బీతాపురీ వాసులౌ
భటులుం గొందఱుఁ బేరులున్విడిచిరౌఁ బ్రాణంబులొక్కుమ్మడిన్

ఉ. వెంకట కృష్ణరాయపృథివీపతికగ్రజ సూనుఁడైన[2]మీ
నాంకహరోపమాయతబలాకలితుండగు బుచ్చిరా డ్విభుం
డంకురిత ప్రతాపశిఖి నా రణమందు విరోధియోధులం
బింక మడంచిగాంచెఁ గను వేడుకతో సురలోకసౌఖ్యముల్. 46

గీ. యవన రాజన్యవరులచే నతులకీర్తి
నెసఁగు వెంకటకృష్ణరాయేంద్రు పేర
వ్రాయఁబడినట్టి [3]పట్టికల్ వఱలుచుండె
నేటికిని బీఠికాపురి కోటలోన. 47

గీ. ఎలమి వెంకటకృష్ణరాయేంద్ర మహాళి
మహాణశక[4]భుజబాణశైలాబ్జ సంఖ్యఁ
బొదలు వఱకును బ్రజలెల్ల ముదము నొంద
ముప్పదియు నొక్కవర్షంబు పుడమినేలె 48

సీ. పృథివి నా వెంకట కృష్ణేంద్రుఁ డేలిన
తరువాత నాతని తండ్రి తాత

1. రాజులు. 2. శివుని. 3. హుకుములు. 4. 1759.

యగు తెలుంగు ధరాతలాధీశ్వరుఁ తనూజుఁ
డైన నృసింహగోత్రాధినాథు
తనయుఁడౌ నీలాద్రి ధరణీపతికిఁబుత్రు
లౌ నరసన్న బుచ్చన్న నృపతి
వెంకటేంద్రుఁడు చిన్నవిభుఁడును నను నల్గు
రందు రెండవ యతఁడైన యట్టి
బుచ్చిరాడ్భూమి జానికిఁ బుత్రుఁడైన
చిన్నమాధవ రాయేంద్ర శేఖరుండు
ప్రాణవర్షంబు [1]ద్రుహిణ బాణాద్రియామి
నీంద్రుల నెసంగు నెడ నేల నేలఁ దొడఁగె. 49

క. రణకేళీ విహరణ విత
రణ విద్యానిపుణుఁ డగుచు రాజన్యజనా
గ్రణులెల్ల నుతింపఁ గ ధా
రుణి చినమాధవధరావరుం డేలె నోగిఁ. 50

గీ. ఆమహీపాలమౌళి పట్టాభిషిక్తుఁ
డైనవర్షంబు మొదలుగా [2]నక్షి శాస్త్ర
గిరిధరణిసంఖ్య నెసఁగు నాంగ్లేయవత్స
రంబువఱకును మూఁడేండ్లు రాజ్యమేలె. 51

---

1. 1759. 2. 1762.

క. సదమలవిపులయశంబున
బొదలినచినమాధవాఖ్య భూమీదయితా
హృదయేశునకాత్మజుఁడై
పెదమహీపతిరాయధరణి విభువరుఁడలరెన్. 52

క. మహనీయరాజ్యభారము
విహితాహితుఁ డగుచుఁ బూనెఁ బెదమహీపతిరా
ణ్మహివరుఁ [1]డక్షి.రసాచల
మిహికాంశులహాణశకము మెలఁగుచునుండన్. 53

సీ. కొదలేక పొదలు సంపదలు సొంపు దలిర్పఁ
బట్టాభిషిక్తుఁడై భవ్యకీర్తి
విలసిల్లుచున్నయా పెదమహీపతిరాయ
ధరణీతలాధీశ వరుని చెంత
సతనిపితామహుండగుబుచ్చిరాయేంద్ర
చంద్రునకిలనగ్ర జన్ముఁడైన
నరసన్నధారుణీశ్వరునకుఁ దనయుఁడౌ
నీలాద్రిరాయభూపాలవరాళి
మంత్రిగానుండి సకలసామంతనృపతి
లోకవర్ణితనీతిశాస్త్రైకరీతి

1. 1762.

మీఱఁ దద్భూదిరాజ్యాధికారమెల్లఁ
బృథుతరాటోప మలరఁ గావించుచుండె. 54

గీ. కొమరగిరి యను పురిచెంతఁ గొమరు మిగులు
భూములం దెల్ల బహుసస్యములు ఫలింపఁ
జెఱువుఁ ద్రవ్వించె జనము లచ్చెరువుఁ జెందఁ
బెదమహీపతి రాయభూవిభువరుండు. 55

చ. [1]హరిహయవైభవాకలితుఁ డైన మహీపతిరావుఁ బీఠికా
పురవరదుర్గమున్విడిచి భూరినిజాశ్రితకోటిగొల్వఁగా
గురుతరమైన చామరలకోటపురంబున నొప్పు కోటలోఁ
బఱఁగ వసించి రాజ్యపరిపాలన మొప్పఁగఁ జేయుచుండఁగన్. 56

సీ. నీలాద్రిరాయభూపాలాగ్రగణ్యుండు
పెదమహీపతిరాయ విభునిచెంత
భూరిస్వతంత్రాధికారంబు బెంపొందఁ
బ్రాజ్యతత్రాజ్యసామ్రాజ్యపదవి
ననుభవించుచునట్టు లలరుచుండుటఁ గాంచి
బంధువు లొక్కంద ఱోర్వంగలేక
మహీపతిరాణ్మహామహుని డెందమునకుఁ
గలక వాటిల్లు రీతిగా నొనర్ప

1. ఇంద్రుని.

నవ్విధంబల్ల నరసినీలాద్రిరాయ
ధరణి నాథుండు దత్పురీ వరము వెడలి
చనియె జూపల్లి వారిరాజ్యమునఁ దనరు
కాపవర మర్గ మనియెడు గ్రామమునకు. 57

గీ. అతఁడు మహిపతిరాజ్మౌళి కచటనుండి
రాజ్యమున కొంతభాగంబు రహినొసంగు
మనుచు బహువర్తమానంబు లంపెఁ గాని
నుచితమగు నుత్తరంబుఁ దా నొందఁడయ్యె. 58

క. ఆపై నా నీలాద్రి
క్ష్మాపాలకలోకమౌళి సమధికరీతిఁ
గోపాటోపంబెదలో
నేపారఁగఁ గొన్నిదినము లేగిన పిదపన్. 59

సీ. ఏసద్యశోధను లెలమిఁ జిత్రాడన
గ్రామవాస్తవ్యులై గణుతిఁ జెంది
రే స్వామికార్యక్రియైక ధురంధరు
లనతతనిజాశ్రయుఁ సక్తి మించి
రే [1]సుధీజనగేయ పృథులమాననిధాను
లాత్మీయకులజులై ఖ్యాతిఁ గాంచి

1. విద్వాంసులు స్తుతింపఁగదగిన గొప్ప గౌరవమే ద్రవ్యరాశి గాఁగలవారు.

రే రాజశేఖరు లన్నరయ్యపాపయ్య
నరసయాహ్వయము లిద్ధరణిఁ దాల్చి
రట్టివారల మువ్వుర నాత్మహితుల
నతులబలములతోడ సీలాద్రివిభుఁడు
సెలవొసఁగి వీరనగరమండలము కసిచె
నందుఁగల కొన్నిగ్రామంబు లాక్రమింప. 60

మ. అతులామువ్వురుఁ గ్రమ్మఱంజని సముద్యద్విక్రమప్రక్రమా
ర్భటితోఁ బీరపురాధిరాజ్యవిలసద్గ్రామంబులం గొన్ని ప్రా
కట తేజంబు దలిర్ప నాక్రమణముం గావించి దోమాడి చెం
గటఁ దత్సస్యఫలాదికంబు లిడుచుం గాపాడు కాలంబునన్. 61

ఉ. [1]శ్రీధరతుల్యుఁడై వినుతిఁ జెందు మహీపతిరాయనామక
క్ష్మాధిపలోకచంద్రునికి శ్యాలకుఁడై దగు చింతపల్లిగం
గాధరరామరాట్ప్రభుశిఖామణి దత్సకలం బెఱింగి స
క్రోధమనస్కుఁడై సుభట కోటులతో నటకేఁగెఁ జయ్యనన్. 62

*మహాస్రగ్ధర.
చనియా భూపాలకాగ్రేసరుఁడు గనుఁగొనం
జండ వేగక్రమోద్య
ద్ఘుస [2]కాండౌఘప్రకాండోత్కటచటులబలో
ద్దండ[3]వేదండపాళీ

1. విష్ణుమూర్తితో సమానుఁడు. 2. గుఱ్ఱముల. 3. ఏనుఁగుల.

కనదుచ్చస్యందనప్రాకటభటపటలా
ఘాతసంభూతధూళీ
జసితాభ్రభ్రాంతినృత్య త్సమధిక [1]శిఖియకా
శాత్రవావాససీమన్. 63

క. అటువలెఁగని యతఁడరిబల
పటలంబులతోడ నాత్మ భటులుండానుం
బటుగతితోఁ బోరుటకై
చటులతరపరాక్రమం బెసంగఁ గడంగెన్. 64

చ. అపుడిరువాఁగుసైనికు లహంకృతిమీఱఁ బరస్పరస్ఫుర
ద్విపులజయాభిలాషమున వీఁకననేకవిధాయుధంబులన్
ద్విపహయవారవీరభట దేహచయంబులనుండి శోణితం
బపరిమితంబుగాఁ దొరఁగు నాహవకేళినొనర్చుచుండఁగన్. 65

సీ. సూరయ్య పాపయ్య క్షోణీంద్రు లిరువురు
నురుతరధైర్యవిస్ఫురణఁ దనర
నంతనత్యంతదుర్దాంతరోషస్వాంతు
లగుచుఁ దదూర్భారిసైన్యంబులోసఁ
జెలరేగిచలమూని [2]కలితశాతకృపాణ
పాణులై యుత్తమాశ్వముల నెక్కి

1. నెమళ్లు కలది. 2. పట్టుకొనఁబడిన వాడి కత్తులుగల.

మహాసీయగతినొప్పు మదపుటేనుంగుల
గములపైఁ గవయుసింగముల కరణి
ఎడి విరోధి జనంబుపైఁ బడికడంగి
కరము లురములు శిరములు నఱికివైచి
మారిమసఁగిన పగిది న వ్వీరవయ్య
లబ్బలంబులఁ జించి చెండాడుచుండ. 66

మ. తెగువన్ మించిననారిఁగన్గొనుచు నెందే చింతపట్లాన్వయుం
డగు గంగాధరరామరాడ్విభుడు గోపాటోప మేపార న
ప్పగఱం ద్రుంచె నటంచు వెల్వడి శరప్రాసప్రకాండాసికుం
తగదాద్యాయుధకోటిచే నహితసైన్యం బెల్ల నుగ్గాడుచున్. 67

గీ. జెలఁగుచుండఁగ నపుడు [1]సంకులరణంబు
జరిగెఁ దద్భూరిఘోరసంగరమునందు
రావుసూరయ్య పాపయ్య ప్రభువులఖిల
జనులు వినుతింప సురలోకమునకుఁ జనిరి. 68

గీ. మహితరిపుకోటిఁ దునిమి త న్మస్తకములు
వస్తుచయమునుఁగొనివచ్చి ప్రమదమొసఁగె
నతులబలుఁడైన చింతపట్లాన్వయుండు
పెదమహీపతిరాయభూవిభునికపుడు. 69

---

1. దొమ్మియుద్ధము.

గీ. అప్పు డవ్వార్త రావునీలాద్రిరాయ
ధరణి విభుమణి విని కాపవరమునుండి
జగతిజూపల్లివారి రాజ్యంబునందె
పఱఁగుచుండెడు రాఘవ పురికినరిగె. 70

గీ. అది మొదలుగాఁగ రెండేండ్లు ముదమెసంగఁ
బెదమహీపతి రాణ్మౌళి పృథివినేలి
హాణవర్షంబు [1] బాణరసాద్రిచంద్ర
సంఖ్యఁజను నెడ సురనివాసమున కరిగె. 71

క. అవని భరం బట్టుపై రా
ఘవపురమున నుండివచ్చి కలితయశఃప్రా
భవుఁడగు నీలాద్రివిభు
ప్రవరుండు ధరించెనాత్మ బాహాగ్రమునన్. 72

శా. ఏవారల్మను రంగరాయబిరుదా స్వీతుల్ ప్రవేశించిరో
శివింబొబ్బిలి పట్టణంబున నకుంఠీభూతదోశ్శౌర్యరే
ఖావిఖ్యాతిద లిర్పఁ దత్కులజ రంగారాయభూజానిపృ
థ్వీ [2] వాల్లభ్యమునొందియుండె నపుడ ప్వీటన్ని రాఘూటతన్. 73

సీ. సత్యసంధుఁడు దృఢజ్ఞానశాలివివేకి
చతురుపాయక్రియా సంప్రయోక్త

---

1. 1765. 2. ప్రభుత్వమును.

[1]శక్తిత్రయయుతుండు [2]షడ్గుణక్రమవేది
నిత్యనీతివిభేద నిపుణశీలుఁ
డనుపమౌదార్యధైర్య స్థైర్య గాంభీర్య
శౌర్యచాతుర్య ప్రశస్తి ధుర్యుఁ
డాచార్యవిప్ర దేవారాధనరతాత్ముఁ
డఖిలప్రజారంజనానురక్తుఁ
డతని వినుతింపఁ దరమె మత్తారిమస్త
మకుటమాణిక్యమండలీమహితకాంతి
పూరనీరాజితాంఘ్రినీ రేరుహుండు
వీరసింహుండు రంగరాడ్విభు వరుండు. 74

ఉ. సాహసవిక్రమార్కుఁడతి చండపరాక్రమ[3] రేణుకాసుతుం
డాహవసవ్యసాచి విదితాఖిలనీతికలాపుఁ డార్యసం
దోహవిధేయవర్తనుఁడు దోర్బలవైభవభీమసేనుఁ డ
త్యాహితహారి రంగవసుధావరవర్యుఁడు రాజమాత్రుఁడే. 75

క. ఆతని సోదరుఁడహిత
వ్రాతనిపాతనవిధాన పరమవ్రత దీ
క్షాతత్పరుఁడై వెంగళ
భూతలనాథుండు శౌర్యమూర్తి దలిర్చెన్. 76

1. ప్రభుమంత్రోత్సాహ శక్తులు. 2. సంధివిగ్రహాదులు.
3. పరశురాముని బోలినవాఁడు.

శా. ఆశౌర్యోన్నతిఁ డాహవంబున సుబాహాసాహసిక్యక్రియా
వైశారద్యముఁ జూపెనేని యెదుటన్ వర్తింపఁగా వచ్చునే
యాశాపాలురకైన పాండుతనయాద్యత్యుగ్రదోర్విక్రమ
శ్రీశూరావళికైన ధాత్రిపయి నక్షీణప్రతాపోన్నతిన్. 77

సీ. ఇతరజనాసాధ్య వితతవిక్రమరూఢి
వెలయు నవ్వీరరాడ్వితయమందు
నసహిష్ణుభావంబు పొసఁగత ద్దేశస
దేశమండలమందుఁ దేజరిల్లు
భూరిదానక్షాత్ర ముఖ్యసద్గుణధుర్య
పూసపాటికులాబ్ధి పూర్ణచంద్రుఁ
డనుపమానప్రాభవాఢ్యుఁ డావిజయరా
మాహ్వయుండగు మహారాజవర్యుఁ
డచటికల[1] మ్లేచ్ఛసార్వభౌమాజ్ఞవలన
నలఘుదంతావళాశ్వరథాదిసైన్య
ములసముద్ధతి నుద్ధత ముల్కు రాక
నాలకించుచుఁ దజ్జయాలోలుఁడగుచు. 78

క. కడుదూర మెదురుగాఁ జని
బొడగని ధనకనకవస్త్రములు కాన్కలుగా

1. తురకచక్రవర్తి (గోల్కొండ నవాబు.)

నిడియతనికిఁ దోడ్పడి వ
చ్చెఁ గుహాయిజరుజంగుఁ గాంచి చెలిమి సలుపుచున్. 79

గీ. పరులదుర్గంబు నాక్రమింపఁగఁ దలంచి
విపులతరవిత్త మొసఁగి య వ్విభువరుండు
వారికయ్యెడ దర్శనాభావమునకు
యత్న మొనరించి పోరగునట్లొనర్ప. 80

శా. రంగారాయవసుంధరారమణమూర్ధన్యుండు సంధిక్రియా
సంగిత్వంబునఁ బెక్కుచందములమించం జేయు నయ్యత్నము
ల్భంగంబొందుటఁ బోరునిశ్చయముగా భావించి కాంతావధం
బంగీకార మొనర్చె మాన మెధనం బౌఁగాన మున్మున్నఁగన్. 81

క. అటువలె [1]నవరోధవధూ
త్కటవధపూర్వకముగాఁగఁ గడఁగి ప్రతాపో
ద్భటభటపటుతరఘోటక
రటిరథయూథములతోడ రణకౌతుకియై. 82

ఉ. సంగరసవ్యసాచి యురుసాహసశాలి నిజానుజన్ముఁడా
వెంగళరాయశూరమణి వీరరసం బిటుమూర్తిదాల్చెనాఁ
జెంగటఁ దోడుసూప రిపుసేనలపైఁ గరటివ్రజంబుపై
సింగము వైఖరిం గవిసి చిందరవందరగా నొనర్చుచున్. 83

1. అంతఃపుర స్త్రీల—.

సీ. శ్రీరామలక్ష్మణాకృతిబూని రొకచోట
[1]వైరిపఙ్క్తిశిరఃప్రపాతనమునఁ
గృష్ణార్జునోపమశ్రీఁదాల్చి రొకవంక
నహిత[2]సైంధవఘాత విహరణమున
మాద్రేయరూపసామ్యముఁ జెందిరొకచోఁ
నభియాతి [3]సుబలజాతాభిహతిని
బవనవైశ్వానరధార్భటిఁ గాంచి రొకదండ
విద్విషత్కానన చ్ఛేదవిహృతి
మూర్తులగుశౌర్యసాహస స్ఫూర్తులనఁగ
రణమునం దెల్లఁ దామయై ప్రళయసమయ
చండమార్తాండమండలాఖండవిభులు
రంగరాయేంద్రవెంగళరాయవిభులు. 84

చ. అటువలెఁ బోరిపోరియమితాహితకంఠవిలుంఠనక్రియా
చటులభుజాశితాసియయి స్వర్గతవైరులవెన్నుముట్టియు
చొచ్చెటునకు గూల్ప నేగెనను చొప్పుననప్పుడు రంగరాయభూ
విటుఁడు సుదినంబుఁ జెందెఁ బృథివీతలముం బెడఁబాసి యయ్యనిన్. 85

క. ఆరంగరాయనృపమణి
నీరంధ్రయశస్కుఁడైన నీలాద్రిధరి

---

1. శత్రుసముదాయముల శిరస్సులు; దశకంఠుని శిరస్సులు.
2. గుఱ్ఱముల; సింధురాజు. 3. గొప్పబలముగల; సౌబలుని (శకుని.)

శ్రీరమణాగ్రామణికిల
నారయపుత్త్రుఁడుగాఁగ నలరొందెరహిన్. 86

క. ఇలనుపదునేడు వందల
నలువదినాలుగవసంఖ్యనడచెడుహాయనో
జ్వలశాకాబ్దమునందీ
చులఘుతరంబైన యుద్ధమయ్యెంగడిమిన్. 87

మ. మహిమద్రాజకులాబ్ధిచంద్రుఁడగు రామారాయరాజన్యుడీ
మ్మహితోద్యచ్చరితంబు దిట్టకవిశుంభద్వంశజోద్యద్గుణా
సహనారాయణసత్కవిశ్వరునిచే వర్ణింపఁగాఁ జేయుటన్
రహినింపొందగ సంగ్రహంబుగను నీగ్రంథంబునం జెప్పితిన్. 88

గీ. అప్పుడాత్మీయపుత్త్రుఁడై తనుప్ప
రంగరాయేంద్రుఁడట్లు [1]గీర్వాణ పురికిఁ
జనుటనాలించినీలాద్రి జనపసుండు
వ్యాకులతనొందెనాత్మ ననేకగతుల. 89

క. అకీర్తిఁగొంతదడవు వి
చారించిధరిత్రిలోన జననాథులకున్
వీరస్వర్గముగాంచుటె
భూరియశోహేతువనుచు బుద్ధిఁదలచుచున్. 90

1. స్వర్గమునకు.

క. శ్రీవెలయఁగనీఁ ద్రి
త్మావల్లభుఁడాత్మ రాజ్య సంరక్షణముం
గేవలధర్మాత్మకుఁడై
కావించుచునుండఁగొంత కాలంబరుగన్. 91

సీ. వితరణశౌర్యవిశ్రుతప్రాసపాటివం
శాంబోధిరాకాసుధాంశుఁడగుచు
నానందగజపతి యనెడునామంబుచేఁ
జెలఁగుమహారాజ శేఖరుండు
ప్రాజ్యమండలమునందుఁబ్రఖ్యాతిఁగాంచిన
నిజరాజధానిగూా విజయనగర
మనుపురంబుననుండి ఘన తేజమునఁబ్రెంచి
వారిసాహాయ్యంబు పరిఢవిల్ల
[1]ప్రాజ్యతరమైనపశ్చిమ రాజ్యమెల్ల
బలిమిఁగెలిచెడుతలఁపుచే బయలువెడలి
వాటమైయొప్పుచామర్ల కోటనగర
మునఁదనరుకోటఁదొలుదొల్త ముట్టడించె. 92

సీ. అప్పుడాదుర్గంబు హాలెండు వారిదౌ
సేనచేమిగుల రక్షింపఁబడుచుఁ

1. విక్కిలి గొప్ప.

దనరుచుండుటఁబట్టి తనకుస్వాధీనంబు
గాక యారాజన్యలోకవహాళి
ప్రాకటఖ్యాతిచేఁ బాటిల్లుచున్నట్టి
రాజమహేంద్రవరంబుకరిగి
కొంతకాలంబుపర్యంతమప్పురమందు
వసియించి యలబ్రోంచి వారితోడ
మరలమహనీయమైన చామరలకోట
పురికి నాకస్మికంబుగా నరుగుదెంచి
దుర్గమంబగుతత్పురదుర్గమందుఁ
గీలుకొల్పెనునాత్మీయ కేతనంబు. 93

సీ. అంతలోగోలకొండాధీశ్వరుండైన
[1]యవనేంద్రుఁడవ్వార్త నాలకించి
మహితతద్బంధుదుర్మరణకారణభూతు
లరయంగబ్రోంచివా రనియు మఱియు
నానందగజపతి తన్నాథచంద్రుండు
బొబ్బిలియుద్ధంబు మొదలుగాఁగఁ
బద్మనాయకవంశ భవులపై సహజవై
రముఁబూనెననియు డెందమున నెంచి

1. తురకరాజు (గోల్కొండ నవాబు).

శాసనముఁ బంపె వంగదేశంబునుండి
వచ్చుసరయరుకూటు నాఁ బఱఁగు [1]హూణ
వరుననెదురేగి తన్మైత్త్రిఁ బడయుమనుచు
రావునీలాద్రిరాణ్మహీ రమణమణికి. 94

గీ. యనవనవిభుశాసనంబు నయ్యవనివిభుఁడు
వేడ్కనీక్షించిచయ్యనఁ బెంటకోట
రేవున కనూనసైనిక శ్రేణితోడ
ఘనతవాటిల్లఁ జని యెదుర్కొనియె నతని. 95

మ. అపుడాహూణజనాధినాయకుని సాహాయ్యంబుప్రాపింపఁగఁ
ద్రిపువర్గంబులఁబారఁదోలి విపుల శ్రీధామచామర్లకో
టపురీభాసురదుర్గమండలము వేడ్కన్మైత్త్రివాటిల్లఁద
ద్విపులాంగ్లేయవరేణ్యసైన్యపటలాధీనంబు గావించుచున్. 96

క. అనుపమపీఠపురప్రా
క్తనదుర్గమునన్వసించి ఖ్యాతివహించెన్
ఘనుఁడగునీలాద్రిప్రభు
జననపుఁడాంగ్లేయముఖ్య సఖ్యస్ఫురణన్. 97

ఉ. సుందరకీర్తిపూర్తిఁగని శోభిలురావుకొలంపుసంద్రపుం
జందురుఁడైన యాధరణిజానికి హూణవరేంద్రుఁడర్మిలి

1. ఆంగ్లేయప్రభువు.

స్యందనపూర్వకంబుగను వ్రాసినపత్రికలొప్పుచుండె సం
క్రందనదివ్యపట్టణము కైవడి భాసిలుపీఠికాపురిన్. 98

ఉ. రాజితగోలకొండపుర రాజ్యరమామణిమనోహరుం
డై జిగినొందు [1]యావనజనాధిపుడెయ్యెడమెచ్చివానికిం
తే జగతింబ్రసిద్ధగతి నిచ్చినవజ్రపు తళ్కులొల్కునే
ల్ఫాజులకమ్మలిప్పటికి భాసిలుచుండెను పీఠికాపురిన్. 99

శా. శ్రీనాథుండగుశేషశైలనిలయశ్రీవేంకటాధీశ్వరుం
డానీలాద్రినృపాలమౌళి కలలో నాత్మాహ్వయంబుంచినన్
దానతౌత్రములన్ భవద్విపులసంతానంబువర్ధిల్లునం
చానదంబుననానతిచ్చెఁగరుణాయత్తైకచిత్తాబ్జుఁడై. 100

ఉ. ఆమనుజాధినాయకజనాగ్రణికిన్నతియైన జగ్గమాం
బామహిళావతంసము సమగ్రయశంబుచెలంగ నిమ్మహిన్
భీమవరంబుచెంతఁ దన పేరు దలిర్పసృజించెనొక్కస
ద్గ్రామ మనేకసస్యసము దగ్రఫలప్రకరోపయుక్తిగన్. 101

ఉ. ఆరమణీయదంపతుల కాత్మభవుల్ జనియించిరంచిత
శ్రీరమణీశపాదసరసీరుహనిత్యసమర్చనాపరుల్
ధీరజనాగ్రగణ్యులు సుధీవరగేయులుసుందరాకృతుల్
శూరహితప్రచారు లరిభీకరశౌర్యులునల్వురిమ్మహిన్. 102

---

1. తురకరాజు.

మ. పటుదోశ్శౌర్యకలాకలాపయుతులై వాటిల్లనానల్వురు
త్కట తేజం బెసగన్ బ్రసిద్ధిఁగ సిరీ ధాత్రీస్థలిం బెద్ద వెం
కటరాయాధిపుఁ డెజ్జ వేంకటమహీకాంతేంద్రుఁ డుంబుచ్చి వెం
కటరాణ్మౌళియు ముద్దువెంకటసమాఖ్యాఢ్యక్ష్మాతలేంద్రుండునాన్,

ఉ. ఆరయ నాటనుండియుఁ దదన్వయసంభవులై చెలంగు గో
త్రారమణాగ్రగణ్యులు దిరంబుగ వెంకటశబ్దపూర్వకో
దారసమాఖ్యలిమ్మహిని దాల్చుచునుండిరోగింగులక్రమా
చారవిధిన్సుధీజనులు సంతతమున్వొడనాడఁగాఁగదా. 104

సీ. తనకీర్తి సకలసజ్జనచిత్తకల్హార
మండలంబునకు రేయెండగాఁగఁ
దనప్రతాపంబు శాత్రవమహాహంకార
వారిరాశికి బాడబంబుగాఁగఁ
దనదర్శనము దీనజనచకోరకసికా
యములకుఁ జంద్రోదయంబుగాఁగఁ
దనకరాగ్రస్ఫురత్కరవాల మరిశైల
తతికెల్ల వజ్రాయుధంబుగాఁగఁ
బఱఁగు నీలాద్రివిభుఁడు ప్రపంచకంబు
ధరణిఁ బాలించి [1]గగన భూధరగిరీంచు

---

1. 1770.

సంఖ్యనలరొందుహేశాణవర్షంబునందు
సమరనగరీనివాససౌఖ్యంబునందె. 105

క. అలనీలాద్రినృపాలక
కులమాళి తనూజలఖిలకోవిదనుతులై
నలినాక్షునాల్గుభుజములు
వలెనానలుగురుధరిత్రిభాసిల్లి రొగిన్. 106

ఉ. వారలలోనభూరితరబాహుబలాహతవైరిభూమిభృ
ద్వీరపరేణ్యుఁడైనపెదవెంకటరాయనరేంద్రచంద్రుఁడి
ద్ధారుణిభారమాత్మభుజ దండమునన్ధరియించెనుర్విలో
నారయహేశాణవర్షము [1]నభోద్రినగక్షితిసంఖ్యనొప్పఁగన్. 107

శా. సత్యాగారము సత్వసద్మము శమాస్థానంబు ధర్మస్ఫ్పృహా
చైత్యం బార్యవిధేయతాగృహము సౌజన్యాలయం బంచి తౌ
చిత్యావాసముధైర్యమందిరముసౌశీల్యాకరం బం చిలన్
నిత్యంబున్ బెదవెంకటేశ్వరుని వర్ణించుంగవీంద్రౌఘముల్. 108

సీ. [2]హరిదంతదంతురవరయశుండైన యా
పెద్దవెంకటరాయవిభువరుండు
కృతయుగస్ఫూర్తినారేండ్లురాజ్యంబేలి
తనకును రెండవతమ్ముఁడైన

---

1. 1770. 2. ఎల్లదిక్కుల తుదను.

యెఱ్ఱవెంకటరాయపృథివీశ్వరునితోడ
రహిమించు రాజకార్యములు గొన్న
నెఱవేర్ప బందరుపురమున కేగుచోఁ
రాజ్యమహేంద్రపురంబునందు
రసను[1]రసగిరిశిఖరిసారసవిరోధి
సంఖ్యనింపొందునాంగ్లేయశకమునందు
నందనోద్యానవిహారణానందగరిమ
నొందెగీర్వాణబృంద మందందుఁగొలువ. 109

గీ. యెఱ్ఱవెంకటరాయమహీతలాధి
నాయకుండును బందరునగరమునకుఁ
జనెను నప్పుడె తన యగ్రజన్మ విడచి
యుండననుమాడ్కి నవ్విభుదండ కరిగె 110

క. ఆపెదవెంకటరాయ
క్ష్మాపాలకమౌళికొక్క సత్పుత్రుండు
ద్దీపితయశుఁడు కుమారమ
హీపతిరాయేంద్రుఁడనఁగ నెసఁగుచునుండెన్. 111

చ. అతఁడతిబాలుఁడౌట నపుడా మహనీయవసుంధరాభరం
బతులబలస్ఫురన్నిజభుజాగ్రమునందువహించె నంచిత

1. 1776.

ప్రతతపటీరహీరనికరప్రతిమానయశోధనార్జన
ప్రతిముఁడగుబుచ్చివెంకటనృపాలవరుండురువైభవోన్నతిన్. 112

సీ. శౌర్యకిరీటి సౌందర్యకందర్పుఁ డౌ
దార్య [1]నీరజబాంధవాత్మజుండు
సత్కళాభోజుండు సత్యహరిశ్చంద్రుఁ
డభిమానదుశ్శాసనాగ్రజుండు
సుజ్ఞానజనకుండు ప్రజ్ఞామరగురుండు
ప్రకటప్రతాపవైశ్వానరుండు
ధైర్యమంథాద్రిగాంభీర్యపాథోరాశి
ఘనతరప్రాభవాఖండలుండు
పృథుతరైశ్వర్యహైమవతీశ్వరుండు
నిరుపమానవచోధోరణీఫణీంద్రుఁ
డతులకారుణ్యవైకుంఠుఁడనఁగ మించె
బుచ్చివెంకటరాయాఖ్యభూవరుండు. 113

మ. చటులానేకవిధద్విషద్వసుమతీజానివ్రజానీకినీ
పటలోద్దండతమఃప్రకాండహరణప్రాభాతికాహస్కర
స్ఫుటశోభాకలితప్రతాపయుతుఁడై శోభిల్లునాబుచ్చివెం
కటరాయాగ్రణితోడ సాటిగలరాత్మానాథు లెందేనియున్. 114

---

1. కర్ణుఁడు.

క. అలనలనలకూబరులం
బలసూదనసూనుసూనబాణులమిగులన్
గెలువంగల బలు సోయగ
మలరారునుబుచ్చివెంకటాధీశునకున్. 115

సీ. ఆంగ్లేయశకవర్ష [1]మక్షిదంతావళ
గోత్రనీరేరుహా మిత్రసంఖ్య
క్షోణిపై వఱలుచో శ్లోభకృదబ్దము
నందు భాసిలు శ్రావణంబునందు
శని [2]ధనంబునగురుచంద్రులు [3]విక్రమా
స్థలి [4]విధుంతుదుడు షష్ఠంబునందు
బుధభార్గవులు [5]రాజ్యమున సూర్యకుజులు [6]లా
భమునందు కేతువు [7]వ్యయమునందు

లలితగతి నుండ వరతులాలగ్నమందు
సరసిజాక్షుండు కూర్మి నమ్మరునికరణి
బుచ్చివెంకటరాయాఖ్యభూవరుండు
గనియె నీలాద్రిరాయేంద్రుఁ డనుకుమారు. 116

గీ. ఖ్యాతిమీఱఁగబుచ్చివెంకటనృపాల
వరుఁడు పదివత్సరంబులు వసుధ నేలి

---

1. 1782. 2. రెండవచోటను. 3. మూఁడవచోటను. 4. రాహువు.
5. పదియవచోటను. 6. 11 వ చోటను. 7. 12 వ చోటను.

[1]రసకరిగిరీందుసంఖ్యచే నెసఁగు పాణ
వర్షమం దవ్యయానందపదవి నొందె. 117

చ. అతనికిఁ దమ్ముఁడైన సుగుణాకలితుండగు ముద్దువెంకట
క్షితివరుఁ డన్నతోఁ జలముచే నలరాజ్యములోని భాగము
న్నతితమ్ముఁ గోరిపోరినను సాఁగక తాఁ దుదకుం దదీయశా
శ్వతకృపచేత నే సకలసంపదలందుచు సౌఖ్యముంగనెన్. 118

మ. అహిరాట్పారదహారహీర [2]విబుధాహారస్ఫురత్కీర్తిసం
గ్రహణేచ్ఛాసహితాహితాంబురుహసూర్యాసూర్యభిస్తుత్యస
ద్బహుదాతృత్వఘనాఘనాఘనభుజాదండోగ్రశౌర్యోజ్జ్వల
న్మహితాటోపవిరోధిమండల విరామారామరాయాధిపా. 119

క. అక్షీణతీర్థసేవా
దీక్షైకపవిత్రగాత్ర దివ్యచరిత్రా
దక్షిణభుజాగ్రసంస్థిత
కౌక్షేయక నిహతనిఖిల ఖలరిపుగోత్రా. 120

భుజంగప్రయాతము.

ఫణాభృద్గణాధీశ భాస్వద్వచోధో
రణీతోషితాశేషరాజేంద్రచంద్రా
[3]ఘృణావాల విద్వత్పరిత్రాణశీలా
రణాభీల శ్రీరామరాడ్భూమిపాలా. 121

---

1. 1786. 2. అమృతము. 3. దయకుత్పత్తిస్థానమా.

## —: గ ద్య ము :—

ఇది శ్రీజానకీరమణ చరణారవింద నిష్యందమాన మకరందపానామందా
నంద మిళిందాయమాన మానస కౌండిన్యగోత్ర పవిత్రదేవులపల్లివంశ
సంభూత సీతారామ విద్వన్మణి పౌత్ర వేంకట కృష్ణశాస్త్రీంద్ర
పుత్ర సుబ్బరాయ సుధీవరసోదర విబుధజన విధేయ వేంకట
కృష్ణనామధేయ ప్రణీతంబైన రావువంశ ముక్తావళీ
ప్రబంధంబునందుఁ చతుర్థాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీరస్తు.

—:0:—

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# రావువంశముక్తావళి

పంచమాశ్వాసము.

శ్రీకర [1]దిగ్వనితాజన
తాకచకుచలికుచరుచిరతరవిచకిలపా
ళీకుంకుమరచనాంచ
త్ప్రాకటకీర్తిప్రతాప రామమహీపా. 1

వ. అవధరింపుము. 2

ఉ. ఆరయఁబుచ్చి వేంకటసమాహ్వయ భూవరమౌళి వెన్కను
ర్వీరమణీశిరోమణి వరించె నుదంచితబుద్ధి నబ్ధిగం
భీరుని మేరుధీరుఁ బెద వెంకటరాయనరేంద్రలోకజం
భారికుమారుఁడై చెలఁగునట్టి కుమారమహీపతీంద్రునిన్. 3

---

1. దిక్కాంతల కొప్పులందలి నల్లెపూలవలె తెల్లని కీర్తి, కుచములందలి కుంకుమ పుంబూఁతవలె ఎఱ్ఱని ప్రతాపము గలవాఁడా!

సీ. గురుసుధీవరజనగోష్ఠివిశేషంబు
నక్షాంతపుణ్యకథానురక్తి
పరమధర్మాధర్మపరిశీలనంబును
నిరుపమసత్క్రియాచరణదీక్ష
భూరితరాశేషభూపదయాళుత్వ
మకలంకభూదేవనికరభక్తి
ఘనదేవతాన్యూనకైంకర్యతాత్పర్య
మఖిల దీనజనావనాభిరతియుఁ
గలిగిచెలువొందు భువనవిఖ్యాతవిభవ
కలితరావుకులాంభోధి కమలవైరి
పెద్దవెంకటరాయపృథ్వీతలాధి
నాయకకుమారమహీపతి రాయనృపతి. 4

చ. సుమహితభక్తియుక్తిమదిశోభిలమాధవదేవదేవుగే
హముననునిత్యభోగములు నర్చనలుత్సవతోత్సవంబునిం
పమరనొనర్చి [1]దివ్యతలమానటుజేసి చెలంగెశ్రీకుమా
రమహీపతీంద్రచంద్రుఁడు ధరావరమాత్రుఁడెయెంచిచూడఁగన్. 5

ఉ. శ్రీరుచిమించుమాధవుని చెంగటఁదత్సతిచూడుకుద్ద్నాం
చారుప్రతిష్ఠచేసివిలసత్కనకోజ్జ్వలరత్నమండలీ

---

1. పన్నిద్దరాళ్వారులుండుచోటు.

చారువిభూషణావళులొసంగె సుధీజనవర్ణనీయవి
స్ఫారగుణాఢ్యుఁడైన మహిపత్యధినాధవరేణ్యుఁడర్మిలిన్. 6

గీ. ప్రాకటాఖండవైభవాపహసితామ
రేంద్రుఁడైన కుమారమహీపతీంద్రు
వర్యుఁడర్పించె నవఖండవాడ యనెడు
గ్రామమును గుంతిమాధవస్వామికెలమి. 7

క. మఱియుంగురుతరశోభా
కరసాలగ్రామమాలికాముఖ్యమనో
హారభూషణంబు లమ్మహి
వరుఁడొసఁగెను గుంతిమాధవస్వామి కొగిన్. 8

మ. విలసద్దేవుల పల్లివంశభవుఁడౌ విఖ్యాతపాండిత్యసం
కలితాత్ముండగుబాపనార్యమణిచే క్ష్మామండలింగీర్తివ
ర్ధిలఁ[1]దారావళిసత్కృతింగని పఖర్దీన్పాలెమ గ్రామమం
దలఘుక్షేత్రమొసంగె నమ్మహిపతీంద్రాగ్రేసరుండర్మిలిన్. 9

చ. సమధికభక్తిఁ[2]గట్టడలసంఖ్యముగా సతతంబువైష్ణవో
త్తములకుసంఘటించి వసుధావిబుధావళికెల్లఁబెక్కుమా
న్యములు దిరంబుగానొసఁగినట్టి కుమారమహీపతిక్షమా
రమణునికీర్తిభాసిలు నిరంతరముల్ హరిదంతరంబులన్. 10

---

1. 27 పద్యములుగలది. 2. ఏర్పాటుచేసిన ప్రకారముగనిచ్చు సన్నము మొదలయిన పదార్థములు.

చ. వరయశుఁడౌ కుమారమహిపత్యధినాయకమౌళి రాజ్యముం
బరువడి నేలుచోఁ ధరణిభాగమునం గడునైదువర్షము
ల్గఱవుమహాభయంకరముగాఁ బొడచూపఁగ నాతఁ డయ్యెడం
గరుణదలిర్ప నెల్లరను గాచె ననేకవిధంబు లేర్పడన్. 11

గీ. అట్టులైదేండ్లు నాత్మ రాజ్యంబునందుఁ
బంటలేకున్నఁ గడుసొమ్ము వ్యయమొనర్చి
ప్రజలఁ గాపాడెఁ గానసర్కారుపైక
మింతు కేసియు నతఁడు చెల్లింపకుండె. 12

క. ఆరీతి నతఁడు[1] పేష్కషు
నారూఢిగ నొసఁగకునికి నధికారులు ద
త్కారణముఁ దెలియఁ జేయుట
కైరమ్మని పత్రికన్ రయంబునఁ బంపన్. 13

సీ. మహిపతి రాయేంద్రమణి దానిఁ గనుఁగొని
తనకు రెండవపినతండ్రియైన
బుచ్చివెంకటరాయభూమిపాలునకు నీ
క్షితిని స్యాలకుఁడైన చింతపట్ల
మాధవాధిపునితో మఱియు నావంచివెం
కటరాయమంత్రిశేఖరుని తోడ

1. జమీందారులు ప్రభుత్వమున కిచ్చుపన్ను.

బందరుపురి కేగుపట్టునమార్గమం
దచటి కేగిన నమర్యాద తనకుఁ
గలుగుననిసంశయించిభృత్యులకు నెల్లఁ
దెలియరాకుండమన్నెఁపుదెరువుఁబూని
ఘనులుభూలోకవైకుంఠమనుచుఁ దేని
నభినుతియొనర్తురట్టిభద్రాద్రికరిగె. 14

సీ. ఆలోనగోలకొండాధీశ్వరునియాజ్ఞ
బందరుపురికినివచ్చియున్న
[1]వ్యావహారికునకునమ్మహీపతిరావు
రాజ్యమందైదువర్షములవఱకు
వర్షమేమియులేకబహుఘనక్షామంబు
పట్టిప్రాణులఁబీడఁ బెట్టుటయును
గట్టిగాఁబ్రజనట్టి కఱవునఁ జేపట్టి
పోషించుటయుఁ దెల్ల ముగను దెలిసి
యిటకుఁబూర్వము సర్కారు కివ్వవలయు
పైకమివ్వంగ నక్కఱలేక యుండ
సెలవొసఁగి పూర్వగతి రాజ్య మెలమి నేలు
మనుచుఁ బత్రికనంపించి రతనికపుడు. 15

---

1. రాజకార్యములను నడపించునుద్యోగి.

మ. ఘనరీతిందగుసట్టిపట్టికనొగిం గైకొంచుభాస్వద్యశో
ధనుఁడౌదామెరవంశజుం డయిన సీతారామనామప్రభుం
డనఘాత్మండగు హంసరాలకులజుం డౌపద్మరాజాహ్వయుం
డును గౌతూహలముప్పతిల్లఁగను దోడ్తోవేగనే తేరఁగన్. 16

సీ. అంతనవ్వృత్తాంత మంతయుఁ జింతప
ల్లాన్వయుండగు మాధవాధిపతికిఁ
దొలుతఁదెల్లంబుగాఁ దెలిసియుండియు నుర్విఁ
దనకు మేనల్లుఁడై తనరుచున్న
నీలాద్రిభూమిజానికి నధికారంబు
గలిగినచోఁదన తలఁపులెల్ల
ఫలియించునంచు నవ్వార్తలెల్లఁ గుమార
మహిపతిరాణ్మౌళి కహితబుద్ధిఁ
దెలియకుండంగఁగడు ద్రోహములనొనర్ప
[1]నగ్నినిధిగిరివిధుల హాయనాబ్ద మలరు
నపుడు భద్రాద్రి నతఁడు దేహంబువిడచి
నిరుపమానందగరిమచే నివ్వటిల్లె. 17

శా. ఆలీలన్మహిపత్యధీశుఁడు విరుం డావాసముం జెందఁగ
న్లీలం బిమ్మటఁదత్పితృవ్యసుతుఁడౌ నీలాద్రిరాయావనీ

1. 1793.

పాలాగ్రేసరుఁ డొయ్యనన్నిజభుజాభాగంబునన్బూనెన
[1]క్ష్మాలి బ్రహ్మగిరీందులం దనరు నాంగ్లేయాబ్దమం దిమ్మహీన్. 18

గీ. సకల జనభేదరహిత [2]ప్రసాద సహితుఁ
డతుల [3]బలశాలి [4]శ్రీసుభద్రాన్వితుండు
పృథులతరప [5]రేంద్రద్యుమ్నవిఖ్యాతిపరుఁడు
నగుచు నలరొందె రావు [6]నీలాద్రివిభుఁడు. 19

సీ. కుటిలవర్తన మొప్పఁ జటులవిస్ఫూర్తి
నెసఁగుభుజంగేంద్రు నీసడించి
కదలనేరక గొప్ప గండంబులను గూడి
మెలఁగెడు కులశైలములను దూఱి
బలుముస్తలను మేయు పంకసంకులమైన
యాదివరాహంబు నపహసించి
మదమొప్ప నెప్పుడు మధుపాశ్రయంబులై
జెలఁగెడు దిగ్గజంబులను గేరి
ధరణి తరుణి వరించె నాదరణ మెసఁగ
గురుతరాటోపు రావుసత్కులకలాపు
భోగదేవేంద్రు సత్కళాపూర్ణచంద్రు
రమ్యగుణపాళి నీలాద్రిరాయమౌళి. 20

---

1: 1793. 2. అనుగ్రహము; అన్నము మొదలయినవి గల ప్రసాదము. 3. శక్తిగలవాఁడు, బలరామునితోనొప్పువాఁడు. 4. శుభములతోను, సుభద్రా దేవితోను. 5. ఇంద్రసమాన—, ఇంద్రద్యుమ్నమనుకొలను. 6. నీలాద్రిరాజు, జగన్నాథదేవుఁడు.

సీ. [1]సుకృతియై కవిలబ్ధ [2]సుకృతియై కృతదుష్ట
[3]నికృతియై నిర్మల[4]ప్రకృతి యగుచు
శాంతుఁడై భోగనిశాంతుఁడై ఘనమహీ
కాంతుఁడై కారుణ్యవంతుఁ డగుచు
మహితుఁడై పరనీతిసహితుఁడై [5]యవలేప
రహితుఁడై రక్షితస్వహితుఁ డగుచు
శీలియై బహుభోగశాలియై శాత్రవో
న్మూలియై తేజోంశుమాలి యగుచు
నవనితలమందు నలరొందె ననుపమాన
ఘనఘనాఘనకల్ప కావనిజకల్ప
దానశౌర్యాదివిలసద్యశోనిదాన
రమ్యగుణపాళి నీలాద్రిరాయమౌళి. 21

సీ. కుటిలత్వ మింతుల కుంతలంబులయంద
చాపల్య మబలలచూపులంద
కఠినత సతులబల్లబ్బిగుబ్బలయంద
లేమి లేమల మధ్యసీమలంద
కసువిణ్ణవీఁగుట పడఁతుల జడలంద
జడత పూఁబోఁడుల నడకలంద

1. కవి. 2. ప్రబంధము. 3. వంచన. 4. స్వభావము. 5. గర్వముతేనివాఁడు.

మిగుల నెల్లఁదనంబు మగువల నగవంద
తనుభావ మతివలతనువులంద

గాని యెచ్చటముచ్చట కైనగాని
గానరాకుండఁ బ్రాకటాఖండవిభవ
మలరనాత్మీయరాజ్యమండలము నేలె
రమ్యగుణపాళి నీలాద్రిరాయమాళి. 22

సీ. తన యనుగ్రహమహాఘనశక్తి బంధుశే
ఖరులవసుంధరావరులఁ జేయఁ
దన రసజ్ఞతహృద్యతరశాస్త్రవిద్విప్ర
జనుల నైశ్వర్యభాజనులఁ జేయఁ
దన నిరంతరసుహృద్భావమాశ్రితమిత్ర
మణులను[1]వసుమదగ్రణులఁ జేయ
తన పరాక్రమలీలతతశౌర్యవంతులఁ
గాందిశీకులఁ జేసి ప్రోలుచుండ

సకలజగదేకమాన్యరాజన్యసభల
నవనిపై సార్వభౌమవిఖ్యాతిఁ గాంచి
చెలఁగె రావువంశాంభోధిశీతకరుఁడు
రమ్యగుణపాళి నీలాద్రిరాయమాళి. 23

---

1. ధనముగలవారిలో మొదటివారిని.

సీ. ఒక వేళ వర్ష మించుక లేక వఱదరా
కునికి కర్షకు లెల్ల మనవి సేయ
నీటికై వేలుపు టేటితో సాటిగాఁ
గాటిల్లునట్టి యేలేటి దరికి
[1]హాళి మీఱంగ నాందోళికారూఢుఁడై
యెలమి చేవాహ్యాళి కేగునంత
పృథుతరంబై నతద్విత రణస్ఫురణాతి
శయమున కోడినసరణి నెపుడు
నెదురుగా నేగుదెంచి వారిదము లెపని
రాజ్యమం దెల్ల సస్యము ల్రలహి నెసంగు
రీతి వర్షించు నతని వర్ణింపఁ దరమె
రమ్యగుణపాళి నీలాద్రిరాయమౌళి. 24

సీ. జయజయ విపుల[2]విశ్రాణనలసమాస
[3]గాయగోవాళాంక గీయమాన
జయజయ జితవిద్విషత్కాండప్రతిగండ
భైరవబిరుదవిభాసమాన
జయజయ తేచర్ల సద్గోత్రజలధిపూ
ర్ణశశాంక ఖడ్గనారాయణాంక

1. ఆసక్తి. 2. దానము. 3. గాయగోవాళబిరుదము చే.

జయజయనీలాద్రిజనపాలకరవాల
భైరవ బిరుదవిభ్రాజమాన
జయజయిాభవభూరివిస్ఫారఘోర
సంగరాభంగరాయవేశ్యాభుజంగ
బిరుదయనివందిబృందంబువినుతిసేయు
రమ్యగుణపాళి నీలాద్రిరాయమాళి. 25

క. హితమతినానీలాద్రి
క్షితిపతియినుగంటిచిన్న[1]చిన్నయధరణీ
శితృమణికిఁ సుతయగుస
న్నుతగుణగణరమణమాంబఁదొలుతవరించెఁ. 26

క. తనయులుజనియింపమిన
మ్మనుజేంద్రుఁడుగొనియెఁదనదుమఱఁదలిసుతుఁడై
ఘనగతిచిత్రాడపురిఁ
దనరెడునిజరావుకులజు దత్తుఁడుగాఁగన్. 27

క. మఱికొంతకాలమునకా
మరపురికబ్బాలుఁడేగమరలనతని సో
దరుఁడైన బుచ్చితమ్మయ
ధరణీంద్రునిస్వీకరించెదత్తుఁడుగాఁగన్. 28

1. చిన్నారాయప్రభుశ్రేష్ఠునకు.

గీ. జగతినంబుపై నిగొన్ని వత్సరములరుగ
వరునితోఁడుతఘనమనస్స్పర్ధగలిగి
రమణమాంబానధూమణిరహినిదనకుఁ
బుట్టినిల్లైనగోరస పురికినరిగె. 29

గీ. పిదపనీలాద్రిరాయభూవిభుఁడుమరల
నలఘుచెలికానికులకలశాబ్ధిచంద్రుఁ
డగుచుఁజెలువొందురామరాయాధినాధు
పట్టియైనట్టిభావయాంబనువరించె. 30

క. ఆలేమయందుముందుగ
నీలాద్రివిభుండు బడసెనిరవద్యసుధీ
జాలావనశీలాన్విత
యాలక్ష్మీవెంకయాంబయ నెడు కుమారిన్. 31

చ. కుశలవులన్ గకుత్స్థకుల కుంజరుఁడుంబలెఁగూర్మినాదటన్
బ్రశమితవైరివీరులఁగుమారులనిద్వరనుర్విలోన న
వ్విశదయశస్కులైనపృథివీపతిగాంచె[1]సుధీంద్రకోటికి
న్వశులగుసూర్యరాయనరపాలకుమారమహీవతీంద్రులన్. 32

క. పట్టినదియెల్లపైఁడియు
ముట్టినయది యెల్లనాణిముత్తియమగుచు

---

1. గొప్పవిద్వాంసులసమూహమునకు.

న్నెట్టిన బహుభాగ్యముగను
పట్టఁగ నీలాద్రివిభుఁడు వసుధఁ జెలంగెన్. 33

మ. రమణీయాంచల దిగ్విభూజనకుచప్రాంతిస్ఫురద్భూరికుం
కుమపంకప్రతిమప్రతాపసముదగ్రుండైన నీలాద్రిరా
యమహీనాయకశేఖరుండు కరుణాస్వాంతంబుతో నొక్కస
త్రమునుంచె న్నిజరాజధానియగుచున్ రాజిల్లుపీఠాపురిన్. 34

చ. ఘనతరవక్కలంకకులకంధిసుధాకరుఁడైన పెద్దపి
రసకవిచేతమాధవనృపాగ్రణిము న్నొసరింపఁ జేసిన
ట్టి నిజకులావళీకృతి ఘటింపఁగఁ జేసెను వెంకి చిన్నపి
రసకవిచేతనక్కొదువరమ్యతరంబుగ నవ్విభుం డొగిన్. 35

చ. ఇతఁ డతిబుద్ధిమంతుఁ డగు నీతఁడు కేవలబుద్ధిహీనుఁ డౌ
నితఁ డురుభాగ్యశాలియగు నీతఁడు సంతతభాగ్యహీనుఁ డౌ
నితఁ డకలంకచిత్తుఁ డగు నీతఁడు దుర్మతియౌ నటంచు సం
తతమువచించు నవ్విభుజనప్రవరుండు మొగంబుఁ గాంచుచున్. 36

గీ. న్యాయపరిశీలనైకలోలాత్ముఁడైన
రావునీలాద్రిరాణ్మహీరమణమౌళి
జనులమనవులు వినగోరి యనుదినంబు
[1]హాళిమీరంగ నెలమివాహ్యాళి కేగు. 37

---

1. ఆసక్తి.

సీ. శ్రీకాశికాదిక క్షేత్రరాజములందు
సత్రంబులుంచె నే సద్యశుండు
స్వామికార్యక్రియాసక్తిఁ గృతజ్ఞుఁడై
విఖ్యాతిఁ గాంచె నే విభువరుండు
గురువిప్రదేవతా గురుతరభక్తి చే
నలరొందె నే వినిర్మలగుణుండు
గోరసపురమందు [1]గోపురచుంబిగో
పురముఁ గట్టించెనే వరచరిత్రుఁ
డట్టి కొత్తపల్లిగ్రామ మందునుండు
రావు వెంకటరాట్ప్రభుప్రవరుఁ డెవని
కరుణబహుభాగ్యభోగవిస్ఫురణనొందె
నతని వినుతింపఁ దరమె నీలాద్రివిభుని. 38

సీ. శ్రీమీారుకొవ్వూరుభీమనపల్లి జ
గ్గమపేటనగరంబు ఖండవల్లి
మునికొడవలి గొల్లప్రోలు కిర్లమపూడి
పటవలకోలంక ప్రక్కిలంక
యత్తిలిదొంతమూరన్న దేవరపేట
లను పేరుఁ గాంచి విఖ్యాతిమించు

1. స్వర్గమును (ఆకాశమును) దాఁకు (దేవాలయపు) దేవిడీని.

పదునాలుగుముత్తాలు [1]బహులక్షరూప్యఖం
డము లిచ్చి సంపాదనంబొనర్చి
బంధుభావానురాగానుబంధగరిమ
గలుగువారికి వానిలోఁ పలను గొన్ని
కరుణతోడ నొసంగి భూపతులఁ జేసె
రాజమాత్రుండె నీలాద్రిరాడ్విభుండు. 39

సీ. బుచ్చివెంకటరాయభూమీంద్రవరునకి
తనయుఁడౌ నీలాద్రిధరణినాథుఁ
డారీతి రాజ్యంబు లార్జించి వానిలో
పలకొన్ని కొండఱకెలమినొసఁగి
ప్రాకటాశేషభూపాలకాగ్రణులెల్ల
బృథివినింతటిమహాదృష్టవంతు
నింతటియౌదార్యవంతు నెందును గాన
మని కొనియాడ విఖ్యాతిఁగాంచి
చారులావణ్యవతు లైన సతులతోడ
సుగుణగుణముల నలరొందుసుతులతోడ
నతులగతి నొప్పు వైభవోన్నతులతోడ
నవని గల సౌఖ్యములనెల్ల ననుభవించె. 40

1. రూపాయలను.

సీ. అటువలెనఖిలరాజ్యంబుపాలించుచు
శ్రీనీలాద్రిరాయభూపాలమౌళి
మహనీయతరకరుణావారాధవామలపాద
సరసిజభజనాసక్తి సలిగి
తిరుమలవంశప్రదీప రామానుజ
దేశికవర్యోపదిష్టమైన
[1]సన్మంత్రరాజంబు జపమాచరించుచుం
బ్రకటితదీయతత్త్వంబెఱింగి
రథగజాశ్వభటాదిక ప్రాభవంబు
బుద్బుదప్రాయ మని డెందమునఁ దలంచి
భక్తిసుజ్ఞానవైరాగ్యపద్ధతులను
భూతలంబున మిగుల విఖ్యాతిఁ గాంచె. 41

శా. ఆ నీలాద్రివిభుండు సర్వజను లత్యంతంబు సంతోషముం
బూన న్మప్పదినాలుగేండ్లుకడిమి న్భూమండలంబేలి సు
జ్ఞానుండై [2]వసునేత్రవారణమహీసంఖ్యాకశాకాబ్ద మీ
క్షోణీభాగమునందనప్పునెడనత్యుద్రప్రభావోన్నతిన్. 42

క. అలసర్వజిదబ్దంబున
నిలఫాల్గుణశుద్ధమందు నేకాదశినాఁ

---

1. నారాయణాష్టాక్షరీ మంత్రము. 2. 1828.

డలఘువికుంఠపదస్థితి
నలరెను నీలాద్రిరాడ్ధరాధీశుఁడొగిన్. 43

సీ. [1]శరధిదృగ్వసునిశాకరులవశాణశకంబు
బఱఁగుచుండ స్వభానువత్సరమునఁ
జనుభాద్రపదమాసమునను [2]వలక్షప
క్షమున నేకాదశిజన్మమందు
గురుఁడువిక్రమమందు ధరణీజకేతువుల్
సౌమ్యార్కకవులుపంచమము నందు
నిందురాహులుభాగ్యమందర్కిన్వ్యయమందు
నలువొంద వృషభలగ్నంబునందు
వసుధ నీలాద్రిరాయభూపతికిఁదనయుఁ
డగుచు జనియించినట్టి సూర్యావనీంద్ర
వర్యుఁ డప్పటి కైదేండ్ల వయసు గలిగి
చిఱుతప్రాయంబుతోడ భాసిల్లుకతన. 44

గీ. అది మొదలు పీఠనగరరాజ్యమును ప్రోత్తి
పరగణాలను బదమూఁడు వత్సరముల
వఱకు కోర్టాఫువార్డుసువారిదైన
యనుపమానాధికారమం దలరుచుండె. 45

---

1. 1824. 2. శుక్లపక్షమున.

చ. అలపదమూఁడువత్సరము లవ్విభువర్యులచే నియుక్తులై
జెలఁగెడు వ్యావహారికులు చేసిన మేరకుమీఱుదుర్వ్యయం
బులఘునరాజ్యలబ్ధమగు భూరిధనంబునిరర్థకంబుగాఁ
బొలియుటె కాక చాలఋణపూర్తి వహించెను రాజ్యమయ్యెడన్.

క. కావున వెంకటసూర్యా
రావునకున్ యుక్తవయసు ప్రాపింపఁగ నే
కేవలరాజ్యపదోన్నతి
భావుకగతి నొసఁగరైరి పైయధికారుల్. 47

గీ. అపుడు గలిగిన రాజకార్యములనుండి
మించు తొందరలకు గొర్నమెంటువారి
వద్ద కోర్టాఫువార్డుసు వారుతొంబ
దెనిమిదియు వేలరూపికల్ ఋణముఁ గొనిరి. 48

ఉ. ప్రాంచితవైభవాఢ్యులగు వారికి మున్నల గొర్నమెంటువా
రెంచిరిఫండుగా నెలమి నిచ్చిన [1]షష్టిసహస్రసంఖ్యచే
మించెడు రౌప్యఖండములు మేలొనగూర్పఁదలంచి వేఱుగా
నుంచినచో ననూనగతి నొప్పు ఋణంబటుగల్గనేర్చునే. 49

క. అరయం దత్కారణమున
ధర నల రాజ్యాధికారధర్మము లెల్లన్

1. 60 వేల రూపాయలు.

మఱినాలుగేండ్ల వఱకుం
బఱఁగెను మేనేజుమెంటు పద్ధతిలోనన్. 50

గీ. అందుదొలియేఁట నే వసూలయినసొమ్ము
లక్షకెక్కుడు గలుగఁ దద్ద్రవిణమొసఁగి
ఋణముఁదీరిచి సూర్యరాణ్మణికి రాజ్య
పదవి నొసఁగమి నన్యాయమొదవె మిగుల. 51

గీ. అవనిలోనమంగామట్టి యనెడుపేరఁ
బ్రబలుహాశానేంద్రుఁ డుత్తరరాజ్యమందుఁ
బఱఁగు నలనాల్గుజిల్లాలపై కమీష
నరుగ నియ్యోడ కయ్యోడ నరుగుదెంచె. 52

మ. అవనీరక్షణదక్షుఁడై యలరు నయ్యాంగ్లేయవర్యుం[1]డ వా
ర్యవిభుత్వంబుదలిర్ప నిచ్చటికిఁ దానారీతి నేతెంచి మా
నవనాథాగ్రణులెన్నధర్మనిరతిం దత్ప్రాజ్యరాజ్యోదిత
వ్యవహారస్థితిపై పరీత్యముల నింపారన్ విమర్శించుచున్. 53

గీ. ఆర్యుఁడగు సూర్యవిభునిబాల్యమున నొసఁగ
వలసియున్నట్టి పేష్కుషుపైకమునకు
మిగులన్యాయంబుమీఱి రిమీషనివ్వ
వలయునని గౌర్నమెంటుకుఁ దెలియఁబఱిచె. 54

1. స్వతంత్రాధికారము.

సీ. ఆరీతినప్పుడాసామ్రాజ్యమాంగ్లేయపర్యంతు
ఘనమైన నీతిమార్గంబు దనరఁ
పలుతెఱంగులఁ జేట పఱచియుండెనుగాని
మిగులదానికి గౌర్నమెంటువారి
లంగీకరింపమి నాసూర్యరాయేంద్రుఁ
డలఘుణంబెల్లను దొలఁగునటుల
నభినవంబగురాజ్య మం దాఱుపరగణా
లెలమి తద్వంశములో మెలఁగఁజేసి
[1]వనధివారాశివారణవారిజారి
సంఖ్య నలరొందు శోభనవర్షంబునందుఁ
ప్రథితపీఠపురప్రాజ్యరాజ్యమునకుఁ
జెలువుమీఱంగఁబట్టాభిషిక్తుఁ డయ్యె. 55

సీ. నిమ్నోన్నతంబుగా నెగడునీరసమైన
వసుధను పృథుచక్రవర్తి మున్ను
ధేనువుఁగావించి దానిచే ఫలసిద్ధి
వడసిలోకములఁగాపాడినట్లు
వ్యవహారసంజాతవైపరీత్యములచే
నాకులంబైన రాజ్యంబు నెల్ల

1. 1844.

నిగుపమానన్యాయపరిశీలనప్రౌఢిఁ
బొలుపొందఁజక్కఁగాఁబొందుపఱిచి
ప్రకటగతినొప్పుసకలసంపదలనొంది
ప్రజలనెల్లను సుతులకైవడినిబ్రోచె
రాజమాత్రుండె నీలాద్రిరాణ్మహీంద్ర
తనయుఁడగు సూర్యరాయభూతలవిభుండు. 56

మహాస్రగ్ధర.

తతగాఢాస్తంభశుంభత్ప్రచురతరసిశిత
త్వత్స్ఫుర [1]న్మండలాగ్రా
హతసర్వారాతిధారుణ్యధిపతివితతీ
ఖ్యాతశాతాత్మభిధాసం
భృతిసూర్యుండైయుదారాకృతిధృతిమతిగాఁ
ధీర్యుఁడాసూర్యరాయ
క్షితిపాలోత్తంసమొప్పెన్ శిశిరకరశర
చ్ఛ్రీయశస్స్ఫూర్తిమీఱన్. 57

సీ. సంతత [2]సన్మార్గ సంచారశీలుండు
సాధు [3]చక్రావనాసక్తహృదయుఁ
డనుపమాన [4]ప్రతాపాక్రాంతహరిదంతుఁ
డసదృశవసుమండలాకరుండు

1. కత్తిచేతను. 2. మంచిమార్గము, ఆకాశము.
3. సమూహాయుము, చక్రవాకముల. 4. ప్రతాపము. వేఁడి.

ఘన[1]పంకజాతవర్ధనధుర్యచర్యుండు
[2]బుధజనవర్ణితాభ్యుదయశాలి
గురుతరసకలసద్గుణ[3]ధర్మజనకుండు
ప్రాకటాఖిలలోకబాంధవుండు
నగుచు సార్థకనామధేయంబుగలిగి
జగతినలరొందె నసమానసత్యశాలి
వినుతవనమాలి, రిపుజనవిపినకీలి
సాంద్రగుణపాళి సూర్యరాయేంద్రమౌళి. 58

సీ. అశ్రాంతకువలయాహ్లాదసంపాదకుం
డతులకలాకలాపాభిరాముఁ
డఖిలబుధానందకామందవసుబృందుఁ
డనుపమానప్రసాదాస్పదుండు
లలితశోభాకరలక్షణలక్షితుఁ
డహితచక్రమహాభయంకరుండు
భువనవిశ్రుతసత్ప్రభుత్వసంపన్నుండు
ఘనపదవిహరణాకలితమతియుఁ

గావునను రావుసత్కులకలశజలధి
పూర్ణచంద్రుఁడనంగ నిబ్భువినెసంగె

1. పాపసముదయము, తామరపూల. 2. విద్వాంసుల, దేవతల.
3. పుణ్యకర్మలకు పుట్టినిల్లు; యమునకు తండ్రి. 4. భూవలయము, కలువల.

మహితహితజనహృదయతామరసహేళి
సాంద్రగుణపాళి సూర్యరాయేంద్రమౌళి. 59

సీ. [1]ఆర్యానుకూలసత్కార్యుఁడై ధర్మని
ర్మధనుండుగాని సర్వజ్ఞమూర్తి
లలితలక్ష్మీసముల్లాసియై ఘన[2]పుణ్య
జనశాసనుఁడుగాని [3]చక్రపాణి
పటుతరరిపుబలధ్వంసియై మహిత[4]గో
త్రవిరోధిగాని [5]బుధప్రభుండు
సంపూర్ణసత్కళాశాలియై జడతరా
కృతిగాని కువలయాధీశ్వరుండు
సకలజనజీవనప్రదప్రకటశక్తి
కలితుఁడై చంచలాత్ముండుగాని ఘనుఁడు
నితఁడెసుమ్మని జనులెన్న నిలఁజెలంగె
సాంద్రగుణపాళి సూర్యరాయేంద్రమౌళి. 60

సీ. తన ఘనవ్యవహారదార్ఢ్యంబునీతిశా
స్త్రముల కెల్లను నిదర్శనముగాఁగఁ
దన రాజ్యపాలనౌద్ధతి పూర్వభూవర్య
చర్యకు దృష్టాంతసరణిగాఁగఁ

---

1. పూజ్యులకు; పార్వతికి. 2. పుణ్యముగలవారిని, రాక్షసులను.
3. చక్రములవంటి రేఖలుగల హస్తముగలవాఁడు; విష్ణువు. 4. కుల, పర్వతము.
5. విద్వాంసులకురాజు, ఇంద్రుఁడు.

దన నిరంతరధనార్జనపరాయణత ని
శ్చలధర్మమార్గసూచకముగాఁగఁ
దన పాంసురాఖండతరకీర్తిసత్కావి
ప్రాకటస్తోత్రపాత్రంబుగాఁగ

నవనినలరొందె ననుపమౌదార్యశౌర్య
ధైర్యగాంభీర్యవిబుధభక్తిం కర్యకార్య
ధుర్యతార్యావనైకతాత్పర్యముఖ్య
సాంద్రగుణపాళి సూర్యరాయేంద్రమౌళి. 61

ఉ. దాన[1]నిదాన మార్యజనతావినుతాయతనీతిమార్గసం
స్థాన మనూనమానవనిధిసంశ్రితజాలకపాలనైక దీ
క్షానిలయంబు సత్వగుణసద్మమునై చెలువొందుసూర్యరా
ణ్మానవనాథు నెన్నదరమా ధరమూదృశమానవాళికిన్. 62

చ. బుధులకునింటికల్పకము భూరియశంబునకాటపట్టు శ్రీ
యుధితనయాధినాయకపదాంబుజభక్తికిఁ బుట్టినిల్లునై
ప్రథితవిహాయితప్రముఖభవ్యతరాఖిలసద్గుణౌఘ[2]సే
నధియగు సూర్యరాయనరపాలకమౌళి చెలంగె నిమ్మహిన్. 63

మ. క్షితిశాంతత్వము రామచంద్రదయ సుగ్రీవాజ్ఞయు న్మేరుధీ
రత మద్రాగ్రహమున్ మృగాధిపతిశౌర్యంబున్ హరిశ్చంద్రసూ.

---

1. కారణము. 2. నివాసస్థానము.

స్మృతి మాంగీరసబుద్ధి సూర్యసుతదాతృత్వంబు జైత్రోద్భవా
కృతియు న్సూర్యనృపాలకాగ్రణికి నుర్వింగల్గెనూహింపఁగన్. 64

సీ. తళుకువెన్నెలనిగ్గులొలుకు తెల్లనిడాలు
        దంబైన వెండిదండంబు గలిగి
తళతళగల [1]విధూపలసర్మితంబులై
        దనరారునూఱుబెత్తముల నలరి
ధగధగ్యప్రభాతతుల నెల్లెడ నీను
        కలితమౌ వజ్రాలకలశ నలరి
హురుమంజి పరులజాలసు చుట్టు నలరారు
        జిలుగుమేల్మహతాబువలువఁదనరి
సూర్యుఁడౌటను [2]మిత్రతఁజూపవచ్చి
నట్టిరాకాసుధాకరుండ నఁగనొప్పె
[3]రాజరాజేంద్రవినుతవిరాజమాన
విభవుఁ డగు సూర్యరాయేంద్రు వెల్లగొడుగు. 65

సీ. అభ్రంలిహాశిఖాగ్ర విభ్రాజమానచ
        క్రసదేశరాజిత గరుడకేతు
నహినాయకశిరస్సహస్రభారప్రద
        చటులనేమిస్ఫురచ్చక్రషట్క—

---

1. చంద్రకాంతశిలలచే.        2. మైత్రిని, సూర్యభావమును.

3. కుబేరునిచేతను, ఇంద్రునిచేతను స్తుతింపఁబడిన సంపదగలవాఁడు అనియు నర్థము.

[1]మభితః ప్రలంబిదీపాకరదర్పణ
పేటికాకోటికావిలసితంబు
ఘటితఘంటాజాలఘణఘణక్వణనసం
భరితచతుర్భాగభాసురంబు
నగుచు నలరారు దివ్యశతాంగ మమిత
భక్తిఁ జేయించి మాధవస్వామి కెలమి
నర్పణ మొనర్చినట్టి సూర్యావనీంద్రు
నిరుపమగుణానుభూతి వర్ణింపఁదరమె. 66

సీ. తన సమంజసమంజుతర సౌకుమార్యంబు
సకలప్రజాసేచనకము గాఁగఁ
దన దివ్యసాత్త్వికౌదార్యాదిగుణరీతి
ధరణిసురాహ్లాదకరము గాఁగఁ
దన మహనీయసంతతవైభవస్ఫూర్తి
వరబుధవర్ణనాస్పదము గాఁగఁ
దన సద్యశస్సముత్కరకాంతికలనంబు
నిరతదిగంత [2]దంతురము గాఁగ
నలరునట్టి నిజానుజుం డగు కుమార
మహిపతీంద్రుని కమితసంపదలు గలిగి

---

1. అన్నిప్రక్కలను. 2. వ్యాపించినది.

చెలఁగుకోలంక యను మురా నెలమి నొసఁగె
రాజరాజేంద్రుఁ డగు సూర్యరాడ్విభుండు. 67

ఉ. శ్రీధరసన్నిభుం డనఁబ్రసిద్ధివహించినసూర్యరాయగో
త్రాధిపలోకశేఖరుఁడుదగ్రకుతూహలుఁడై వరించె సం
భోధితసూజ్ఞకై వడిని బొల్పువహించెడు చింతపట్లగం
గాధరరామరాడ్విభుని కన్యకయై తగు వెంకయాంబికన్. 68

క. ఆరీతింబరిణయమై
కోరికతోఁదోలుత నతులగుణనీలాద్రి
క్ష్మారమణుఁ డను కుమారుని
మారునిహారికరణి సూర్యమహీపతిగాంచెన్. 69

క. లలితయశోవిశదితది
గ్వలయుం డగు సూర్యరాయవసుధాధీశుం
డిలపై నప్పిదపన్ముద
మలరంగనె భావయాంబ యనెడు కుమారిన్. 70

క. మఱియునొకకొంతకాలము
వఱకుం దన కవనిలోన వరతనుజన్మల్
బరువడి జన్మింపమి న
ద్ధరణీశ్వరుఁడుల్లమందుఁ దల్లడపడుచున్. 71

చ. బహువిధదానధర్మము లపారముగాధరణీసురాళికి
న్మహితసమస్తసద్గుణసమన్వితుఁడై చెలువొందుసూర్యరా

ణ్మహితరశేఖరుండు బలువమాయి నొసంగెను వెండియు న్మహా
మహుఁడగు పుత్రునొక్కని సమగ్రయశోనిధి నొందఁగోరుచున్.

క. ఆరీతి నొసంగి మహా
దారామల భక్తి నఖిల దైవతములఁ దా
నారాధించుచు మఱియుం
గూరిమితోఁ దనదుగోర్కె కొనసాఁగుటకున్. 73

మ. అనఘాత్ముం డగు సూర్యరాయజనపాలాగ్రేసరుం డెంతయు
సనతుల్యానసి దేవ..కసముపాస్యుండైన రామానుజుం
బు నజస్రంబుఁ బఠించుచు న్భువనసేవ్యుండైన యారాఘవేం
ద్రుని సద్భక్తిని గొల్వ భక్తపరతంత్రుండా తఁడే గానుసన్. 74

సీ. శ్రీమించు [1]కరసింధుసింధురకుముదబాం
ధవుల వాణశకంబు నడచునపుడు
బఱఁగెడు శోభకృద్వర్ష పౌషవలక్ష
పక్షచతుర్ధిందు వాసరమున
భ్రాతృగేహంబున వాహనస్థలమందు
పంచమంబున భాగ్య పదమునందు
నిన సౌమ్య రాహువుల్ శని శుక్రు లవనీజ
తుహినాంశుగురులు కేతువును దనర

1. 1842.

ఘనతులాలగ్నశతభిషక్తార యందు
దశరథునిఁ బోలు సూర్యరాడ్ధరణిపతికిఁ
బుత్రుఁ డగుచును శ్రీరామమూర్తి ధాత్రి
యందు భవదాకృతిని వేడ్క నవతరించె. 75

గీ. మఱియు నా సూర్యరాయభూవరుఁడు గనియె
నగణి తౌదార్యశౌర్యాదిసుగుణగణస
నాథులగు సూర్యనారాయణప్రకాశ
రాయరాజేంద్ర వేంకటరాయనృపుల. 76

క. ఆ నలుగురిసూనులతో
నా నరనాయకుఁడు దశరథాధిపుకరణిన్.
నానావిధవైభవముల
నానందము నొందుచుండె నసదృశలీలన్. 77

చ. [1]క్రముకరసాలకామలకగంధఫలీపనసామ్ల[2]లాంగలీ
ప్రముఖసుసాలజాలములఁ బాటిలు నొక్కవనంబు నర్మహ
ర్మ్యమును జలాశయంబు నమలాశయుఁడై తగుసూర్యరాట్ప్రభూ
త్తముఁడు బ్రతిష్ఠఁజేసెను ముదంబునఁ బీఠపురాంతికస్థలిన్. 78

గీ. ఆర్యనుతచర్యుఁడైన యా సూర్యరాయ
వసుమతీంద్రుండు జేగురు పాటిచెంత

---

1. పోఁక. 2. కొబ్బరి.

ధరణి[1]నాత్మీయనామాంకితప్రసిద్ధ
ఘనతరగ్రామనిర్మాణ కలనఁ దనరె. 79

సీ. సకలప్రజానురంజనవిధానప్రౌఢి
నాశ్రితపాలనాయతనిగూఢి
వ్యవహారపరిశీలనాఖండతరశక్తి
న్యాయార్థసంపాదనానురక్తి
నిఖిలధర్మాధర్మ నిర్ణయైక పరీక్ష
సముచితవితరణాచరణదీక్ష
గురుతరాశేషసద్గుణవైభవోన్నతి
నఖిలభూపాలసఖ్యాభిరతిని

జెలఁగు మీతోడ సాటిరాగలరె యితర
భూవరు లటంచు గౌర్నరు మొదలుగాఁగ
నలరు హూణాధిపతు లెల్ల నభినుతింప
నవనిఁబాలించె సూర్యరాయప్రభుండు. 80

మ. అలరుక్మాంగదరంతిదేవశిబిముఖ్యంతాంబరీషోర్వీభృ
న్నలకాకుత్థ్సపురూరవస్సగరమాంధాత్రాదులైనట్టి ని
ర్మలసత్కీర్తి సమేతులై చెలఁగు పూర్వక్ష్మాతలాధీశులుం
బలెనేలెన్ భువి సూర్యరాయధరణీ పాలుండు సామాన్యుఁడే. 81

1. తన పేరను గుఱుతింపఁబడినది గనుక నే ప్రసిద్ధిపొందినది, పెద్దది—.

చ. మునుపటిశిస్తుకంటెఁ బరిపూర్ణతరవ్యవహారశక్తిచేఁ
బనివడి రాజ్యమండలము పైనొక లక్షధనంబమర్చి చ
య్యనఋణమెల్లఁ దీర్చి ఘనహాధనమొయ్యన నాల్గు లక్షలా
ర్జనమొనరించె సూర్యనృప సత్తముఁడుత్తమధర్మ పద్ధతిన్. 82

చ. క్రమమున హూణరాట్కులశిఖామణులాత్మఋణంబు దీరిన
న్సమధికసాత్త్వికాదిసుగుణస్ఫురణుం డగు సూర్యరాణ్మహీ
రమణజనాగ్రగణ్యునకుఁ గ్రమ్మఱఁ దొల్తటి నిర్ణయప్రకా
రమున వినూతనంబయిన రాజ్య మధీనమొనర్ప కుండినన్. 83

ఉ. దాని కనేకయత్నము లుదారయశోధనుఁడైన సూర్యరా
ణ్మానవనాయకాగ్రణి యొనర్చుచునుండె నసూననీతిమా
ర్గానుగుణప్రచారు లగు హూణజనాధిపతుల్విమర్శన
జ్ఞానధురీణు లౌటను వెసన్ లభియించునటంచు నెంచుచున్. 84

క. సరువాల్టరు యిల్యెట్దొర
సరులెన్న స్పెషల్కమీషనరుగా నిటకుం
బరువడి నయ్యవసరమున
నరుదెంచె నఖండవైభవాఖండలుఁడై. 85

సీ. నలుమారు [1]నలుమారు నిలమీఱుబలుసౌరు
దనరారు ననుగుసోదరుని తోడ

---

1. నలుని, మారుని.

స్ఫుటతరభ్రమరసమ్ముఖకంజమంజుల
ద్యుతినొప్పుగారాబు సుతులతోడ
ధైర్యగాంభీర్యచాతుర్య సౌందర్యముల్
గల ముఖ్యబంధువర్గంబుతోడ
పరమండలోద్దండ భటకాండ హృతిశౌండ
తరు లైన బహుయోధవరులతోడ

నిరుపమానూనవిభవంబు నివ్వటిల్ల
విమలయశుండైన యాహూణ విభుని కపుడు
సరగునను ధర్మవర మను పురముదాఁక
నెదురుగానేగె సూర్యరాయేంద్ర మౌళి. 86

శా. ఆ రీతిన్ జని వానిదర్శనము నెయ్యంబొప్పఁగావించి పెం
పారం గౌరవసూచకంబు లగు నర్మైకృత్యముల్ సల్పుచున్
రారాజద్గుణశాలియై తనరు సూర్యారాయరాణ్మౌళి[1] వి
స్ఫారోదారవచఃప్రసంగములచే సంతుష్టునింజేసినన్. 87

ఉ. అప్పరమోపకారపరుఁడై చెలు వొందెడు హూణరాడ్వరుం
డొప్పగ రాజ్యపాలనముఖోచితకృత్యము లెల్లజయ్యనం
జెప్పు మటన్న సంతసముఁ జెందుచు సూర్యవిభుండు వానికిం
దప్పక పూసగ్రుచ్చిన విధంబున నన్నియు విన్నవించినన్. 88

---

1. మిక్కిలిఅధికమైనట్టియు, ఔదార్యముగలవియు మాటలు సంభాషించుటచేత.

చ. వినికడు సంతసించి పృథివీవరశేఖర నీయదృష్టముం
ఘనతరవైభవంబు మతికౌశలముం వ్యవహారశక్తియుం
జనపరిపాలనంబును సుసంతతియుం సిరియుం గనుంగొనం
దనివిదొలంగకుండెను గదా యని హూణవిభుండుపల్కెనన్. 89

గీ. సూర్యరాయేంద్రుఁ డభినవాస్తోకరాజ్య
మురుతరన్యాయదృష్టిచే మరల మీరు
వాసిమీఱంగమాకు రాజేసిరేని
యన్నిటికి వన్నె పెట్టిన ట్లలరు ననిన. 90

ఉ. హూణజనాధినాథుఁడపు డవ్విభునిం గని యోసుధీంద్రసం
త్రాణధురీణ నేనిపుడు రాజమహేంద్రవరంబు కేగెదం
[1]రాణ చెలంగనచ్చటికి రమ్మరయమ్మన నీదుకోరికం
క్షోణిపతుల్మతింప నొనగూర్తు నటంచు వచించి వీడ్కొనెం.91

గీ. పిదప నా సూర్యరాయపృథ్వీతలేంద్ర
వరుఁడు శ్రీపీఠికాపురి కరుగుదెంచి
రహిని రాజమహేంద్రవరప్రసిద్ధ
పట్టణంబున కేగంగ బయలువెడలి. 92

క. చనుచుండ నల్లచెఱువనఁ
దనరెడుగ్రామంబునందు దైవవశమునం

1. ప్రేమను.

దనువునఁ గడు నస్వాస్థ్యము
బెనఁగొనఁజనుదెంచె మరలఁ బీఠాపురికిన్. 93

క. అటువలెఁ బురి కరుదెంచుచుఁ
బటుతర రథగజతురంగభటజనవనితా
పటలాదినిఖిలరాజ్యో
త్కటసంపద లేవగించి కడునిశ్చలుఁడై. 94

ఉ. మానితకుంతిమాధవసమంజసపాదసరోరుహద్వయ
ధ్యానపరాయణుండగుచు నంచితతద్ఘననామసంచయా
నూనసుధారసంబుమది నొయ్యనఁ గ్రోలుచుఁ దన్మయత్వని
ష్ఠానియతాత్ముఁడై పరమ సమ్మదవృత్తి వహించె నయ్యెడన్. 95

సీ. ఆరీతిహరిపదాంభోరుహధ్యానైక
నిష్ఠాగరిష్ఠతనివ్వటిల్ల
రావువంశాంభోధి రాకాసుధాంశుఁడౌ
నీలాద్రిరాయభూపాలమౌళి
కగ్రతనూజుఁడై యలరు సూర్యారాయ
పృథివీతలాధిపాగ్రేసరుండు
వాణశకాబ్ది మిా యవనిపై [1]గగనమా
ర్గణవారణాంబుజాతాతిసంఖ్య

1. 1850 (మార్గణ=బాణ).

నలరుచుండంగ సాధారణాభిధాన
వత్సరంబున కార్తిక బహుళమందు
నవమిదినమున వైకుంఠ నగర మునకు
నరిగె నల సూర్యుఁడస్తాద్రి కరిగినట్లు. 96

చ. అతనియనుంగుతమ్ముఁ డలరారె వసంతజయంత సుందరా
కృతి కృతిజాలవర్ణిత సమిద్ధగుణాకరుఁ డార్యలోకస
మ్మతవిమలప్రచారుఁడు కుమారమహీపతిరాడ్విభూత్తముం
డతులితసద్యశోవిశదితాఖిలదిగ్వలయాంతరాళుఁడై. 97

సీ. పండుతమ్ములపాకువలె నొప్పు చాయచే
వలనొప్పు రమ్యరూపంబు వాఁడు
రూపానురూపమై రూఢికెక్కి చెలంగు
ప్రవిమలహృదయసారసమువాఁడు
హృదయానుకూలమై యెసఁగు మిక్కుటమైన
ఘనతరసుగుణసంఘంబువాఁడు
సుగుణానుగుణమై విశుద్ధరీతిఖ్యాతిఁ
దనరారు సత్పవిత్రవర్తనమువాఁడు
రాజమాత్రుండె యతఁడు శ్రీరావువంశ
లసదనుపమాన[1]ముక్తాఫలాయమాన

1. ముత్యమువలెనగుచున్న సుందరుఁడు.

రమ్యతరమూర్తి నీలాద్రిరాయనృపతి
సుతుఁడగు కుమారమహిపతిక్షితివరుండు. 98

క. మారసుకుమారులైన కు
మారులు జనియించి రా కుమారమహిపతి
కొమ్మరమణున కిరువురు సూ
ర్యారాయనృపాల ధర్మరాయేంద్రులనన్. 99

క. వారిరువురిలో నగ్రజుఁ
డారూఢవిలాసభాసి యగుచున్ శ్రీసూ
ర్యారాయమహీపాలుఁడు
శ్రీరమ్యవిభూతి మెఱయఁ జెలఁగుచునుండెన్. 100

సీ. ఎవని సోయగమున కెనగాక [1]శ్లోకారి
[2]బహుళకార్శ్యైక సంప్రాప్తిఁ గాంచె
నెవని దానమునకు నీడుఁ జెందక వారి
దంబులు [3]చంచలాత్మకములయ్యె
నెవని ధైర్యనిగూఢి కవనిసాదృశ్యంబుఁ
గనలేక శైలము ల్గదలకుండె
నెవనిప్రజ్ఞకనుసాటివహింపఁ జాలక
ఫణిరాజు [4]జిహ్మగత్వంబుఁ గాంచె

1. చంద్రుఁడు. 2. మిక్కిలి చిక్కుట; కృష్ణపక్షమునందు కృశతనొందుట.
3. నిలుకడలేనివి, మెఱుములయందుమననుగలగి. 4. వంకగనడకను-బుద్ధిమాంద్యము.

నతనిఁ గొనియాడఁదగు సమస్తావనీంద్ర
చంద్రసన్మాననార్హ్వానిస్తంద్ర నిఖిల
గర్వరాహిత్య సాహసికత్వముఖ్య
పృథులగుణపాళి సూర్యరాయేంద్ర మౌళి. 101

క. అతని సహోదరుఁ డతులిత
మతియగు శ్రీధర్మరాయమహిపతి చెలఁగెన్
హితరక్షాహితశిక్షా
వ్రతదీక్షాచరణతత్పరస్వాంతుండై. 102

మ. మృదుపూర్వస్మిత భాషణుండు ధరణీబృందారకాధారకుం
డుదయత్కీర్తిధురంధరుండు సుగుణవ్యాహప్రకాశశ్రియా
స్పదుఁ డైశ్వర్యపురందరుండు వినయప్రాగల్భ్యచర్యుండు దీ
నదయాళుం డగు ధర్మరాయ ధరణీనాథుండు సామాన్యుఁడే. 103

ఉ. శ్రీవరశంకరాంఘ్రియుగసేవన పావనశీలుఁ డన్యకాం
తావిముఖుండు పండితజన ప్రియకారి వివేకశాలి స
ద్భావుఁడు ధర్మరాయనరపాలశిఖామణి రాజమాత్రుఁడే
కేవలధర్మమూర్తి యనఁ గీర్తివహించి చెలంగె నిమ్మహిన్. 104

క. అల [1]బలబలరిపుసూత్యతి
బలబలుఁ డగు సూర్యరాయవసుధేంద్రుని యా

1. బలభద్ర, అర్జున, వాయువు—.

నలువురు తనయులు నిలపై
నలరారుచునుండి రప్పు డతిబాల్యదశన్. 105

క. వెండియు నప్పీఠపురా
ఖండధరామండలాధికారం బపుడు
ద్దండతహూణేంద్రులు గను
చుండిరి కడు శిశుత వార లొప్పుట కతనన్. 106

గీ. భూరిసాభ్రాత్రగతినొప్పు వారిలోన
నగ్రసహజన్ముఁడైన నీలాద్రిరాయ
వసుమతీంద్రుండు పదమూఁడు వత్సరముల
వయసుపాటిల్లనయ్యెడ వఱలుచుండె. 107

మ. శ్రితవర్గం బమరద్రుమం బనుచు [1]నక్షీణద్విషద్రాడ్భట
ప్రతతుల్ [2]సూర్యసుతుండటంచు సుకవివ్రాతంబు భోజావనీ
పతియంచుం దరుణు ల్మనోజుఁ డనుచున్ భావింప నింపొందె నా
యతశౌర్యుండగు సూర్యరాడ్విభుని నీలాద్రిప్రభుండిమ్మహిన్.108

సీ. శ్రీసూర్యరాయధాత్రీతలాధీశ్వరో
త్తమునకు మూఁడవతనయుఁడగుచుఁ
బెఱుశక్తినలరారు వెంకటసూర్యనారాయ
ణప్రకాశావనీనాథవరాళి

1. కృశింపని (బలిసిన) శత్రురాజుల భటులు. 2. యముఁడు, సూర్యరాయసుతుఁడు.

పృథుల బొబ్బిలిపురాధీశుఁడౌ రంగరా
        డ్ధరణీంద్రమౌళికి దత్తుఁ డగుచు
సర్వసర్వంసహాఖర్వనిర్వక్రసం
        పదలచేఁ బొదలు దత్ప్రాజ్యరాజ్య
మనుపమన్యాయలీలఁ బాలన మొనర్చి
నాల్గులక్షల రౌప్యఖండముల వఱకు
నార్జనం బాచరించి విఖ్యాతి మీఱ
నవని నలరొందెఁ బూర్వపార్థివుల కరణి. 109

క. నిరవద్యసద్యశస్సుం
దరుఁడగు సూర్యేంద్రమణికి నాల్గవ సుతుఁడై
బఱఁగెడు వెంకటరాడ్భూ
వరుఁ డసదృశలీల నవని పైనలరొందెన్. 110

సీ. ఏ రాజచంద్రుండు మృదుతర సంగీత
        పరిపూర్ణరసికతా పరివృతాత్ముఁ
డే సత్ప్రభూత్తముం [1]డిందిరాసుందరీ
        రమణసేవాసక్త విమలహృదయుఁ
డే ధారుణీతలాధీశ్వరుం డాశ్రిత
        వ్రాతసంత్రాణవిఖ్యాతచర్యు

1. విష్ణు—.

డే మానవేంద్రుం డహీనసాత్వికముఖ్య
వరగుణరత్నవిభ్రాజమానుఁ
డతఁడు నృపమాత్రుఁడే మహోదారహార
[1]హీర[2]హీరాబ్జహారపాటీర[3]సార
వారణాహారనీహారశారదాభ్ర
రమ్యయశుఁడైన వేంకటరాడ్విభుండు. 111

ఉ. కేవలసత్కృపాకరుఁ డకించనపోషణతత్పరుండు సం
భావితబంధుసత్తముఁ డపారయశోలసమానుఁ డగ్రజా
జ్ఞావశవర్తనుం డనుచు సత్కవులెన్నఁగ సూర్యరాయపృ
థ్వీవరసూనుఁడై చెలఁగు వెంకటరాడ్విభుఁడొప్పె నిమ్మహిన్.

క. లాటీకరహాటీకర
హాటకహీరోర్మికాయితౌజస్కీర్తి
ఘోటీయానకళాపరి
పాటీ[4]నలసకులపాటవప్రస్ఫూర్తీ. 113

శా. శశ్వత్పూజితకాశికానగరవాస్తవ్యాన్నపూర్ణాంబికా
విశ్వేశాదిసమస్తదైవతకృపావిఖ్యాతలోకోత్తరా
హైశ్వర్యస్ఫురణాతిరేకమహితవ్యాపారపారంగత
త్వాశ్వశ్రేయసరామరాయధరణీంద్రా రావువంశాగ్రణీ. 114

---

1. వజ్రము. 2. శివుడు. 3. దేవతలఏనుగు, అమృతము, 4. నలుని,నకులుని.

స్రగ్విణీవృత్తము.

రాజతుల్యద్యుతీ రమ్యకీర్తిస్థితీ
రాజమానాకృతీ ప్రాకటార్యాదృతీ
భోజరాట్సాహితీ బుద్ధివాచస్పతీ
రాజభోగోన్నతీ రామరాడ్భూపతీ. 115

## గద్యము

ఇది శ్రీజానకీరమణ చరణారవింద నిష్యందమాన మరందపానానుబంధానంద మిళిందాయమాన మానస కౌండిన్యగోత్ర పవిత్రదేవులపల్లివంశ సంభూత సీతారామ విద్వన్మణి పౌత్ర వేంకట కృష్ణశాస్త్రీంద్ర పుత్ర సుబ్బరాయ సుధీవరసోదర విబుధజన విధేయ వేంకట కృష్ణశాస్త్రి నామధేయ ప్రణీతంబైన రావువంశ ముక్తావళీ ప్రబంధంబునందుఁ పంచమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీరస్తు.

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# రావువంశముక్తావళి

## షష్ఠాశ్వాసము.

శ్రీరంగశాయిసేవా
 పారంగత పరమభాగవతవర్య మహో
 దారతరాచారవిధా
 ధారగుణారామరాయ ధరణీరమణా. 1

వ. అవధరింపుము. 2

క. ఆవెంకటరాయేంద్రుఁడు
 తావకసేవానుభావతత్పరమతియై
 [1]ధీవైశద్యము హృద్యము
 గా విద్యాభ్యసనకౌతుకంబువఁదనరెన్. 3

---

1. బుద్ధియొక్కనిర్మలత్వము.

చ. అటువలెమీరుమీసహజుఁడై తగు వెంకటరాడ్విభుండు ను
త్కటగతివిద్య లన్నియు నఖండమనీషల నభ్యసించుచున్
బటుమతిఁ గాకినాడయను పట్టనమందున హూణనాయక
స్ఫుటపరిపాలనావిధిని శోభిలుచుండఁగఁగొన్నినాండ్లకున్. 4

సీ. పృథులదానయాత్రి వెల్లంకివంశర
త్నాకరరాకాసుధాకరుండు
వరిపంథిగర్వపర్వతకులిశాయితా
తతవిక్రమోత్థప్రతాపశాలి
యవనహూణాధీశ్వరాధికారద్వయీ
స్థితరాజ్యధూర్వహాయతభుజుండు
ప్రకటసామంతభూపాలగార్హస్థ్యవై
భవదానసముదితప్రథితయశుఁడు

నగు జగన్నాథరాయేంద్రు నాత్మజాత
మహితశుభలక్షణోపేత మంగయాంబ
ననుపమాఖిలగుణకదంబను వరించి
తీవు గోరికఁ బట్టంపు దేవిగాఁగ. 5

సీ. [1]కరరసవసుసుధాకరహూణశకవర్ష
మునజనేవరు నెల మోదగరిమ
మీఱగవర్నమెంట్ వారలాజ్ఞాపింప
లలి నప్పుడిచటి కలక్టరగుచు

1. 1862.

వెలయునార్థరు పరువీసుయిన్ క్వోయిరు
దొరవారుపీఠికాపురసమగ్ర
రాజ్యలక్ష్మీసమర్థన నైపుణీపరి
స్ఫురణంబునకు నలంకరణమైన
నయసుప్రాపించుటను భవద్బాహుశిఖరి
మున ధరాభారమును నిల్పజనమనఃప్ర
హర్షమప్పటినుండి యుత్కర్షమొందె
ననఘగుణసాంద్ర రామరాయావనీంద్ర. 6

క. మీరలుహూణప్రభువుల
చే రాజ్యపదాధికృతిని జేకొని సుభటా°
దారగజాదులతో నెం
తే రహి నిజనగరికరుగుదెంచినపిదప౯. 7

సీ. ఘనతరగుచ్ఛసంకలితరంభాస్తంభ
రమణీయ[1]కాయమానములతోడ
మహితముక్తాచూర్ణమయ[2]రంగవల్లికా
సలలితద్వారదేశములతోడ
సదములమణిజాలచారుతోరణరాజి
రాజితరాజమార్గములతోడ
ననుపమానూననూతనకేతనవ్రాత
కమనీయసౌధయూధములతోడ

1. పందిళ్లు. 2. ముగ్గులు.

[1]పటహకాహళిభేరికా ప్రముఖ నిఖిల
హృద్యతరభూరిమంగళవాద్యనివహ
రావపూరితగోపురప్రతతి తోడ
నగరమెల్ల నలంకృతం బగుచునుండ. 8

సీ. ప్రబలాధికారంబు బఱఁగు దేశాధిపుల్
ఘనులైన బాంధవ క్ష్మాతలేంద్రు
లసమాన పాండిత్య మలరు భూమీసురుల్
స్తుతమతు లౌ పురోహితులు హితులు
ప్రచురకీర్తి నెసంగు సచివులు సద్భటు
లామోదులైన జనులెల్లఁ బొదలుచుండ
నవరత్నసింహాసనమునందుఁ బ్రమదంబు
సొంపొంద మిమ్ముఁ గూర్చుండఁ జేసి
లలితకాంచనకలశంబులను జెలంగు
గంధజలముల సకల భూకాంతవరులు
నెలమి నభిషేక మొనరింపరే సమస్త
మహితగుణసాంద్రరామ రాణ్మహిపతీంద్ర. 9

గీ. అతుల దుందుభినామహాయనము నందుఁ
జైత్రశుద్ధత్రయోదశి జనములెల్ల

1. డప్పులు, దండుబూరలు...

వేడ్కవిలసిల్ల సామ్రాజ్యవిభవ మొంద
వే ముదంబున రామరాయేంద్ర చంద్ర. 10

ఉ. అంతటినుండి [1]సర్వహరిదంతముల న్మహనీయ విస్ఫుర
త్కాంతి నెసంగు సద్యశము గ్రమ్మకకుత్థ్సమరుత్పురూరవ
శ్శాంతనుముఖ్య భూపతుల చందమున న్మహి నేలుచుంటి వౌ
సంతతసజ్జనావనవిశారద రామనృపాలకాగ్రణీ. 11

మ. మహనీయోన్నతి మీఱ మీర లవనిం బాలించుచో సంశ్రితు
ల్బహుభాగ్యాన్వితులైరి బంధుజనము ల్మత్తేభఘోటీభటో
ద్వహసంపన్నతఁ గాంచి రార్యవరు లుద్యద్వైభవోపేతులై
రహహా మీ సుచరిత్ర మెన్నఁగను శక్యం బౌనె రామాధిపా. 12

మ. ధర మీ రొక్కొక భూసురోత్తమున కుద్యద్భక్తి నర్పించు భా
సురసుక్షేత్రఘనాగ్రహారముల విస్ఫూర్జన్మహామందిరాం
బరభూషాదుల విన్నమాత్రముననే స్వాంతంబులం దెంతయు
న్వెఱఁగుం జెందరె యెట్టి దాతలయినన్ శ్రీరామ రాయాధిపా. 13

ఉ. కొందఱి కశ్వరత్నములఁ గొందఱకున్ మదవారణంబులం
గొందఱి కర్థజాలములఁ గొందఱకున్ మహనీయభూములం
గొందఱి కుజ్జ్వలాభరణ కోటులనిచ్చుచుఁ బ్రోచుచుంటి వీ
వందఱఁ బద్మనాయకుల నాయతసత్కృపరామరాణ్మణీ. 14

1. ఎల్లదిక్కులకొనలందు (సకలదేశములందు).

సీ. శివకేశవాంఘ్రిరాజీవసద్భక్తిచే
సర్వజ్ఞమాధవక్ష్మాకళత్రు
లనుపమానపరాక్రమాతిశయంబుచే
రంగరాయతెనుంగురాణ్మహేశు
లురువైభవంబునఁ బెంపొందఁజేసెడుశక్తి
నీలాద్రిరాయభూపాలచంద్రుఁ
డక్షీణరాజ్యసంరక్షణైకనిరూఢి
సూర్యరాయాహ్వయక్షోణివిభుఁడు
సాటిఁగాంతురు కొంతమీతోటి భువిని
పృథులసత్కీర్తినొసఁగు దాతృత్వమహిమ
మీకు మీరలె [1]దొరలు సుమీ సుమేరు
ధీర శ్రీరామరాయ పృథ్వీతలేంద్ర. 15

ఉ. అమరధేనుదుగ్ధములు నభ్రమహీజమరందబంధువుల్
దామరసారిహీరసముదారచషంబుననుంచి మీఁచుచిం
తామణిచేఁ గలంచి ప్రమదంబున నుగ్గిడిరేమొ గానిచో
నీ మహనీయదానగుణ మెట్లు లభించును రామభూవరా. 16

మ. సతతంబుజ్జగదేకవిశ్రుతయశస్సంపూర్ణసంపత్తివ
ర్ణితులౌ భోజనరేంద్రముఖ్య నృపతుల్మీకంటె సారజ్ఞులౌ

1. సమానులు.

స్థితివిభ్రాజితులా మరెవ్వరసఁ ద్వాద్రీతిన్ గవివ్రాతస
మ్మతదానవ్రతదీక్షితాత్ములుదలంపన్ రామరాయాధిపా. 17

శా. ఉర్వి న్వేలకొలంది రాజమణులుం బ్రోద్యద్ధన ప్రాకటా
ఖర్వశ్రీకరవైభవాఢ్యులును గల్గంగల్గ నీవార లీ
సర్వోత్కృష్టవితర్ణిసంజనితభాస్వత్కీర్తి దిఙ్మండలిం
బర్వన్ మీవలెఁ గాంతురే సుగుణధామా రామరాయాధిపా. 18

ఉ. దానగుణాభిరాము లగు ధన్యులలోఁ బ్రబలుండ పుత్తమ
జ్ఞానులలో వరేణ్యుఁడవు సంతతసర్వపవిత్రతీర్థయా
త్రానఘచర్యులై తగు మహాత్ములలోన మహాఘనుండ వే
రీ నిమఁ బోలు భూమిపతు లిమ్మహిలోపల రామరాన్మణీ. 19

మ. అతిదానస్తుతిపాత్రులై తగుదు రీ యాంధ్రావనీమండల
క్షితినాథోత్తములందు రాపుకులజుల్ శ్రేష్ఠు ల్మఱి న్వారిలో
నతులస్ఫూర్తి దలిర్ప కర్ణశిబి ముఖ్యత్యాగులుం బోలె నా
యతకీర్తిం గను చుంటి వార్యనుత చర్యా రామరాయాధిపా. 20

మ. వినుమీ స్తోత్రము గాదు నాదు పలుకు ల్విశ్వంబులో నీ సముల్
ఘను లేరీ మహనీయచర్యుఁడవు విజ్ఞానప్రధానుండ వా
ర్యనికాయస్తుతదానధుర్యుఁడవు విద్యాభోజభూజాని వ
[1]మ్మనుమార్గజ్ఞుఁడవుం గదా మదిదలంపన్ రామరాయాధిపా. 21

1. మను వేర్పఱిచిన రాజనీతి నెఱింగినవాఁడవు.

మ. భవదాసేతుహిమాచలాంతరతలప్రాక్ప్రత్యగద్ర్యంతర
స్థవనీయోత్తమశైలకాననసరిద్గ్రామాది [1]దివ్యస్థలీ
నివసద్దైవతసేవనాభిరతి నిర్నిద్రోరుయాత్రామహో
త్సవము న్నే వినఁగా నొకప్పుడు సముత్సాహంబునం గోరినన్. 22

మ. భవదుద్వేలకటాక్షపాత్రుఁడును భాస్వద్వింజమూర్యన్వయో
ద్భవుఁడౌ లక్ష్మణమూర్తిసూరియుమ భావత్కాంఘ్రి భృత్యుండునా
ర్యవిధేయుండు మదీయశిష్యుఁడగు వీరాస్వామియున్ దాము త
త్ప్రవిశేషమ్ములు తోడవచ్చికనుట స్వర్ణించిరీ రీతిగన్. 23

సీ. శ్రీమహారాజరాజితకీర్తివిస్ఫూర్తి
ఘనమహీమండలాఖండలుండు
దానవిధానసంతానభూమీజంబు
మార్తాండవిభుఁడునౌ మన విభుండు
రావు గంగాధర రామరాయక్షమా
నాయకుండిష్టార్థ దాయకములు
కల్మషలతి కోగ్రకౌక్షేయకములునౌ
ధరగల్గుతీర్థయాత్రల నొనర్ప
మనసు దైవాఙబాంధవా మాత్య భృత్య
బహువిధాశ్రిత జనకుటుంబముల వెంటఁ

1. పన్నిద్దఱాశ్వాసములున్నచోటు. 2. ఆ ప్రయాణ—.

దోడ్కొని సమగ్ర సన్నాహ దోహలముగ
నొక్కనాఁడు ప్రశస్తముహూర్తమునను. 24

క. కదలి శుభసూచకములై
యొదవు నిమిత్తములు గనుచు నుత్సాహముసం
బొదలుచును విప్రు లాశీ
ర్వదించుచు సుమాక్షతములు వైవఁగఁ దోలుతన్. 25

మ. గరుడాహార్య విహారిశౌరి నుపమాక న్వేడ్క శ్రీవెంకటే
శ్వరు దర్శించి సమంచితంబుగఁ దదావాసంబునన్ భూరిగో
పుర కైంకర్య మొనర్చి యచ్చట మహాభోగంబులో భోగము
ల్పరిసంధించెను రామరాడ్విభుఁడు సద్భక్తిప్రసక్తాత్ముఁడై. 26

చ. సరవిగనంత రామనృప చంద్రుఁడు సాంద్రమనఃప్రహర్షుఁడౌ
సరసలసంశ్రితుల్ గొలువఁ జయ్యన సింహనగంబు నందు వే
సరక సమస్తధారలను స్నానములాడ నృసింహమూర్తికిన్
సరసపటీరపంకపరిచర్చలనర్చలొనర్చె భక్తితోన్. 27

చ. అటఁజని కాంచెరామవసుధాధిపశేఖరుఁ [1]డాపగాధిరా
ట్తటగతపాదమూలము సుధామధురద్రవపూరనిర్ఝరీ
పటులహరీపయఃప్రసరపక్వఫలప్రకరప్రశస్తికో
త్కటసహకారముఖ్యవివిధద్రుమజాలము నీలశైలమున్. 28

1. సముద్రమునొద్దు నొందినతిప్పల మొదళ్లుగలదానిని.

సీ. ఎచ్చోట బలభద్రు డెనసిసుభద్రతో
నవసించె శ్రీజగన్నాథమూర్తి
ఎచ్చోటఁ గిల్బిషంబెడఁ బాపనోపునిం
ద్రద్యుమ్న సరసికా స్నానమహిమ
మెచ్చోటహరికి సంధించు న్యగ్రోధంబు
[1]కల్పాంతమునఁ దల్ప కల్పనంబు
ఎచ్చోటను బరిగ్రహింపఁగాఁ బడు బ్రసా
దముసర్వమత సమ్మతంబుగాఁగ

నెచటబందీకృతంబయి యేపుఁజూపు
టుడిగి యేకాదశీ వ్రతంబడగి యుండు
నట్టిపురుషోత్తమ క్షేత్ర మరసి యందు
నాత్మ పరివారములతోడ నధివసించి. 29

క. దారుమయమూర్తి కరుణో
దారుజగన్నాథు నవని దారుహరిన్ వం
దారుగృహ్ణ జిరతలమం
దారునృపాగ్రణి భజించెఁ దారుచిరగతిన్. 30

మ. హరిదర్శించి బహూపచారములచే నర్చించి భోగంబులం
బరమానందము తోఁ ఘటించె స్వజన వ్రాతంబులుం దాను భ

---

1. ప్రళయకాలమునందు.

క్తిరసంబొప్పఁ బ్రసాదముల్గొనుచు లక్ష్మీవల్ల భానుగ్రహ
స్థిరపాత్రంబగు రామరాయ విభుఁ డాప్తిం జెంది యా పిమ్మటన్.

మ. చనియెన్ సంశ్రిత సత్కుటుంబములతోఁ జంచన్మరుద్వ్యాహినీ
ఘనవీచీ వనబిందు బృందవహ నైక ప్రక్రియాధీరవృ
త్యని లాంకూర పరంపరావసరణ వ్యాపార నిర్ధూతజం
తునిరాఘాటకృతాంతితోగ్ర [1]వివిధైనోరాశికిం గాశికిన్. 32

సీ. ద్వాదశాదిత్యు లుద్ధతిఁజూపి యొక్కటఁ
గలసి మెండుగ నెండ గాయునాఁడు
సప్తమరుత్ప్రభంజనము లేకంబుగా
పెల్లుగాఁ జెలరేగి విసరునాఁడు
పుష్కలావర్తాభ్రములు మొక్కలంబుగాఁ
గూడి యాసారముల్గురియు నాఁడు
జలరాసు లేడును గలసి యొక్కుమ్మడి
మించిలోకము లాక్రమించు వాఁడు

కదలకే వారణాశి యక్కాల కంఠ
కరతలాగ్ర త్రిశూలభాగమున నిలిచి
శాశ్వతైశ్వర్య సంయుక్తి సంతరించు
నదియె కేవలకైవల్య పదవి గాదె. 33

---

1. పెక్కుతెఱఁగుల పాపముల.

క. అప్పురిని మృత్యు వంచితు
లప్పుడ నిప్పులకుఁ దావు లగుసట్టి కనుల్
చొప్పడఁగ నుగ్రులై జను
లొప్పుగ [1]మృత్యుంజయత్వమూనుదు రహహా. 34

సీ. కేవలాధ్యాత్మ విద్యావివేకియె కాని
పరమనికృష్ట పామరుఁడె కాని
సదమలాచారనిష్ఠాగరిష్ఠుఁడె కాని
[2]వ్రాత్యదూష్యప్రవర్తనుఁడె కాని
వరదానధర్మతత్పరశీలుఁడె కాని
లుబ్ధాతిలుబ్ధలోలువుఁడె కాని
సరభవాగ్ర్యబ్రాహ్మణశ్రేష్ఠుఁడే కాని
గర్హితాధమకీటకంబె కాని
తిరిగి తారకమంత్రోపదేశకుండు
గాకయుండఁ డకాశికాఖండపరశుఁ
డసుపరిత్యాగకాలంబు నందు నిఖిల
జంతుసంతానములకుఁ దాఁజెంత జేరి. 35

సీ. విశ్వనాయకలింగ వీక్షాసుకృతమెన్న
నన్నపూర్ణప్రసాద మభినుతింప

1. శివ సారూప్యము. 2. ఉపనయ నాదులు చేసికొననివాఁడు, నిందింపఁ దగిన నడవడిగలవాఁడు.

బిందుమాధవకృపా విభవంబునుతియింప
లోలార్కసామర్థ్య లీలమెచ్చ
డుంఠివిఘ్నాధిరాట్టు ప్రభావము వచింప
కాలభైరవు నధికార మెంచ
భాగరథీస్నాన ఫలమును గొనియాడ
మణికర్ణికాకుండ మహిమఁ జెప్ప
మఱియు బహుదేవతాతీర్థమండపములఁ
గలుగుమాహాత్మ్యగరిమంబు కలిమిఁ దెలసి
వర్ణనము సేఁయగా నెట్టి వారివశము
రామరాయేంద్రుఁ డట్టి క్షేత్రమున కరిగి. 36

సీ. గంగాతరంగిణీగర్భవీచికలలో
సపరివారముగ మజ్జన మొనర్చి
విశ్వనాయకుని సేవించి విశాలాక్షి
నన్నపూర్ణను భక్తి నభినుతించి
బిందుమాధవదేవు వినుతించి లోలార్కు
భజియించి భైరవుఁ బ్రస్తుతించి
డుంఠివిఘ్నేశు వేడుకతోడ భజియించి
మణికర్ణికాస్నాన మహిమఁ గాంచి
యుర్విఁదాను దరించి యన్యులఁ దరింపఁ
జేయవలెనను రీతి నాశ్రితులకెల్ల

దానధర్మంబులకుఁ జాలు ధనమొసంగి
గొన్నినాళ్లందు నివసించి యున్నవేళ. 37

ఉ. శ్రీవిభవాభిరాముఁడయి చెన్నగు హైదరుబాదు పాదుషా
హీవికి లాయఖౌసిరి ఘటించెడు నట్టి హుజూర్దివానుసా
లావరుజంగుసాహెబు మరావుబహాదరమీరుతోడ దో
స్తీ వెలయన్ [1]మిలాఖతు రచించెను రామవిభుం డుదారుఁడై. 38

మ. మఱియుం గాసివసించు పండితులకున్ మర్యాద పొల్పారఁ గొం
దఱకుం బట్టుదుకూలజాలముల రత్నస్వర్ణ భూషాళిఁ గొం
దఱకు న్నాట బదార్లఁ గొందఱకు మోదంబొప్ప వెయ్యార్లుగొం
దఱకున్ రామవిభుండొసర్చెను మహౌదార్యంబున న్సత్క్రియల్;

శా. నిత్యానందరసాను భూతిగరిమోన్నిద్రాత్ములన్ సంగరా
హిత్యప్రక్రములం బ్రశాంతుల దయాహృత్పద్ములం దాంతులన్
యత్యగ్రేసరులన్ మహామహుల సంఖ్యాతీతులన్ శాటికా
ద్యత్యుత్కృష్ట సమర్చలం దనిపె రామాధీశుఁ డక్కాశిలోన్. 40

మ. శ్రితసంయుక్తిగ రామరాయధరణీ భృన్మౌళి యాపిమ్మటం
బితృసంతృప్తి నొనర్పఁగాఁ జని గయం బిండప్రదానాదిస
త్కృతులం జేసెను విష్ణుపాదమున సంప్రీతాశయుండై యహా
కృతకృత్యుండన నిమ్మహామహుఁ డొకం డే కా మహీమండలిన్.

1. కలిసికొనుట.

మ. విమలస్వాంతముతోఁ బ్రయాగమునకు న్విచ్చేసి యచ్చోటన
య్యమునాజహ్నుసుతాసరస్వతులు గాఢాలింగనస్ఫూర్తిస
ఖ్యమునంబొల్చెడుచక్కిసంతసముఁ జేయం దానముల్ చేసి దా
నములంజేసెను రామరాయ ధరణీంద్ర స్వామి యెన్నేనియున్. 42

క. మధురాపురి కరిగెను రా
మధరాధిపమౌళి శ్రితసమాజము తోడన్
[1]మధురాక్షసారిపద [2]ల
క్ష్మధురాస్పద పావనక్షమామండలికిన్. 43

మా లి ని.

శ్రితయుతుఁడగుచు న్విచ్చేసి వీక్షించెరామ
క్షితిపతిమణిదా శ్రీ కృష్ణపాదాబ్జ రేఖాం
కితపరమ పవిత్ర క్షేత్రకోటీలలామం
గుతుకము మతి మీఱం గోకుల స్థానసీమన్. 44

క. బృందావని కేగెను గో
విందపదన్యాసపదపవిత్రతగరజః
బృందావని కుర్వీశ్వర
బృందారకమౌళి శ్రిత పరీవృతుఁడగుచున్. 45

మ. క్షితివిఖ్యాతుఁడు రామరాయనృపతిశ్రేణీ శిరోరత్నమా
శ్రితసంఘంబులు గొల్వఁగాఁ జని కురుక్షేత్రంబునం భూరివ

1. మధుడను రాక్షసుఁడు. 2. గుఱుతు భారము.

స్త్రతిలతుల్మా గృహకన్యకాముఖమహాదానంబులం భక్తి...
యుతచిత్తుండయి చేసె విప్రులకు విధ్యుక్త ప్రకారంబులన్. 46

మ. అతిపుణ్యుండగు రామరాయ ధరణీంద్రాగ్రగణ్యుండా పిమ్మటన్
శ్రితసంయుక్తిగఁగాంచెఁగాంచనమణిశ్రేణీసమంచన్మహో
న్నత శోభావృతసౌధజాతమును [1]శ్రద్ధాదూతికాచాతురీ
కృతముక్తి ప్రమదార్థితైర్థిక సుసంకేతంబు సాకేతమున్. 47

క. సరయూసరిన్మణీపరి
సరయూపము లర్కకులజ జనపాలాగ్రే
సరయూధయజ్వభావ
స్ఫురణము మును చూపు నచటఁ జూపరుల కొగిన్. 48

సీ. పురవరంబెద్ది భాస్కర వంశనరపాల
ముక్తాఫలోద్భూతి శుక్తిపుటము
పట్టణంబెద్ది కైవల్యదస్థాన సం
ఖ్యాప్రసంగకనిష్ఠికావృతంబు
పుటభేదనం బెద్ది కుటిలారిపటుచమూ
చంచరీకావళీ చంపకంబు
స్థానీయ మెద్ది శ్రీజానకీజాని కీ
రాధిపస్థితిపంజరాంతరంబు

1. శ్రద్ధయనుదూతిక...ముక్తియనుస్త్రీ....

వాసిమీఱంగఁ గతిపయవాసరమ్ము
లట్టి సాకేతనగరమం దధివసించి
పూర్వభవవాసవాసనాస్ఫూర్తి వలన
రామరాయేంద్రుఁ డతులహర్షంబుఁ గాంచె. 49

గీ. మఱియుదక్షిణదేశభూమండలమున
నలరుదివ్యస్థలులఁగాంచునపుడు తొలుత
విపులతరభక్తిఁ బరిపాటి [1]విజయవాటి
రామనృపమౌళి కనకదుర్గను భజించె. 50

క. ఆగిరి ఫలికృతమందిరుఁ
డాగిరిధరుశౌరిశోభనాద్రిస్వామిన్
యోగిశతనుతుని నృపమణి
భోగిశయానుని నృసింహమూర్తి భజించెన్. 51

క. మంగళగిరినాయకునిన్
మంగళదాయకునిఁదనిపె మధుమధురతరా
భంగురపానీయంబుల
గంగాధరరామరాయ ఘనుఁ డతిభక్తిన్. 52

శా. ప్రీతిన్ భూతలనాథశేఖరుఁ డపు సేవించెన్ సమంచద్గతిన్
[2]లూతాహీభకిరాతమోక్షదుఁ గృపాళు న్వాయులింగాకృతిన్

1. అర్జునుఁడు తపముగావించిన చోటు, బెజవాడ. 2. సాలెపురుగునకు, పామునకు, ఏనుఁగునకు, ఎఱుకువానికి.

జ్ఞాతాజ్ఞాతసమస్తపాతకహరున్ శర్వున్ బ్రపన్నావళీ
చేతఃప్రీతికరుం జరాచరగురున్ శ్రీ కాళహస్తీశ్వరున్. 53

క. చలమర్తిగండబిరుదో
జ్జ్వలమహితుఁడుగాంచె రామజనపతి శేషా
చలమతిభక్తిని [1]శిఖరాం
చలమహితలచలదదభ్రజలదకులంబున్. 54

సీ. వెచ్చంబులిడకయే విత్తంబువడ్డితో
జనులచేఁగైకొను సాహుకారు
మందుమాకులొసంగు మాటలేకయరోగ
జాలము ల్మాన్చు భిషగ్వరుండు
భృత్యులనంపించుఁ గృత్యంబులేకయే
జనములరప్పించు కొనెడురాజు
స్థానంబువిడకయే తగుకష్టసుఖములొ
పనులందుఁదోడ్పడు బాంధవుండు

దలపఁగలివేళ బ్రత్యక్షదైవతంబు
శేషశైలనివాసిలక్ష్మీవిలాసి
పృథుకృపాభాస్వరుఁడు వెంకటేశ్వరుండు
మోదమువహించె రామరాట్పూజనముల. 55

1. శిఖరముకొనచోటను దిరుగుచున్న గొప్పమేఘసముదాయము గల దానిని.

క. చేరంజనికాం చెదరి
శ్రీరంజనచణుఁడు రామ నృపమణిభక్తిన్
శ్రీరంగము విపులతర
శ్రీరంగము సహ్యజాసరిత్తీరమునన్. 56

క. కావేరిజలములమృతము
గావే రిక్తేతరాప గాతతులు సరుల్
గావేరి నైనఁ దనుపుం
గావే రిఁకవలదు [1]విరజ గావలయునుగా. 57

సీ. ఏవీథిఁ జూడ బహిరికుడ్యయుగచిత్ర
మయశంఖచక్రాంక మందిరంబు
లేమందిరముఁ జూడ స్వామిభాగవతకైం
కర్యాప్త వైష్ణవా చార్యపురుషు
లేపూరుషుని జూడ పృథుతరద్రవిడ ప్ర
బంధాను సంధాన వాక్యవాద
మేవాదమాలింప శ్రీవల్లభా నంత
కల్యాణ గుణగణా ఖండ మహిమ

మట్టి ప్రత్యక్షపరమపదాభిధాన
మయిన ప్రాకారసప్తకోచ్ఛ్రయవిమాన

---

1. వైకుంఠ సమీపమున నున్న నది.

మందు నెల కొన్న రంగనాయకుఁ డభీష్ట
దాయకుఁడు గాడె సేవించు దాసులకును. 58

సీ. అందు శ్రీరామరాయక్షమానాయకా
గ్రణిపరివారసంఘములు వెంట
రాఁగ సంకల్ప పూర్వకముగాఁ గావేరి
నవగాహనస్నాన మాచరించి
యతిమంజుతరవిశుభ్రాంబరంబులు గట్టి
రహిఁ ద్వాదశోర్ధ్వ పుండ్రములు వెట్టి
యష్టాక్షరి జపించి యటమీఁద రామాయ
ణంబును బారాయణంబొనర్చి
సరలి మీఱంగఁ బ్రాకారసప్తకంబు
నకుఁ బ్రదక్షిణములు సల్పి నలినముకుళ
భాసమానాతిమానశోభాసమాన
మానితోత్తుంగరంగద్విమానమునను. 59

సీ. లలిమించు నల [1]మంచుమలగన్న కన్నెకు
సవతిపోరిడు [2]పదాబ్జములవాని
నలుమొగంబుల జగంబులఁజేయు దొరపుట్టఁ
బురిటిల్లొసంగిన బొడ్డువాని

1. హిమవంతుఁడు గన్న పార్వతికి. 2. గంగను గన్న పాదములు గల వానిని.

[1]జలజాతముల జాతముల ముఖంబులు విప్పు
మూయించు వింతకన్దోయి వాని
యుదరంబున దరంబు గదురఁగుండెడు కందు
కలుగుమందైన బల్కూర్మి వాని
డంబుగలపచ్చ డాల్పచ్చడంబు వాని
[2]పడగ గలవాని మీఁటించు పడగ వానిఁ
జెలువ మలరారు నెదఁ గొల్చు చెలువవాని
రంగదాదిత్య విభుని శ్రీరంగ విభుని. 60

మ. అమితానంద ఝరీపరీత హృదయుండై సారె వీక్షించి కా
యమురోమాంచసమంచితం బయి దగన్సాష్టాంగదండప్రణా
మముల న్వేమరు నాచరించి కరయుగ్మంబుఁ జేసం దోయిలిం
చి ముహుర్జృంభిత భక్తి యుక్తి వినుతుల్ చేసె న్విశేషంబుగన్.

సీ. స్వామి నీ నిర్వక్ర చక్రప్రభావంబు
నక్రవిక్రమ ఖండనం బొనర్చె
దేవ నీ నందను దివ్యచాతుర్యంబు
పురహరు తేరికి హరులఁ గూర్చె
రంగ నీ పదసంగగంగమాహాత్మ్యంబు
[3]మునికోపహతి భూతి ముక్తిఁ జేర్చె

---

1. సూర్యచంద్రులు కన్నులుగాఁగల వానిని. 2. పామును ఎగుర వేయు గరుడుని ధ్వజమున గలవాని. 3. కపిలుని—.

వరద నీదగు విభాస్వర దయాగరిమంబు
గర్భ స్థితార్భకు కాఁకఁదీర్చె
నిట్టి నీదివ్య పరికరంబెన్నఁ దరమె
తఱిమెదరు నీదు దాసానుదాసనరులు
నరులు నార్వార క్రతుభోజనంపు దొరల
దొరలనఁగ వచ్చునే నీకుఁ దోయజాక్ష. 62

క. కుజనులకు శిక్షసేయుచు
సుజనులకును రక్షసేయుచును సద్ధర్మం
బు జగతి సంస్థాపించుచు
గజిబిజి మాన్పుదువు ప్రతియుగంబును రంగా. 63

మ. అని యెన్నెని విధంబులం బొగడి దివ్యానర్ఘ్య రత్నప్రభా
ఘన కేయూరకిరీట ముఖ్యసదలంకారంబులు న్నిత్యమ
జ్జనతీర్థాహరణార్థమై యొక [1]మదస్తంభేరమేంద్రంబుఁ
గనికర్పించె ధరిత్రి నిట్టి ఘనులం గన్నారఁ గన్నారమే. 64

మ. కలనారామవసుంధరాపతికి రంగస్వామి ప్రత్యక్షమై
పలికెన్ శంకరపూజనాభిరతిచేఁ బ్రాపించు నైశ్వర్యమం
చలరెన్ దానమహేశ్వరస్థల నిరీక్షాపేక్షఫాలాక్షుని
స్తులపూజామలదీక్ష[2]తద్విమలచేతోవీధి సాధుస్థితిన్. 65

---

1. మదపుటేనుఁగును. 2. ఆ (రామారాయ) నిర్మల—.

క. అంతందన్నగరాతి
ప్రాంతంబున జంబుకేశ్వరంబను పేరం
గాంతంబగు హైమవతీ.
కాంతక్షేత్రంబుఁ గాంచి కఁడుభక్తిమెయిన్. 66

శా. సేవించెన్ జలభూతలింగమయు నక్షీణప్రభాస్వర
శ్రీవిభ్రాజితు సర్వదేవతరుణీ సేవ్యాఖిలాండేశ్వరీ
దేవీవల్లభు జంబుకేశ్వరమహాదేవున్ లసద్భక్తిఁ బూ
జావిధ్యుక్తమహోపచారకలితస్వర్ణాభిషేకాదులన్. 67

ఉ. కాంచిరి రామరాయమహికాంతుఁడు నాశ్రితులున్వసుంధరా
కాంచిశయానశంకరనికాయ్య[1]పురోజిర గోపురాగ్ర మాం
కాంచితగోపురంబు మణిహాటకసుందరమందిరంబు శ్రీ
కాంచిపురంబు లోచనయుగంబు గడున్సఫలత్వ మొందఁగన్. 68

సీ. నివసించు నెచటఁ బార్థివలింగమూర్తి యే
కామ్రనాథుఁడు చంద్రఖండమౌళి
వసియించు నెచ్చోట [2]వశిపూజనీయాంఘ్రి
కామాక్షి శాంకరీకామ కోటి
నుండు నెచ్చోట వేదండశైలమునందు
వరదరాజస్వామి వరదయుండు

1. ముంగిటి___. 2. జితేంద్రియులకు___.

పూనెనెచ్చటఁ [1]బరిస్ఫురణాభరణమైన
మేధతో విధి యశ్వమేధదీక్ష
మఱియు నలరారు నెచటఁ గంపాస్రవంతి
వేగవతి యను నది భవోద్వేగహంత్రి
యైన యొక్క మహానది యటులు మించి
కరిగిరినితంబకాంచి యా కాంచి నిలచి. 69

క. సరసలసద్రసదాళులఁ
దరులందరులందు మెలఁగఁ దగువనచరసుం
దరులందరులంగను చా
కరిగిరి కరిగిరి నృపాలకశ్రితులచటన్. 70.

సీ. ఏకామ్రపతికి ననేకవారములు న
మ్రశిరస్కులై ప్రణామములు సలిపి
కామాక్షి నిఖిలలోకములఁ బాలించు త
ల్లిని దేవతామతల్లిని భజించి
వరదరాజస్వామి కరుదయా శీలున
కలఘూపచార పూజలనొనర్చి
కల్యాణకోటస్థకల్యాణదాయిని
కమలవాసిని లక్ష్మి గారవించి

1. సమయసూర్ఫూర్తియే ఆభరణము గాఁగల—.

సకలదేశసమాయాత సకలవిప్ర
శాఖాభవవైశ్యశూద్రాదిబహులవర్ణ
పర్ణనీయసమాజసంబాధగరిమ
డంబుమీఱెడు గరుడోత్సవంబుఁ గనిరి. 71

శా. [1]కంకేళీకలనానుకూలతరరంగద్భంగసంగస్ఫుర
త్పంకేజాకరతీరచారుఫలపుష్పశ్రీనమల్లాంగలీ
[2]కంకేళీక్రము[3]కాహివల్లికదళీ ఖర్జూరతాళీవనీ
సంకీర్ణంబగు పాండ్యమండలము పజ్జంజొచ్చి యచ్చోఁగఁగన్. 72

మ. కనవచ్చెన్ మధురాపురంబు సకలక్ష్మాభోగభాగ్యోదయం
బనకుందావలమై మనోహరతరాభోగంపు భోగోచ్ఛ్రయం
బనకుం గేవలమైన మన్కియయి సొంపుల్మించు సౌరస్యపుం
గనియై కన్నులపండువై సుఖదమై కల్యాణసంస్థానమై. 73

క. మీనాక్షిగౌరి నచ్చట
జ్ఞానాక్షీణప్రభావసంధాయిని భా
గ్రీనాయకమణి కనక
శ్రీనాయకమణిసరాళిచే నర్చించెన్. 74

మ. స్తవనీయుండగు రామరాయవిభుఁడంతన్ సంశ్రితాన్వీతుఁడై
నవపాషాణములన్ [4]గ్రహాకృతుల నానందంబు డెందంబునన్

---

1. జలక్రీడ. 2. అశోకవృక్ష... 3. అహివల్లి-తమలపాకు తీగె.
4. సూర్యచంద్రాది గ్రహముల యాకృతి గలవానిని.

దపులంగన్గొని పక్షితీర్థమును మోదంబొప్ప వీక్షించి భ
క్తిఁ విలోకించి భజించె దర్భశయనక్షేత్రస్థితుఁ రాఘవుఁ. 75

శా. చేతఃప్రీతిగ నంత రామనృపతి శ్రేష్ఠుండు రామేశ్వర
ఖ్యాతక్షేత్రముఁ జొచ్చియచ్చట జగత్కల్యాణ దానక్రియా
స్వాతంత్ర్యస్థిర రామలింగవిభుసేవాలోలుఁడై గాంచెఁ దా
సీతారామ పునర్నిరీక్షణ శుభశ్రీహేతువుఁ సేతువుఁ. 76

సీ. రామకార్యార్థసంప్రార్థితుండై మహా
దేవుండు మును ప్రసాదించె నెచట
సచివయుక్తిగ విభీషణుఁడు పఙ్క్తిరథాత్మ
జులఁ జేరి శరణంబుఁ జొచ్చె నెచట
రాఘవక్రోధసంరంభభీతిఁ బయోధి
నిరపరాధతఁ దెల్ప నిలిచె నెచట
జాంబవన్ముఖవనేచరులు దాశరథులు
నాలోచన వ్యాప్తి నలరి రెచట
నట్టిపుణ్యప్రదేశంబు లచట నుండు
గురుజనంబులు వివరింప నరసి యరసి
[1]నిర్భరానందకందళోన్నిద్రహృదయుఁ
డయ్యె రామక్షమాతలాధ్యక్ష మౌళి. 77

---

1. పూర్ణసంతోషాంకురముచే వికసించిన—.

శా. భూనాథాగ్రణి రామరాయ విభుఁడాప్తుల్ దానునుం గూడి య
చ్చోనిష్ఠారతిఁ బూనిపావనధనుష్కోట్యాది తీర్థంబులం
దానంబుల్ప్రచరించి షోడశమహాదానంబులం జేసి గౌ
రీనేతన్ భజియించె భక్తహితకారిన్ రామలింగేశ్వరున్. 78

గీ. తీర్థసంవాసు లగు మహీదివిజవరుల
నమితధనభూషణాంబరాద్యర్పణములఁ
దృప్తులను జేసి మిగుల వార్షికములొసఁగు
చును మనుపుచుండె రామరాణ్మనుజ విభుఁడు. 79

క. [1]జలజహరగిరికరీందూ
జ్జ్వలదాంగ్లేయాబ్దమునను సన్మానసుఁడై
వెలయు నలరామమహీభృ
త్కులమణి యీసేతుయాత్రఁ గోర్కె నొనర్చెన్. 80

క. నర్మదనంతఁ బయోనిధి
నర్మదయుతమైనదాని నక్రప్రోష్ఠీ
కూర్మతిమి ముఖ్యజలచర
శర్మదఁ గని రామరాయజనవిభుఁ డనియెన్. 81

గీ. కలుగునిచ్చట బాణలింగములు[2]గములు
గాఁగ శీఘ్రతపస్సిద్ధి కరము గరము

---

1. 1871. 2. కుప్పలుగా.

దనరు నిచ్చట మిగులపావనము [1]వనము
గనరు దీన మునింగెడు జనులు[2]జనులు. 82

మ. అనియగ్గింపుచునన్నదీవిమలతోయంబందు సుస్నాతుఁడై
జననాథాగ్రణి తత్తటంబునఁ దప శ్చర్యైకనిష్ఠాతిపా
వనులౌ మౌనులఁ గొల్చి వారనుమతింపన్ బాణలింగంబులం
గొని తెచ్చెన్నిజరాజ్యమండలపురీ కోటిం బ్రతిష్ఠింపఁగన్. 83

గీ. మఱియు శ్రీరావుకులరాజమణి యొనర్చి
నట్టిసత్కార్యములు చాల నలరుచుండు
వాని నన్నింటి మిగుల విస్పష్టముగను
దెలిపెద మటంచు ననుఁగూర్చి బలికి రిటులు. 84

ఉ. సారయశోవిధూతఘనసారుఁడు రామమహేంద్రుఁడొక్కకా
సారముసారసాగ్రచరసారసవారము సస్యజీవనా
ధారము తీరజద్రుసముదారము చారువిసారవారసం
చారముఁగట్టఁ జేసెను బ్రశస్తిగ మల్లవరంబు చెంగటన్. 85

సీ. వేఁగిదేశము నేలు విభుఁడు దిగ్విజయావ
సరమందుదధిపరిసరమునందుఁ
దొలివీరచోళ చతుర్వేదిమంగళా
ఖ్యాగ్రహారముఁగట్టి నట్టిరీతిఁ

1. నీరు. 2. పుట్టువులను.

దెలుపు నే శాసనంబుల రామరాయభూ
రమణుండు ముద్రాంకితములఁ జేసె
నవి తామ్రమయములై యవనిఁ గాన్పించె స
చ్చరుమై న యట్టి యచ్చోటువునందె
ద్విజుల కారాజొసంగిన వివిధవృత్తి
భాగపరిమితియును వారి వారిగోత్ర
ములును నామంబులును జనంబులకొలంది
గనుఁగొనఁగఁ దేట తెల్లంబుగాఁగఁ దెలియు. 86

మ. ధరణీభృన్మణిరామరాయ విభుఁడుద్యద్బుద్ధివై శద్యవి
స్ఫురణందాలిచి పంచహాయనవయస్కుండై లసద్భక్తిత
త్పరతందానుపదేశ మొందెను మహాపంచాక్షరీమంత్రమున్
హరతుల్యుండగు వింజమూరికులకోనయ్యాభిధానార్యుచేన్. 87

మ. అనఘుండో[1] వరసౌమ్యయోగిమణి ప్రత్యక్షుండై రామరా
యనిస్వప్నంబునఁ దెల్పె సర్వపురమందాత్మప్రతిష్ఠాపనం
బును గావింపుమటంచు సత్కరుణఁ దత్పుణ్యాంబగణ్యాంబును
మ్మనఁగా నబ్బురమే ప్రపన్నులుప్రసన్నాభీష్టదేవుల్ గదా. 88

మ. కర మానందమునొంది రాజమణి దా గావించెనచ్చోట గో
పురనిర్మాణము దత్ప్రతిష్ఠయు మహాభోగంబుగాస్వామికిన్

1. మసవాళమహాముని.

స్థిరనిత్యోత్సవముల్ [1]ప్రబంధముహురధ్యేతృత్వపారీణతా
కరసద్వైష్ణవ పోషణంబును పురః కాసార కైంకర్యమున్. 89

చ. నవరసకావ్యభోజనరనాయకుఁడౌ మన రామరాడ్విభుం
డవిరళవాక్యగుంఫనము లందము నొందఁగ నాంధ్రసంస్కృత
ద్రవిడమనోజ్ఞభాషల దిరంబుగవర్ణనచేసెఁ బ్రౌఢిమై
నవితథభక్తితో వరవరాఖ్య మునీంద్రుఁ బ్రబంధశైలిగాన్. 90

ఉ. శ్రీనయశాలిమాలి యగు తిర్మలవెంకటనారసింహరా
మానుజదేశికోత్తముదయం దిరుమంత్ర మఖండభక్తిని
స్థానిరతిన్గ్రహించియల సర్వపురిం దగు సౌధమందిరో
ద్యానములుఁ మణిద్రవిణయానము లర్పణ చేసెఁ బ్రీతిగన్. 91

మ. నగరంబున్ ఘటియించె రామధరణీ నాథుండు సత్కీర్తిఁబూ
నఁగరంజిల్లెడు రాజమార్గములనానావర్ణసంవాసమా
నగరమ్యోన్నత సౌధజాలమున నెన్నం బట్టనశ్రేణిలో
నఁగరం బొప్పఁగఁ గాకినాడ పురిచెంతన్ సూర్యరాయాఖ్యచేన్.

మ. జలధిప్రక్రియఁ దత్పురీ వనసదేశంబౌ ప్రవేశంబునన్
బలభిత్ప్రాభవుఁడైన రామధరణీ పాలుండు గంభీరతా
కలనాస్పృష్ట ఫణిస్ఫటాకముఁదటాకం బంబు సంపూర్ణతా
త్యలఘుస్ఫూర్తి దలిర్ప సర్వజననిత్య స్నానపానార్థమై. 93

1. ద్రావిడభాషలోనున్న యాయిరములను మజల మజలంజదువుట యందలి సామర్థ్యమునకు స్థానములగు—.

గీ. వెండియును దత్పురంబున వేదశాస్త్ర
పాఠశాలలు బాలికా పాఠశాల
హూణవాక్పాఠశాలయు నుంచి మిగుల
ధనమొసఁగెఁ దత్ప్రవృద్ధిసాధనము గాఁగ. 94

ఉ. రామవిభుండు దీనజన రక్షకుఁడౌ రమణక్కపేటయన్
గ్రామము గాకినాడపురి రాజమహేంద్రవరంబు సధ్వగ
స్తోమములుండు తావులనుచున్ మది నెంచి కృపారసంబునన్
క్షామములొప్పు వేళలను సత్రములుంచె సమంచితంబుగన్. 95

చ. అదియును గాక పీఠనగరాహ్వయ మౌ నిజరాజధాని క
భ్యుదయ మహాభివృద్ధిగ సమున్నతిఁ గుక్కుటలింగ దేవునిన్
సదయునిఁ గుంతిమాధవుని సంతతమున్ బహుభోగపూజలన్
ముదితులఁ జేయు రామనృపముఖ్యుఁడు మాఘమహోత్సవంబులన్.

ఉ. ఒప్పుగ నొవ్వు[1] చప్పరము[2]లుప్పరిగల్ బహువారియంత్రము
ల్గొప్పగు గొత్త[3]కొత్తళములున్నొదవై తగు నెల్లవానియం
దప్పురి కోట నాయితములై కననొ రచనావిశేషముల్
చెప్పితిఁగాఁదె యీకృతిరచించుచుఁ జోఁ బురవర్ణనంబునన్. 97

గీ. మఱియు నక్కోట లోన రామప్రభుండు
చెన్నఘంటాభిధానంబు చెన్ను మీఱు

1. పందిళ్లు. 2. మేడలు. 3. కోటబురుజులు.

దుర్గరత్నాపరాయణదుర్గ నిలిపి
జాతరల్సేయునేఁటేఁట జాతరతిని. 98

ఉ. ధాత్రితలప్రజాభిలషితప్రతి పాదక కాశికాదిక
క్షేత్రకదంబకానిశనిషేవణలాలస మానసాఖిల
శ్రోత్రియధారుణీ దివిజసూరిజనస్తవ నైకపాత్రమౌ
సత్రము రామరాయ మహిజాని ఘటించెను బీఠికాపురిన్. 99

చ. సమధికరీతి రామనృపశౌరి ఘటించె నొగిన్ పితృవ్యనా
మము భువి సుస్థిరంబుగ సమస్తజనస్థితి యోగ్యమై తగన్
బ్రమదముతోఁ గుమారనగరం బను పేరిట నగ్రహారమున్
సుమహిత[1] నిష్కుటప్రకరసుందరమందిరవీథ్యుదారమున్. 100

మ. అనణీయస్తరకీర్తిలాలసతచే నయ్యగ్రహారంబునం
[2]దినవర్యుండెలమిం దగన్ ద్రిముఖలింగేశప్రతిష్ఠాపనం
బొనరించె న్నిజభృత్యబంధువిబుధోద్యోగీంద్రగేహంబులుం
బొనరించెన్ ఘటియించె నిష్కుట వనంబుల్ రాజమార్గంబునన్.

క. నవఖండ్రవాడచెంగట
నవనీంద్రుఁడు మాతృనామ మాకల్పంబై
ప్రవిదితముగ ఘటియించెను
భువి[3]కాకల్పంబుగాఁగఁ బురమొకటిదగన్. 102

1. తోఁటలగుమిచేతను. 2. రాజశ్రేష్ఠుఁడైన రామరాయరాజు. 3. భూషణము.

సీ. ప్రకటపంచారామపావనక్షేత్రసం
చయకుమారారామసంజ్ఞికంబు
పరమపవిత్రనిర్ఝరిణీగణఖ్యాత
భీమనదీతీరవిలసితంబు
భువనావనక్రియాప్రవణత్రిపురసుంద
రీపరదేవతాప్రియగృహంబు
ప్రచురమాండవ్యనారాయణశ్రీమహా
విష్ణుదేవస్థానవిశ్రుతంబు
కోరికలవృద్ధి నృపులు గైకొన్న పుణ్య
నిలయ మగు భీమవరమహాస్థలమునందు
భీమలింగేశ్వరునకు శ్రీరామరాయ
విభుఁడు బహుపూజనములఁ గావించుచుండె. 103

మ. శివరాత్రిప్రథమానపుణ్యసమయశ్రీభీమలింగార్చ[1]న
ప్రవణాశాగతసర్వపాశుపతసద్వర్గోపవాసవ్రతో
ద్భవపీడాపహృతిఁ జేయుచుండుసుపదార్థస్ఫూర్తినేఁ డేఁటస
య్యవనీంద్రుండు దయాళుఁడై సరసమృష్టాన్నప్రదానంబునన్.104

మ. వెలగోటీపురశాసనాంకకులజోర్వీనాథుఁ డౌ యాచభూ
వలయాధీశుద్వితీయసూను నెనరొప్పన్ రామకృష్ణేంద్రు న

1. పూజించుటయందాసక్తులై (నానా) దిక్కులనుండి వచ్చిన—.

త్యలఘుప్రాభవుఁబుత్రుగాఁ బడసి సూర్యారాయరాణ్ణామసం
కలితుంజేసె జగత్ప్రసిద్ధిగ మహాకౌతూహలం బొప్పగన్. 105

క. కంతునిహారి హరిహయుఁడు జ
యంతుని నలకూబరుని ధనాధిపుఁడు నుమా
కాంతుఁడు కుమారునింబలె
సంతసిలంజేయు చుండె జనపతి సుతునిన్. 106

క. ఆనందను నరనాయకుఁ
డానందముతోడఁ బరిణయాది శుభశ్రీ
మానితునిఁ జేసి ఘనవి
ద్యానిపుణత గలుగఁ జేసె నార్యులవలనన్. 107

క. తనరం గనియెన్ దనయుని
సునయుం డల రామకృష్ణ సూర్యారాయా
వనినాథుఁడు ప్రద్యుమ్నుం
డనిరుద్ధునిఁ గనినమాడ్కి నతిసుకుమారున్. 108

క. రంగద్గతి న ప్పౌత్రుని
గంగాధరరామరాయ ఘననామముతో
[1]సంగతునిఁజేసి నుతియు
ప్పొంగఁగ రామప్రభుండు వొదలుచునుండెన్. 109

---

1. కూడినవాని.

క. క్షితినొక పుత్రిక మఱియొక
సుతుఁగని యలరామకృష్ణ సూర్యప్రభుఁడా
సితకరలక్ష్మీ కౌస్తుభ
యుతుఁడగు జలనిధియునోలె నొప్పారుచునుండెన్. 110

చ. వరగుణరత్నమండల విభాసురుఁడౌ మసరామరాణ్మహీ
శ్వరజనశేఖరుండు వరసత్రకదంబక పాఠశాలికా
ద్యురతరధర్మకార్యవిని యోగమొసర్పఁగఁ దోటపల్లిస
త్పురవరరాజ్యముం గొనియె భూరితరద్రవిణంబు పోసంగుచున్.

సీ. ఎచ్చోట విఖ్యాతి కెక్కు గోదావరీ
గర్భాంతర ద్వీపఘనధరిత్రి
యెచ్చోటనొప్పుఁ [1]గొప్పీశ్వరస్వామికిఁ
జెంత[2]మందేశ్వర క్షేత్రవాటి
యెచ్చోట నలరారు పృథుఫలసరసామ్ర
పనసాదిఘనసాల వనసమూహ
మెచ్చోటనెల్లెడ నెసగువిద్వచ్ఛ్రోత్రి
యప్రాయ బహుశాగ్ర హారసీమ
లట్టిపని వెలనగరరాజ్యంబు రామ
మేదినీనాథమాళికి మేనయత్త

1. ధమ్మిల్లేశ్వర—. 2. మందపల్లి.

చిత్తమిగురొత్త వాత్సల్యవృత్తి దనర
శాశ్వతంబుగ ననుభవించఁగ నొసంగె. 112

చ. చలమున సాహసంబునను శౌర్యమునన్ మనరేని నేరుపున్
దెలుపఁగ నేటికిక్ వినుఁ డిదే యల రంపకుఁజెంత వింధ్యభూ
స్థలిని జెరించు మన్నెపుఁబ్రజ ల్గమిగట్టుకు పెల్లురేఁగి వి
చ్చలవిడి దేశవాసులకు సారెకు బాధలొనర్చు చుండఁగన్. 113

మ. కినుకన్ వారల పెంపడంచుటకు నాంగ్లేయాధిపానుజ్ఞఁగై
కొని వారించె నొగిక్ నివాతకవచక్రూరాసురస్తోమ మిం
ద్రుని యాజ్ఞంగొని సవ్యసాచి మును నిర్మూలంబుఁగావించిన
ట్లిన యేరామనృపాలమౌళి కితరోర్వీంద్రుల్ ప్రతాపంబునక్. 114

సీ. అమరావతీపురీ సమరామణీయకా
క్రాంతమహాకాళికా ఘట్టమునను
సంయమనీపురీ సంపదౌన్నత్యమై
చెన్నొందుచున్నట్టి చెన్నపురిని
వరుణపట్టన రమాస్ఫురణ విభ్రాజమా
నంబైన బొంబాయి నగరమందు
నలకాపురైశ్వర్యములకాస్పదంబౌచు
భాసిల్లు [1]నాగరాపట్టనమున

---

1. ఆగ్రా.

లోకపాలురఁబోని త త్ప్రకటాధి
కారమువహించుగౌర్నరు ల్గారవంబుఁ
జేయ నయ్యెపురంబు వీక్షించెనహహ
యవని నిటువంటి రాజులెందైనఁ గలరె. 115

చ. అరయఁగ శాలివాహశక మందు [1]గజాభ్రకరీందు సంఖ్యచే
వఱలెడు పార్థివాఖ్యమగు వర్షమునందు [2]నభస్యమాసమం
దురుతరకృష్ణ పక్షమున నొప్పెడుద్వాదశి [3]శీతరశ్మివా
సరమున రాతిరిన్ మిథున సంజ్ఞకరాశిని [4]పూర్వఫల్గునిన్. 116

చ. కనియెను రామరాయమహికాంతుఁడు పట్టపుదేవి యందున
న్మనసిజమూర్తి వేంకటకుమారమహీపతిసూర్యరాయరా
ణ్మనుజవరాభిధాను సుకుమారు నిజైక మహాభుజాశ్రితా
వనిజనపూర్వ పుణ్యపరిపక్వఫలాకృతి యగు కుమారునిన్. 117

గీ. [5]శాలివాహశకేభ పుష్కరకరీందు
లందుఁబార్థివవర్ష మందాశ్వయుజము
నందుశుక్లచ్ఛదైకాదశీందువాస
రమునశతభిషగుఁడు మీనరాశియందు. 118

గీ. అంతనాలవదేవేరియందు మఱియుఁ
గన్యశ్రీమాన్య సద్గుణ ధన్యఁగాంచి

1. శక 1808; క్రీ. శ. 1885. 2. భాద్రపద—. 3. సోమవారమున. 4. పుబ్బ.
5. శక 1808; క్రీ శ. 1885. శు. ౧౧ సోమవారమున.

యామె వేంకటరమణ యాంబాభిధానఁ
గానొనర్చెను రామభూకాంతమణి. 119

సీ. కలనైన నన్యకాంతల నించుకేనియు
దలఁపని యట్టినిర్మల గుణుండు
శివకేశవుల యందు లవలేశమును భేద
భావమూనని యట్టి భక్తివరుఁడు
తనయాశ్రితుల నెల్ల [1]తనయత్వ బుద్ధిచేఁ
బ్రోచి కాచుచు నుండు పోషకుండు
విపులవిద్యల నెల్ల నుపదేశమాత్ర నా
య్యన నేర్చి నట్టికుశాగ్ర బుద్ధి
ప్రాకటాఖండతరదానపండితుండు
మహిత రేచర్లగోత్రాబ్ధితుహినకరుఁడు
రమ్యయశుఁడు గంగాధరరామరాయ
ధరణినాయకమణిసాధారణుండె. 120

మ. అనియుష్మచ్చరితంబుఁ దెల్పినమహాహర్షంబుతో నాలకిం
చిని తాంత ప్రతిభాప్రసిద్ధులగు మీనిష్ఠాగరిష్ఠత్వము
న్వినయంబున్ ఘనధర్మశీలతయు పాండిత్యంబుదాతృత్వముః
దనరం బేర్కొనినాఁడ నేర్చుగతినుద్యద్రావువంశాగ్రణీ. 121

1. తనయభావముతో.

మ. ఇలలోనుత్తమధర్మశాలి వన నీవే సద్యశఃపూరితా
ఖిలదిక్పాళి వనంగ నీవె పరమోత్కృష్టాత్మవిజ్ఞానని
ర్మలచిత్తుండ వనంగ నీవె పరికింపన్ రాజలోకంబునన్
బలభిత్ప్రాకటదివ్యవైభవకలాపా రామరాయాధిపా. 122

ఉ. మానవసాధకోటికి సముంచితదానము గల్గిసం బరి
జ్ఞానము గల్గియుండ దవి గల్గినచో ద్విజభక్తి గల్గదా
హానిరవద్యరీతివిబుధాగ్రణులెన్నఁగ సట్టిదానమున్
జ్ఞానమువిప్రభక్తియును గల్గెనుమీయెడ రామరాణ్మణీ. 123

మ. పటుభావార్థరసాదికంబులు దలిర్పన్ హృద్యమాపద్యమొ
క్కటి గావించినవారిభూరితరసత్కారంబులం దన్పుచుం
డెటిమీపై నికృతుల్ రచించుసుకవులేరీవిన్ మహైశ్వర్యులం
పటులై పాటిల నబ్రమా సుగుణధామా రామరాయాధిపా. 124

మ. స్థిరరీతింగృతిఁజెందఁజాలరు ధరిత్రిం జెందినం [1]దద్రసో
త్కరముం గానరుగాంచినందగివ సత్కారంబుగావింప నే
రరు విస్ఫారధనాఢ్యులై యితరులౌరా చాలనీవన్నిటం
బరికింపన్ సరసుండవౌసుగుణధామా రామరాయాధిపా. 125

మ. వినుమీస్తోత్రముగాదునాడుపలుకున్ విశ్వంబులోనీసముల్
ఘను లేరీ మహనీయచర్యుఁడవు విద్యాభోజభూజాని వా

---

1. ఆకావ్యమునందలి శృంగారాదిరస సముదాయమును.

ర్యనికాయసుతదానధుర్యుఁడవు విద్యాభోజభూజాని వ
మ్మనుమార్గజ్ఞుఁడవుంగదా మదిఁదలంపన్ రామరాయాధిపా. 126

శా. సారజ్ఞత్వముగల్గుమీరలలి నా చంద్రార్కతారంబుగా
సౌరాకీర్తివహించిమాదృశసమస్తశ్రోత్రియాధారులై
యారూఢిన్ సుతవృద్ధిగల్గిశతవర్షాయుష్కులై ధారుణీ,
ధౌరంధర్యముగల్గివర్ధిలఁగమద్దైవంబులన్వేఁడెదన్ 127

క. సురుచిరకీర్తి[1]మరాళీ
చరణేభవదరుణకిరణ సకలాశ్రితభూ
సురశరణాకృతమహిసం
భరణావరకరుణనృపతి మకుటాభరణా. 128

మ. సమదారాతివిరామరామచరితా శ్రాంతైకపారాయణ
క్రమకృణ్మానసమానసాలయసుధా కాశప్రతీకాశకీ
ర్తిమహానిర్మలధామధామకలిత శ్రీపాదమంజీరవి
భ్రమకృద్విత్తవిరావరావమలగోత్రాగోత్ర జిద్వైభవా. 129

మాలినీవృత్తము.

సదమలపరమార్థజ్ఞానభూయిష్ఠనిష్ఠా
సదయహృదయవిద్యా సారవిద్ధీగరిష్ఠా
మృదులమధురవాక్య శ్రీనిధీసుప్రతిష్ఠా
ప్రదగుణగణరామా రాయభూభృద్వరిష్ఠా 130

---

1. తెల్లనిశరీరము ఎఱ్ఱనికాళ్లును ముక్కునుగల యంచరాయంచ.

## గద్యము

ఇది శ్రీజానకీరమణ చరణారవింద నిష్యందమాన మరందపానానందా
నంద మిళిందాయమాన మానస కౌండిన్యగోత్ర పవిత్ర దేవులపల్లి వంశ
సంభూత సీతారామ విద్వన్మణి పౌత్ర వేంకట కృష్ణశాస్త్రీంద్ర
పుత్ర సుబ్బరాయ సుధీవరసోదర విబుధజన విధేయ వేంకట
కృష్ణశాస్త్రి నామధేయ ప్రణీతంబైన రావువంశ ముక్తావళీ
ప్రబంధంబునందుఁ షష్ఠాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శుభోదయా ముద్రాక్షరశాలయందు ముద్రితము, మద్రాసు—6.

